మే & జూన్ 2011 వెల: రూ.20/-

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY

# ఐక్య ఉపాధ్యాయ

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక



నివాళి

కోడూరు నారాయణరావు

యుటియఫ్ ప్రథమ రాష్ట్ర అధ్యక్షులు

మరణం : మే2, 2011



## విజయవంతమైన యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభలు

కర్నూలు - మే 9-11, 2011

# 12వ రాష్ట్ర మహాసభల దృశ్యాలు




ప్రారంభసభలో మాట్లాడుతున్న సీతారాం ఏచూరి, రాజ్యసభ సభ్యులు



ముగింపు సభలో మాట్లాడుతున్న ముఖ్య అతిథి పురంధేశ్వరి
కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ సహాయ మంత్రి







కర్నూలు నగరంలో ఉపాధ్యాయుల మహాప్రదర్శన దృశ్యాలు




సభికులకు అభివాదం చేస్తున్న పిడిఎఫ్ ఎం.ఎల్.సి.లు, యుటియఫ్, జెసి నాయకులు






మహాసభలకు హాజరైన ఉపాధ్యాయులు

మరికొన్ని దృశ్యాలు లోపలిపేజీల్లో...

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY
ఐక్య ఉపాధ్యాయ
ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక
మే, జూన్ 2011
సంపుటి : 37
సంచిక : 5,6

సంపాదకీయం

# అక్రమబద్ధీకరణ, బలవంతపు బదిలీలు

విద్యాహక్కు చట్టం ప్రకారం 6-14 సంవత్సరాల వయస్సుగల పిల్లలందరికీ నాణ్యమైన విద్యను ఉచితంగా అందించాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. కాని మన రాష్ట్ర ప్రభుత్వం ఆ చట్టం పేరు జెప్పి క్రమ బద్ధీకరణ పేరిట పాఠశాల విద్యను దుంప నాశనం చేసేందుకు పూనుకున్నది. క్షేత్ర స్థాయిలో పాఠశాలల అందుబాటు, ఉపాధ్యాయుల పని భారం, విద్యార్థుల సంఖ్య వంటి అంశాలను పరిగణన లోకి తీసుకోకుండా, కనీసం విద్యావేత్తలు, ఎమ్మెల్సీలు, ఉపాధ్యాయ సంఘాలతో సంప్రదించకుండా కంప్యూటర్‌లోని గణాంకాల ఆధారంగా పాఠశాలలు, ఉపాధ్యాయ పోస్టుల క్రమబద్ధీకరణకు పూను కోవడం తీవ్ర అభ్యంతరకరం.

పాఠశాలల్లో అవసరానికి మించి ఉన్న అదనపు పోస్టులను అవసరమైన పాఠశాలలకు సర్దుబాటు చేయడాన్ని తప్పుపట్టలేము కానీ కొన్ని పాఠశాలలను మూసివేసి, మరి కొన్ని పోస్టులను డీగ్రేడ్ చేసి, హైస్కూల్ ఉపాధ్యాయులపై పనిభారాన్ని పెంచేసి ఉపాధ్యాయ పోస్టులను కృత్రిమంగా మిగులు తేల్చి సర్దుబాటు చేయడాన్ని ఎలా సమర్థిస్తాము.? ఇంతాజేసి ఇంకా అవసరమైన పాఠశాలల్లో అదనపు పోస్టులు సృష్టిస్తారా అంటే కొత్తగా ఒక్క పోస్టుకూడా మంజూరు చేసేది లేదన్నారు.

జాతీయ విద్యా విధానం 1986 ప్రకారంగానీ, విద్యాహక్కు చట్టం 2009 ప్రకారం చూసినా ప్రాథమిక పాఠశాలల్లో కనీసం ఇద్దరు టీచర్లు ఉండాలి. ప్రభుత్వ నిర్వాకం వల్ల సుమారు 2 వేల ప్రాథమిక పాఠశాలలు ఒక్క టీచరూ లేకుండా అధికారికంగానే మూతపడనున్నాయి. 5వేల పాఠశాలలు ఏకోపాధ్యాయ పాఠశాలలుగా మారిపోతున్నాయి. ఇవన్నీ ప్రధానంగా గిరిజన, బహుజన ఆవాస ప్రాంతాల్లోని పాఠశాలలే కావడం గమనార్హం. ఏ వర్గాలకైతే నాణ్యమైన ప్రభుత్వ విద్య అందాల్సి వుందో ఆ వర్గాలకే ఉద్దేశపూర్వకంగా ప్రభుత్వం విద్యను అందుబాటులో లేకుండా చేసి నష్టం కలిగిస్తున్నదన్నమాట.

1998లో బాలికల అక్షరాస్యత పెంపుదల కోసం మంజూరు చేసినా10,647 ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుల పోస్టులను ఆ లక్ష్యం నెరవేరిందోలేదో సమీక్షించకుండానే ఏకపక్షంగా ఎస్‌జిటిల స్థాయికి దిగజార్చి ఇతర పాఠశాలలకు తరలించారు. ఎల్‌ఎఫ్‌ఎల్ ప్రధానోపాధ్యాయుని పోస్టును ఎస్‌జిటిగానే లెక్కించేటప్పుడు వేరే చోటికి తరలించాల్సిన అవసరమేమొచ్చిందంటే అధికారుల వద్ద సమాధానం లేదు.

ఉన్నత పాఠశాలల్లో స్టాఫ్ ప్యాట్రన్‌కు సంబంధించి జి.ఓ.లు 39, 103లలోని నిబంధనల ప్రకారం తరగతుల వారీగా విద్యార్థుల సంఖ్యను పరిగణనలోకి తీసుకొని ఉపాధ్యాయుల సంఖ్యను నిర్ణయించాల్సి వుండగా అందుకు భిన్నంగా పాఠశాలలోని మొత్తం విద్యార్థుల సంఖ్య ఆధారంగా కనీసం మీడియం తేడాను కూడా చూడకుండా ఉపాధ్యాయ పోస్టులను నిర్ణయించారంటే అధికారుల అవగాహనా రాహిత్యానికి ఇంత కంటే నిదర్శనం ఏంకావాలి? అధికారుల బాధ్యతారాహిత్య చర్యల వల్ల వేలాది పోస్టులు మిగులుగా తేలి అందు పని చేస్తున్న ఉపాధ్యాయులు అర్థాంతరంగా స్థాన భ్రంశం చెందాల్సిన దుస్థితి దాపురించింది.

యుటియఫ్ అకడమిక్ విభాగం పక్షాన క్రమబద్ధీకరణ నిబంధనలను అధ్యయనం చేసి అశాస్త్రీయతను సోదాహరణంగా వివరించే ప్రయత్నం చేస్తే మీ పత్రికలో వ్యాసాలు వ్రాసుకోండంటూ విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి చులకన చేసి మాట్లాడారు. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు ప్రాతినిధ్యం చేసినా, యుటియఫ్ రాష్ట్ర వ్యాప్త ఉద్యమం నిర్వహించినా ప్రభుత్వ వైఖరిలో చలనం లేదు. అనివార్యంగా అక్రమ క్రమబద్ధీకరణపై యుటియఫ్ పక్షాన హైకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని వేయాల్సి వచ్చింది.

ఉపాధ్యాయుల బదిలీ నిబంధనలను కూడా ఏకపక్షంగా రూపొందించారు. ఉపాధ్యాయ సంఘాలతో సంప్రదించటం గానీ, ఉపాధ్యాయ సంఘాల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోవడంగానీ చేయలేదు. కౌన్సిలింగ్ విధానం అమలు జరుగుతున్న గత 13 సంవత్సరాల కాలంలో ఏ ప్రభుత్వంగానీ, అధికారులుగానీ ఇంత దుర్మార్గంగా వ్యవహరించలేదంటే అతిశయోక్తి కాదు.

ఉపాధ్యాయ సంఘాలు ప్రధానంగా యుటియఫ్ నిర్వహించిన పోరాటాల ఫలితంగా 1998 నుండి బదిలీలలో కౌన్సిలింగ్ విధానం అమల్లోకి వచ్చింది. బదిలీలలో అధికారుల చేతి వాటాన్ని అరికట్టేందుకు సంఘాల ప్రతినిధులను కౌన్సిలింగ్‌లో ప్రత్యక్ష పరిశీలన కోసం అనుమతించేవారు. ఈసారి అటువంటి అవకాశం లేకుండా చేశారు. సంఘ ప్రతినిధులను అనుమతించాలని ఉపాధ్యాయులు ఆందోళన చేస్తే పోలీసుల బలప్రయోగంతో అణచివేసి నియంతృత్వంగా వ్యవహరించారు. మహబూబ్‌నగర్‌లో సంఘాల నాయకులు ఇరువురిని ఏకంగా సస్పెండ్ చేశారు. బదిలీల జి.ఓ.లలో అస్పష్టంగా ఉన్న నిబంధనలపై వివరణ ఇవ్వాలని ప్రాతినిధ్యం చేస్తే ఏ ఒక్క నిబంధనపైనా వివరణ ఇవ్వకుండా దాటవేశారు. బలవంతంగా బదిలీ అయ్యే ఉపాధ్యాయులకు లోగడ వినియోగించుకున్న ప్రాధాన్యతలను నిరాకరించి నిరంకుశంగా వ్యవహరించారు.

గత బదిలీలలో నష్టపోయిన 2006 డిఎస్‌సి ఉపాధ్యాయులకు, 2009 జనవరి/ఫిబ్రవరిలో ప్రమోషన్ పొందిన వారికి బదిలీకి అవకాశం ఇవ్వమంటే నిరాకరించారు. సంఘాలు ఆందోళన చేస్తే 2009 ప్రమోటీస్‌కు మాత్రమే అవకాశం కల్పించి 2006 వారికి నిరాకరించారు. అదేమంటే అమాత్యుల ఆదేశాలన్నారు. అధికారుల వైఖరితో విసుగు చెందిన బాధితుల్లో కొందరు న్యాయం కోసం ట్రిబ్యునల్‌ను ఆశ్రయించి సానుకూల ఉత్తర్వులు తెచ్చుకున్నారు. ట్రిబ్యునల్ ఆదేశాలను సాధారణీకరించి అందరికీ వర్తింపజేయమంటే నిరాకరించి వేలాది మందిని ట్రిబ్యునల్ బాట పట్టించారు. న్యాయస్థానం తీర్పులను అమలు చేయకుండా తొక్కిపెట్టడానికి విశ్వప్రయత్నం చేశారు. 2011 బదిలీలను ప్రహసనంగా మార్చి వేశారు. డబ్బు, పలుకుబడి వున్న వారికి కోరుకున్న స్థానాన్ని సెక్రటేరియట్ నుండే ప్రత్యేక ఉత్తర్వులతో నేరుగా కట్టబెడుతున్న ప్రభుత్వం ఉపాధ్యాయుల సాధారణ బదిలీల పట్ల ఇంత అనాసక్తంగా వ్యవహరించడాన్ని బట్టి విద్యారంగం పట్ల అమాత్యులు, అధికారులకుగల చిత్తశుద్ధి ఏపాటిదో అర్థమౌతున్నది. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే ప్రభుత్వ విద్యకు, ఉపాధ్యాయులకు తీవ్ర నష్టం కలుగుతుంది. ప్రభుత్వ తప్పుడు విధానాలను ప్రతిఘటించటానికి రాజీలేని ఉద్యమాలే పరిష్కారం. ఈ నేపథ్యంలో పాలక పార్టీ తొత్తులు, ప్రభుత్వ ఏజెంట్లను పక్కన బెట్టి ఉపాధ్యాయుల ప్రయోజనాల పరిరక్షణ కోసం పాటుపడే సంఘాలన్నీ ఐక్యంగా ఉద్యమిస్తేనే ప్రభుత్వ విద్యారంగం మనగల్గుతుంది. ♦

# ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక మాసపత్రిక

మే, జూన్ - 2011

సంపుటి : 37 సంచిక : 06




## ఈ సంచికలో .....




| | | |
|---|---|---|
| దశాబ్ది చందా | : | రూ.850-00 |
| 5 సం॥ చందా | : | రూ.450-00 |
| సంవత్సర చందా | : | రూ. 100-00 |
| విడిప్రతి | : | రూ. 10-00 |

**SBI Online A/c No. 30206957939**



**ఐక్య ఉపాధ్యాయ**

గగన్ మహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ,

హైదరాబాద్-29.

Ph.No. : 040-27636840

Fax. No. : 040-27650366

MobileNo. : 9490300573

Website : www.aputf.org.

E-mail : ikyopadhyaya@gmail.com


## ఉపాధ్యాయ పెన్నిధి, ఉద్యమాల సారథి

# యుటియఫ్‌లో సభ్యులుగా చేరండి

**మిత్రులారా !.**

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) సభ్యత్వ నమోదు, ఫండు క్యాంపెయిన్ జరుగుతున్నది. మీరు యుటియఫ్‌లో సభ్యులుగా చేరాలని ఆహ్వానిస్తున్నాము. ఉపాధ్యాయుల, విద్యారంగ సమస్యల పరిష్కారానికి నిరంతరం కృషి చేస్తున్న ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌కు మీ సభ్యత్వం ఇచ్చి మరింత బలోపేతం చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

గత సంవత్సర కాలంలో యుటియఫ్ పక్షాన స్వతంత్రంగా అనేక ఆందోళనలు, పోరాటాలు, సదస్సులు నిర్వహించాము. అవిశ్రాంత పోరాటాలతో అసాధారణ విజయాలు సాధించాము. జెఏసి ఉద్యమంలో క్రియాశీల పాత్ర పోషించాము. జెఏసి ఇచ్చిన పిలుపులన్నింటినీ జయప్రదం చేశాము. అప్రెంటిస్ టీచర్ల నోషనల్ ఇంక్రిమెంట్ల అమలుకు వివరణల ఉత్తర్వులు, నెలవారీ ప్రమోషన్లు, మున్సిపల్ పాఠశాలల 1027 పోస్టుల మంజూరు, గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల సర్వీస్ రూల్స్, ఈ పాఠశాలలకు 2151 పోస్టులు మంజూరు, జెఏసి ఒప్పందంలో భాగంగా ఎస్‌సి,ఎస్‌టి,బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు 6/12/18/24 సం॥ల స్కేళ్ళు, ఇంటి అద్దె 2 శాతం పెంపు, మహిళలకు గర్భసంచి తొలగింపు ఆపరేషన్ సందర్భంలో 45 రోజుల ప్రత్యేక సెలవు, అప్రెంటిస్‌షిప్ రద్దుకు అంగీకారం వంటి మంచి విజయాలు సాధించుకొన్నాము.

మున్సిపల్, గిరిజన, ఎయిడెడ్ పాఠశాలల్లోని, అప్రెంటిస్ ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్ల అమలుకు ఉత్తర్వుల కోసం కృషి జరుగుతున్నది. మున్సిపల్, గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల ముఖ్యమైన సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నాము. ఎయిడెడ్ ఉపాధ్యాయ సమస్యలపై మన సంఘం ద్వారాను, పిడిఎఫ్ ఎమ్మెల్సీల పక్షాన ఎన్ని పోరాటాలు చేసినా ఫలితాలు రాలేదు. 2008 డిఎస్‌సి నియామకాల కోసం మంచి కృషి చేశాము. అప్రెంటిస్ వ్యవస్థను రద్దు చేసి రెగ్యులర్ స్కేలు ఇవ్వాలని చాలా పోరాటాలు చేశాము. చివరకు జెఏసితో ఒప్పందం చేసుకొని కూడా ప్రభుత్వం ఉత్తర్వులు ఇవ్వడం లేదు. అప్రెంటిస్ వ్యవస్థ అంతంకోసం అంతిమ పోరాటానికి సిద్ధమవుతున్నాము.

పండితుల, పిఇటిల అప్‌గ్రేడేషన్,యాక్ట్ 1/2005 మరియు యాక్ట్ 37/2005 రద్దు, 398 ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు, 1990 తర్వాత నియామకమైన రూ.398/- ఉపాధ్యాయులకు ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కేలు, ఎంఇఓ పోస్టుల భర్తీ వంటి పలు సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నాము. విద్యాహక్కు చట్టం, ఆర్ఎంఎస్ఏ పథకాలు అమలు చేయించడానికి, పాఠశాలల సమస్యల పరిష్కారానికి, ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకు యుటియఫ్ ప్రత్యేక కృషి చేస్తున్నది. అసంబద్ధమైన రేషనలైజేషన్ విధానాన్ని, పాఠశాల విద్యాశాఖను రెండు శాఖలుగా విభజించాలనే ప్రతిపాదనను యుటియఫ్ పక్షాన తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాము.

యుటియఫ్‌లో 1 లక్ష 25 వేలమంది సభ్యులుగా ఉన్నారు. మరింత ఎక్కువమంది చేరితే ఉపాధ్యాయ ఉద్యమం మరింత బలోపేతం అవుతుంది. సమస్యల పరిష్కారానికి బలం చేకూరుతుంది. కావున యుటియఫ్‌లో సభ్యులుగా చేరాలని, చేర్పించాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

ఈ కాలంలో యుటియఫ్, జెఏసి తరపున మండల, జిల్లా, రాష్ట్ర స్థాయిలలో జరిగిన అనేక పోరాటాలకు లక్షలాది రూపాయలు ఖర్చు అయ్యింది. రానున్న సంవత్సర కాలంలో నిర్వహించాల్సిన ఉద్యమాలకు, సంఘ కార్యక్రమాలకు అవసరమైన ఆర్థిక సహకారాన్ని అందించాలని, సంఘం ఆర్థికంగా బలపడేందుకు జనరల్ ఫండ్ రూంలో విరివిగా విరాళాలు ఇవ్వాలని కూడా కోరుతున్నాము.

ఉద్యమాభివందనములతో ....

హైదరాబాద్,తేది. 06.06.2011 **ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్,** రాష్ట్ర కమిటీ

# పాఠశాల విద్యను దెబ్బ తీసే క్రమబద్ధీకరణ వద్దు



ఎన్. నారాయణ
యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు

ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయ పోస్టులను క్రమబద్ధీకరించాలని ష్ట్ర విద్యాశాఖ గత ఏప్రిల్ 23న జి.ఓ.55 ఇచ్చింది. దానికి కొన్ని వరణలు చేస్తూ మే 16న జి.ఓ.61 ఇచ్చింది. ఈ ఉత్తర్వుల్లో పేర్కొన్న మాణాలు పాటిస్తే ప్రభుత్వ పాఠశాల విద్య మరింత పతనానికి రితీస్తుంది. మీదుమిక్కిలి విద్యాహక్కు చట్టాన్ని అమలు చేయటం సమే ఈ రేషనలైజేషన్ ప్రక్రియను చేస్తున్నట్లు చెప్పుకోవటం ద్యారంగంలో ప్రభుత్వ మోసకారి తనం తారాస్థాయికి చేరినట్లు లుస్తున్నది.

**ద్యార్థులు తక్కువైతే వాలంటీర్లే దిక్కా?**

పదిమందిలోపు విద్యార్థులుండే పాఠశాలలను విద్యావాలంటీర్లతోనే డపాలని, రెగ్యులర్ టీచర్ అక్కర్లేదని జి.ఓ. 61 పేరా (iii)లో ప్పబడింది. మారుమూల ఏజెన్సీ ఏరియాల్లో, గిరిజన గూడేల్లో రియు దళిత వాడల్లోని పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తక్కువగా ంటుంది. అలాంటి చోట్ల రవాణా సదుపాయం ఏర్పాటు చేసి లేదా సిడెన్షియల్ స్కూల్స్ నెలకొల్పి తక్కువ విద్యార్థుల్ని ఒక దగ్గరకు చేర్చి క్కువమందిగా చేయాలని విద్యాహక్కు చట్టం చెప్పింది. విద్యార్థులు ంతమంది వున్నా రెగ్యులర్ టీచర్లనే నియమించాలి తప్ప ద్యావాలంటీర్లను నియమించాలని ఆర్‌టిఇ చెప్పలేదు. ఈ షయంలో రాష్ట్ర ప్రభుత్వం విద్యాహక్కు చట్టానికి విరుద్ధంగా పని స్తున్నది. తక్కువ విద్యార్థులుండే పాఠశాలలను విద్యావాలంటీర్లకు దిలేస్తున్నది. ఫార్మల్ స్కూల్స్‌ని నాన్‌ఫార్మల్ టీచర్స్‌తోనే నడిపే తప్పుడు ధానం ముందుకొచ్చింది.

**దు క్లాసులు, 22 సబ్జెక్ట్‌లకు ఒక్క టీచరే !**

ఇరవై మందిలోపు విద్యార్థులు వుండే ప్రాథమిక పాఠశాలలకు క్క టీచర్ పోస్టునే కేటాయించటం జరిగింది. విద్యార్థులు ఎంతమంది న్నా ప్రాథమిక పాఠశాలల్లో ఐదు తరగతులు, 22 సబ్జెక్ట్‌లు ంటాయి. అదనంగా వ్యాయామ విద్య, నైతిక విద్య పాఠాలు చెప్పాలి. ాఠశాల పని దినంలో 7 పీరియడ్‌లే వుంటాయి. ఒక ఉపాధ్యాయుడు విశ్రాంతంగా బోధించినా రోజుకి ఏడు సబ్జెక్టులే కవర్ అవుతాయి. 5 సబ్జెక్టుల పాఠాలు మిగిలిపోతుంటాయి. అంతేకాదు ఉపాధ్యాయుల అర్హత గల సెలవులు వినియోగించుకొనే రోజుల్లో, విద్యాశాఖ ర్వహించే సమావేశాలు, శిక్షణా కార్యక్రమాలకు హాజరయ్యే రోజుల్లో డి మూతపడుతుంది. అలాంటి పాఠశాలల్లో పిల్లలకు అరకొర చదువే క్కుతుంది. అందువలన తల్లిదండ్రులు తమ మంచి బిడ్డల్ని మంచి ద్య కోసమనే ఆశతో ప్రైవేట్ స్కూళ్లలో చేర్చుతారు. తద్వారా కోపాధ్యాయ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య మరింత తగ్గిపోయి, ద్యావాలంటీర్లే దిక్కనే స్థాయికి దిగజారిపోతాయి.

విద్యాహక్కు చట్టంలోని షెడ్యూల్ ప్రకారం 60 మందిలోపు ద్యార్థులుండే పాఠశాలల్లో కనీసం ఇద్దరు ఉపాధ్యాయులు వుండాలి. ద్యార్థులు 10లోపు వుంటే విద్యావాలంటీర్ అని, 20లోపు వుంటే క్క టీచర్ చాలు అనే రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాలు తప్పు.

**లికా విద్యాభివృద్ధికి విఘాతం**

విద్యార్థుల సంఖ్య 150 మించిన పాఠశాలల్లో 30 మంది ద్యార్థులకు ఒక టీచర్ చొప్పుపై ఐదుమంది సెకండరీ గ్రేడ్ టీచర్ (ఎస్‌జిటి)లతో పాటు అదనంగా ఒక ప్రధానోపాధ్యాయుడ్ని నియమించాలని విద్యాహక్కు చట్టం చెబుతోంది. ఈ విషయాన్ని రాష్ట్ర ప్రభుత్వం మసిబూసి మారేడు కాయ చేస్తున్నది. బాలికల విద్యాభివృద్ధికోసమంటూ 13 ఏళ్ల క్రితం మంజూరైన ఎల్‌ఎఫ్‌ఎల్ హెడ్మాష్టర్ పోస్టులను ఇప్పుడు ఎక్కువమంది విద్యార్థులు వుండే పాఠశాలలకు కేటాయించాలని నిర్ణయించింది. గిరిజన, దళిత, మైనార్టీ, బలహీన వర్గాల వారి నివాస ప్రాంతాల్లో మహిళల అక్షరాస్యత తక్కువగా వుంటుంది. ఆ ప్రాంతాల్లోని పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య కూడా తక్కువగానే వుంటుంది. తక్కువ మంది విద్యార్థులు వుండే పాఠశాలల నుండి ఎల్‌ఎఫ్‌ఎల్ హెడ్మాష్టర్ పోస్టులను తొలగిస్తున్న ప్రభుత్వ తప్పుడు నిర్ణయంతో బాలికా విద్యాభివృద్ధి పథకానికి విఘాతం కల్గుతుంది. పాఠశాలల్లో వుండాల్సిన మొత్తం ఉపాధ్యాయుల్లో అంతర్భాగం చేస్తూ ఎస్‌జిటి పోస్టుతో ఎల్‌ఎఫ్‌ఎల్ హెడ్మాష్టర్ పోస్టుని సమానంగా పరిగణించి, మరో వైపు సదరు పోస్టులను ఎక్కువమంది విద్యార్థులు వుండే పాఠశాలలకే షిఫ్ట్ చేయటం అనేది ప్రభుత్వ అనాలోచిత చర్యకు అద్దం పడుతున్నది.

**420 మందికి ఒక పండిట్, 820 మందికి ఒక పిఇటి!**

ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పత్తి ప్రాథమిక (1-5 తరగతులు) పాఠశాలల్లో 1:30, ప్రాథమికోన్నత (6-7) తరగతుల్లో 1:35, హైస్కూల్ (8-10) తరగతుల్లో 1:40గా వుండాలనేది కేంద్ర, రాష్ట్ర విద్యాశాఖలు ఇప్పటిదాకా పాటిస్తున్న ప్రమాణం. దీనిని ప్రస్తుత రేషనలైజేషన్ ఉల్లంఘించింది. కొందరు ఉపాధ్యాయులపైన పని భారం తీవ్రంగా పెంచుతున్నది. భాషాబోధన, వ్యాయామ విద్యను నిర్లక్ష్యం చేస్తున్నది. ప్రాథమికోన్నత పాఠశాలల్లోని 6,7 తరగతుల్లో 120 మంది విద్యార్థులకు రెండు స్కూల్ అసిస్టెంట్ పోస్టులను నిర్ధారించారు. అంటే ఒకో తరగతిలో 60మంది విద్యార్థులకు ఒక టీచరే. ఉన్నత పాఠశాలల్లో 520 మంది విద్యార్థుల వరకు ఒక హిందీ పండిట్, 820 మంది విద్యార్థుల వరకు ఒక పిఇటి పోస్టునే కేటాయించటం విడ్డూరంగా వుంది. ఒక తరగతిలో 40కంటే ఎక్కువ విద్యార్థులు వుంటే బోధనాభ్యసన సాధ్యంకాదని, ఉపాధ్యాయుడికి విద్యార్థులపైన వ్యక్తిగత పర్యవేక్షణ వీలుకాదని, మూల్యాంకనం తలకు మించిన భారంగా పరిణమిస్తుందని విద్యావేత్తలు చెప్పిన ప్రమాణాలను ప్రభుత్వం తుంగలో త్రొక్కింది. అత్యున్నత ప్రమాణాలు పాటిస్తున్న పాఠశాలల్లో ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 1:20గా వున్న విషయాన్ని ప్రభుత్వం పట్టించుకోవటం లేదు. కనీసం ఏజెన్సీ ఏరియాలో 20మంది విద్యార్థులకు ఒక టీచర్ వుండాలని గతంలో రాష్ట్ర ప్రభుత్వం, విద్యాశాఖ ఇచ్చిన ఉత్తర్వులను కూడా మర్చిపోవటం జరిగింది.

**టీచర్లు లేని ఇంగ్లీష్ మీడియం!**

కేంద్ర ప్రాయోజిత పథకం సక్సెస్ స్కీమ్ పేరుతో మూడేళ్ల క్రితం ఎంతో ఆర్భాటంగా 6500 హైస్కూళ్లలో ఇంగ్లీష్ మీడియం సెక్షన్లు ప్రారంభించారు. వాటికి ఇంతవరకు ఒక్క టీచర్‌ని కూడా నియమించ లేదు.ఇప్పుడు రేషనలైజేషన్‌లో ఇంగ్లీష్ మీడియం సెక్షన్లను విడిగా

## యుటీయఫ్ రాష్ట్ర పూర్వ అధ్యక్షులు కోడూరు నారాయణ రావు మృతికి సంతాపం



యుటియఫ్ తొలి రాష్ట్ర అధ్యక్షుడు కోడూరు నారాయణరావు(80) 2011 మే 2న విజయవాడలో అంతిమ శ్వాస విడిచారు. నారాయణ రావు మరణం పట్ల యుటియఫ్ రాష్ట్ర కమిటీ ప్రగాఢ సంతాపాన్ని, కుటుంబ సభ్యులకు సానుభూతిని ప్రకటిస్తున్నది. ఆయన మరణవార్త తెలిసిన వెంటనే యుటియఫ్ గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, కార్యదర్శి బి. నాగేశ్వరరావు, పూర్వకార్యదర్శి ఎన్. రామకోశ్వర రావులు భౌతిక కాయాన్ని సందర్శించి యుటియఫ్ పతాకాన్ని కప్పి శ్రద్ధాంజలి ఘటించారు. అనంతరం నిర్వహించిన అంతిమ యాత్రలో పూర్వ ఉపాధ్యక్షులు జి. లక్ష్మయ్య, పూర్వ కార్యదర్శి పి. వెంకటేశ్వర రావు, రాయన్న, అంజిరెడ్డి మొదలగు వారు పాల్గొన్నారు. కృష్ణానది ఒడ్డున నారాయణరావు భౌతిక కాయానికి ఆయన కుమారుడు అంతిమ సంస్కారం నిర్వహించారు. నారాయణరావుకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు వున్నారు. భార్య సీతాదేవి గత సంవత్సరం మరణించారు. అంతిమ యాత్ర అనంతరం ఎన్. రామకోటేశ్వరరావు అధ్యక్షత జరిగిన సంతాపసభలో సుభాస్‌చంద్రబోస్ మాట్లాడుతూ నారాయణరావు సేవలను గుర్తు చేశారు. ఉపాధ్యాయ సమస్యల పట్ల, నియమ నిబంధనల పట్ల మంచి అవగాహన కలిగిన వీరు రాష్ట్ర అధ్యక్షుడుగా ఉన్న కాలంలో ఖమ్మంలో జరిగిన ద్వితీయ మహాసభలో ప్రత్యామ్నాయ విద్యావిధానం ప్రవేశ పెట్టబడిందన్నారు. 78 వేతన స్కేళ్ళలో టీచర్లకు ఎన్.జి.ఓ.ల కంటే మెరుగైన స్కేళ్ళు సాధించడంతో పాటు పదవీ విరమణ వయస్సు 58 సం॥ పెంపుదల, 50% పెన్షన్ సాధన ముఖ్యంగా పేర్కొనదగినవని గుర్తు చేశారు. నిరాడంబర జీవితం గడపడమేగాక ఇతరులకు మార్గదర్శకుడుగా నిలిచారని, వారి ఆశయాలను ముందుకు తీసుకుపోతామని యుటియఫ్ రాష్ట్ర కమిటీ పక్షాన నివాళులర్పించారు. నాయకులు జి. లక్ష్మయ్య, రామకోటేశ్వరరావు, వెంకటేశ్వర రావు, అంజిరెడ్డిలతోపాటు సిపిఎం కృష్ణా జిల్లా కమిటీ కార్యదర్శి వి. ఉమామహేశ్వరరావు, రైతు సంఘ నాయకులు బి. తులసీరావు, ఎం. రాయన్నలతోపాటు పలువురు యుటియఫ్ కార్యకర్తలు పాల్గొని నారాయణరావుకు శ్రద్ధాంజలి ఘటించారు.

చూపించలేదు. తెలుగు మీడియం టీచర్లే ఇంగ్లీష్ మీడియం విద్యార్థులకు కూడా బోధించాలని ప్రభుత్వం చెప్పింది. ఇంగ్లీష్ మీడియంలో బోధించేందుకు ప్రత్యేక శిక్షణ కూడా ఇవ్వలేదు. దీనివలన ఇంగ్లీష్ మీడియం విద్యార్థులకు అన్యాయం జరుగుతుంది. ఈ దోషాన్ని గుర్తించిన తల్లిదండ్రులు తమ బిడ్డల్ని ప్రభుత్వ ఇంగ్లీష్ మీడియం స్కూళ్ల నుండి తీసుకుపోయి ప్రైవేట్ ఇంగ్లీష్ మీడియం స్కూల్స్‌లో చేర్చుతున్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో ఇంగ్లీష్ మీడియం ఫెల్యూర్ స్టోరీగా మిగిలిపోతున్నది.

### టీచర్ల నియామకాలు లేనట్లేనా?

జి.ఓ.55 పేరా 8లో రేషనలైజేషన్ ఫలితంగా క్రొత్తగా టీచర్ పోస్టులను సృష్టించేది లేదని ప్రభుత్వం తేల్చేసింది. ఇప్పటికే 24 వేలమంది ఉపాధ్యాయులు అదనంగా వున్నారని విద్యాశాఖ అధికారులు చెబుతున్నారు. ఇలాగైతే ఇంక ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయ నియామకాలు లేనట్లే ! డిఎస్‌సిలను మర్చిపోవాల్సిందే. టీచర్ ట్రైనింగ్ చేసి నిరుద్యోగులుగా వున్న 5.5 లక్షల మంది భవిష్యత్ అంధకారబందురమే. ఈ పరిస్థితుల్లో 'టెట్' పేరుతో ఏడాదికి రెండుసార్లు పరీక్షలు నిర్వహించటం, పరీక్ష రుసుంగా ఒక్కో అభ్యర్థి నుండి రు. 300లు చొప్పున వసూలు చేయటం ఎందుకు? దేశ వ్యాప్తంగా దాదాపు కోటి మంది బడిఈడు (6-14 సం॥లు) బాలబాలికలు బడిబయటనే వున్నారని, వారందరినీ బడుల్లో చేర్చి, వారి కోసం రెండున్నర లక్షల మంది ఉపాధ్యాయుల్ని అదనంగా నియమించాలని విద్యాహక్కు చట్టాన్ని అమల్లోకి తెస్తూ 2010 ఏప్రిల్ 1న ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ ప్రకటించారు. మరి ఆంధ్రప్రదేశ్‌లో బడిలో చేర్చాల్సిన బాలబాలికలు లేరా? వారి కోసం అదనంగా ఉపాధ్యాయులను నియమించాల్సిన అవసరం లేదా? బడిలో లేని పిల్లలు 12 లక్షల మంది వున్నారని, మధ్యలో బడి మానేసినవారు రెండు లక్షల మంది వున్నారని వారందరినీ రానున్న విద్యా పక్షోత్సవాల్లో (జూన్ 13-25) పాఠశాలల్లో చేర్చాలని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రకటించారు. కానీ అదనపు ఉపాధ్యాయుల అవసరాన్ని మాత్రం చెప్పలేదు.

### లక్షమంది టీచర్లు కావాలని యుటియఫ్ ప్రతిపాదన

అవసరానికి మించి 26 వేలమంది ఉపాధ్యాయులు అనవసరంగా వున్నారని, ఇంక టీచర్ పోస్టులను సృష్టించేది లేదని ప్రభుత్వం చెప్పటం చాలా అన్యాయం. రాష్ట్ర విద్యావసరాలకు ఇంకా లక్షమందిపైగా టీచర్‌లు కావాలని **ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్)** ప్రతిపాదించింది. విద్యాహక్కు చట్టంలో చెప్పిన టీచింగ్ ప్యాట్రన్ ప్రకారం విద్యార్థుల సంఖ్య 150 మించి వుండే పాఠశాలలకు ప్రత్యేకంగా ప్రధానోపాధ్యాయులను నియమించాలి. అలాంటి పాఠశాలలు 1557 వున్నాయి. ప్రభుత్వం చెబుతున్న బడిలో లేని పిల్లలు 12 లక్షల మంది (నిజానికి అంతకంటే ఎక్కువమంది వుంటారు)ని బడుల్లో చేర్చితే వారి కోసం 40వేలమంది టీచర్లు కావాలి. చెవిటి, మూగ, అంధ, మానసిక రుగ్మత తదితర ప్రత్యేక అవసరాలు గల పిల్లల కోసం ప్రత్యేకంగా పదివేలమంది టీచర్లు కావాలి. ప్రతి 3 ప్రాథమిక పాఠశాలలకు ఒక ప్రాథమికోన్నత పాఠశాల వుండాలనే ప్రమాణం ప్రకారం 10వేల ప్రాథమిక పాఠశాలల్లో 6,7 తరగతులు జోడించి యుపిఎస్‌లుగా అప్‌గ్రేడ్ చేయాలి. అందుకోసం 50వేల మంది స్కూల్ అసిస్టెంట్లు, భాషా పండితులు కావాలి. 6500 హైస్కూల్స్‌లోని ఇంగ్లీషు మీడియం సెక్షన్స్ కోసం 45 వేలమంది ఇంగ్లీష్‌లో బోధించే టీచర్లు కావాలి. ఇవన్నీ కలిపి చూస్తే లక్షమందిపైగా అదనపు టీచర్లు కావాలి. వీటితోపాటు విద్యాహక్కు చట్టం షెడ్యూల్‌లో చెప్పిన 6,7,8 తరగతులు వుండే పాఠశాలలకు వేలాదిమంది పార్ట్ టైమ్ టీచర్ (డ్రాయింగ్, హెల్త్, ఒకేషనల్, ఫిజికల్ ఎడ్యుకేషన్ కోసం)లను నియమించాల్సి వున్నది. కనుక రాష్ట్ర విద్యావసరాల కోసం యుటియఫ్ ప్రతిపాదించిన రెగ్యులర్, పార్ట్‌టైమ్ టీచర్లను నియమించితే మరో లక్షన్నర మందికిపైగా నిరుద్యోగ యువకులకు ఉపాధ్యాయ ఉద్యోగ అవకాశం లభిస్తుంది. ప్రభుత్వ పాఠశాలల్లో నాణ్యమైన విద్యను అందించే సామర్థ్యం పెరుగుతుంది. విద్యాహక్కు లక్ష్యం నెరవేరుతుంది.

◆

మహాసభల ప్రత్యేకం

# విద్యా ప్రైవేటీకరణ, విదేశీకరణకు వ్యతిరేకంగా జాతీయ ఉద్యమం చేపట్టాలి

ప్రభుత్వ విద్యారంగాన్ని పటిష్టపరచకుండా యుపిఏ-2 ప్రభుత్వం ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ చేస్తున్నదని, విద్య విదేశీకరణకు తలుపులు బార్లా తెరిచి స్వాగతిస్తున్నదని, ప్రభుత్వం విద్యారంగం పట్ల తన వైఖరిని మార్చుకోనట్లయితే ఉపాధ్యాయులు, అధ్యాపకులు, విద్యార్థులు విద్యాభిమానులు, మేధావులు, తల్లిదండ్రులతో కలిసి జాతీయ స్థాయిలో ఉద్యమించాలని సిపిఎం పొలిటీబ్యూరో సభ్యులు, రాజ్యసభ సభ్యులు సీతారాం ఏచూరి పిలుపునిచ్చారు. మే 9,10,11 తేదీలలో కర్నూలులో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 12వ రాష్ట్ర మహాసభలను సీతారాం ఏచూరి ప్రారంభించారు. ప్రారంభోపన్యాసం చేస్తూ విద్యారంగం సంక్లిష్ట దశలో ఉన్న నేటి పరిస్థితుల్లో యుటియఫ్ బాధ్యత మరింత పెరిగిందని అన్నారు. యుపిఏ-2 అనుసరిస్తున్న ప్రజ్యావ్యతిరేక విధానాలతో ప్రజలు, ఉద్యోగులు, మధ్యతరగతి వారిపై తీవ్ర భారం పడుతున్నదని అన్నారు. ప్రభుత్వ ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా ఉద్యమాలను బలపరచాలన్నారు. ఆర్థిక విధానాల్లో కాంగ్రెసు, బిజెపి రెండూ ఒకటేనని ప్రజా వ్యతిరేకమైన చర్యలు చేపట్టడానికి ఇద్దరూ ఒకటవుతారని అన్నారు. దేశంలో రెండు భారత్‌లు ఉన్నాయని షైనింగ్ ఇండియా, సఫరింగ్ ఇండియాగా వర్ణించారు. శత కోటీశ్వరుల సంఖ్య రెండు సంవత్సరాల్లోనే 26 నుండి 69కి చేరుకుందన్నారు. శతకోటీశ్వరుల ఆస్తి దేశ జిడిపిలో మూడవ వంతుగా ఉందని, మరోవైపు 121 కోట్ల జనాభాలో 80 కోట్లకంటే ఎక్కువమంది రోజుకు రూ. 20లతోనే బతుకీడుస్తున్నారని తెలిపారు. ప్రపంచీకరణలో భాగంగా కేంద్రం అనుసరిస్తున్న సరళీకరణ ఆర్థిక విధానాలతో పేద - ధనిక అంతరం రోజురోజుకీ పెరుగుతుందన్నారు. పెట్టుబడి దారులకు లాభాలు, కొనుగోలు దారులకు కష్టాలు వస్తున్నాయని, ఐదు రాష్ట్రాల్లోను జరుగుతున్న ఎన్నికలు చివరి విడత పూర్తికాగానే కేంద్రం, గ్యాసు, పెట్రోలు ధరలను పెంచుతుందన్నారు. ప్రమాద కరమైన విధానాలతో కేంద్రం ప్రజలు, ఉద్యోగుల జీవితాలతో ఆడుకుంటుందన్నారు. వామ పక్షాల మద్దతుతో నడిచిన యుపిఏ-1 ప్రభుత్వంలో అమలు చెయ్యలేకపోయిన కొన్ని బిల్లులను యుపిఏ-2 హయాంలో నిరాటంకంగా అమలు చేస్తున్నదని వాటిలో పెన్షన్ ఫండు రెగ్యులేటరీ డెవలప్‌మెంట్ అథారిటీ (పిఎఫ్ఆర్‌డిఏ) బిల్లును తాము వ్యతిరేకించామని, ఇప్పుడు వామపక్షాల మద్దతు అవసరం లేనందున బిజెపితో కలిసి పార్లమెంటులో ప్రవేశ పెట్టిందన్నారు. ఈ బిల్లును పార్లమెంటులో ప్రవేశ పెట్టినప్పుడు 160 మంది ఉన్నారని, అందులో 60 కాంగ్రెస్, 57 బిజెపి, 43 వామపక్షాల ఎంపీలున్నారని తెలుపుతూ బిల్లుకు వ్యతిరేకంగా వామపక్షాలు ఓటు వేయగా అనుకూలంగా కాంగ్రెసు బిజెపిలు ఓటు వేశాయని అన్నారు. ప్రజల, ఉద్యోగుల, ఉపాధ్యాయుల ఆశలను, ఆకాంక్షలను పట్టించుకునే వారెవరో, కాని వారెవరో స్పష్టంగా వెల్లడయ్యిందన్నారు. ప్రభుత్వరంగ సంస్థలను కాపాడుకోవాలన్నారు. అధిక ధరల నియంత్రణ చేయాలన్నా, దేశ ఆర్థిక విధానాల్లో విదేశీ జోక్యం తగ్గాలన్నా, ప్రజల జీవన స్థాయి పెరగాలన్నా వామపక్షాల బలం పార్లమెంటులో పెరగాలని అన్నారు.



సీతారాం ఏచూరి

పెన్షన్ ప్రైవేటీ కరణ, ఇన్సూరెన్సు రంగం లోకి విదేశీ పెట్టు బడులను ఆహ్వానించడం, ప్రైవేటు విదేశీ బ్యాంకులను అనుమ తించడం భారత్ కరెన్సీని కన్వర్టు చేయడం వంటి తీవ్ర ప్రమాదకరమైన విధానాలను కేంద్రం ప్రవేశపెడుతుందన్నారు. ఈ విధానాల వలన ఉద్యోగులు ఉపాధ్యాయులపై ప్రత్యక్ష భారాలు పడతాయన్నారు. ప్రభుత్వ శాఖల్లో కాంట్రాక్టు ఔట్‌సోర్సింగ్ ఉద్యోగుల సంఖ్య పెరుగుతూ శాశ్వత ఉద్యోగుల సంఖ్య తగ్గుతున్నదన్నారు.

విదేశీ విశ్వ విద్యాలయాలను అనుమతించడం, పాఠశాల విద్యను తన గుప్పెట్లో పెట్టుకొని అజమాయిషీ చేసే విధానాలను కేంద్రం రూపొందిస్తున్నదని, ప్రభుత్వం తన బాధ్యతల నుండి తప్పుకుని, అన్ని రంగాలను ప్రైవేటు వారికి, విదేశీయులకు అప్ప చెప్పనున్నదని క్రమంగా వారి పెత్తనం పెరగనున్నదని అన్నారు.

ప్రస్తుత పరిస్థితుల్లో ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకునేందుకు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు. ప్రభుత్వ విద్యా సంస్థలకు కెటాయించాల్సిన నిధులను ప్రైవేటు విదేశీ సంస్థలకు కెటాయిస్తున్నారని విమర్శించారు. విద్యాహక్కు చట్టం అమలుకు ఐదేళ్ళకు 1.75 లక్షల కోట్లు కావాలని ప్రణాళికా సంఘం అంచనా వేసిందని, ఈ నిధులను కెటాయించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిధులు లేవని చెబుతున్నాయని, దేశంలో 2జి స్పెక్ట్రం కుంభకోణంలో 1.76 లక్షల కోట్లు తిరిగి వసూలు చేస్తే రాష్ట్రాలపై భారం వేయకుండా విద్యాహక్కు చట్టాన్ని సమగ్రంగా అమలు చేయవచ్చని అన్నారు. ప్రభుత్వ దుష్ట విధానాలను ప్రజా ఉద్యమాల ద్వారా తిప్పికొట్టడంతోపాటు చట్టసభలకు సరైన వ్యక్తులను ఎన్నుకోవాలని సూచించారు. ప్రభుత్వం అనుసరిస్తున్న అప్రజాస్వామిక విధానాలపై ఉపాధ్యాయుల్లో చైతన్యం కల్పించాల్సిన బాధ్యత యుటియఫ్‌పై ఉన్నదనీ, ప్రజా ఉద్యమాన్ని నిర్మించాలని అన్నారు. యుటియఫ్‌కు ఉద్యమాలు నడిపిన, త్యాగాలు చేసిన చరిత్ర ఉందన్నారు. ప్రభుత్వ విద్యారంగాన్ని, దేశ ప్రజాస్వామ్యాన్ని కాపాడుకునేందుకు జాతీయ స్థాయిలో ఉద్యమించి చరిత్ర సృష్టించాలని పిలుపునిచ్చారు.



# ఉత్తేజాన్నిచ్చిన యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభలు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 12వ రాష్ట్ర మహాసభలు ఆంధ్ర రాష్ట్ర ప్రథమ రాజధాని కర్నూలు నగరంలో అత్యంత ఉత్సాహపూరితమైన, ఉత్తేజభరితమైన వాతావరణంలో 2011 మే 9,10,11 తేదీల్లో జరిగాయి. కర్నూలు నగరమంతా యుటియఫ్ తోరణాలతో ఎరుపెక్కింది. నేతలకు, ప్రతినిధులకు స్వాగతం పలుకుతున్న బ్యానర్లు, అమర జీవులు చెన్నుపాటి అప్పారి వెంకటస్వామి, మైనేనిల చిత్ర పటాలతో వెలసిన పెద్ద పెద్ద హోర్డింగులు, మహాసభకు విచ్చేస్తున్న రాష్ట్ర నాయకులు, అతిథులు, ఎమ్మెల్సీలు, ప్రతినిధులు, కార్యకర్తలను ఆత్మీయంగా ఆహ్వానిస్తున్న స్వాగత ద్వారాలు చూసిన యుటియఫ్ సభ్యులు, అనిర్వచనీయమైన పులకింతకు లోనయ్యారు. ఎటుచూసినా మెరిసిపోతున్న కెంపు వర్ణం వారిలో నూతనోత్తేజాన్ని కల్గించింది.

విశాలమైన అప్పారి వెంకటస్వామినగర్ (మాంటీస్సోరీ పాఠశాల) ప్రాంగణం మహాసభల కోసం అందంగా అలంకరించబడింది. అప్పారి వెంకటస్వామి, మైనేని వెంకటరత్నం చిత్ర పటాలతో తయారు చేయబడిన 12వ రాష్ట్ర మహాసభల భారీ బ్యానర్ కీ॥శే॥కోడూరు నారాయణ రావు సభా వేదిక వెనుక భాగాన అలంకరించబడింది. 9వ తేదీ ఉదయం 10 గం॥లకు వేలాదిమంది కార్యకర్తలతో నిండిన ప్రాంగణంలో పతాకావిష్కరణ కార్యక్రమాలు ప్రారంభమయినాయి. ముందుగా అలనాడు రాజమండ్రిలో మొదటి మహాసభ జరుపుకున్న తూర్పుగోదావరి జిల్లావారి పతాక జాతాతో మొదలై 2009 ఫిబ్రవరిలో నల్లగొండలో జరుపుకున్న 11వ మహాసభ పతాకాలతో జాతాగా కర్నూలుకు విచ్చేసిన రాష్ట్ర జిల్లా నేతలు వరుసక్రమంలో సభా ప్రాంగణంలోకి కవాతు చేస్తూ రాగా, రాష్ట్ర ఆఫీస్ బేరర్లు పతాకాలను స్వీకరించి ప్రాంగణంలో ప్రతిష్టించారు. ఒక వంక ఉత్తేజం మరోవంక ఉద్విగ్నత నిండిన హృదయాలతో గత కాలపు స్మృతులు, తొలితరం నేతల త్యాగాలను స్మరిస్తూ, ఈ తరం నేతలకు వెన్నంటి ఉంటామని పిడికిళ్ళెత్తి సభ్యులంతా నినదిస్తుంటే సభా ప్రాంగణం పులకించి పోయింది. 1974లో ఉద్యమ ఆవిర్భావంలో తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించి, అనంతర కాలంలో రెండు దశాబ్దాల పాటు ఉద్యమాన్ని నడిపించి, రాష్ట్ర స్థాయిలోనే ఉద్యమం ఆగకూడదని జాతీయ స్థాయిలో ఉద్యమానికి పునాదిరాయివేసిన ఉద్యమ ప్రియతమ నాయకులు పూర్వ ఎమ్మెల్సీ దాచూరి రామిరెడ్డి ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని, పదవీ విరమణ ఉద్యోగానికే తప్ప ఉద్యమానికి కాదని ఋజువు చేస్తూ ఉద్యమానికి పూర్తి సమయాన్నిచ్చి పనిచేస్తూ అకడమిక్‌సెల్ కన్వీనర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న సీనియరు నాయకులు ఎం.ఏ.కె. దత్తు యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, అధ్యక్షులు ఎన్. నారాయణ, ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు, సిహెచ్. రవి, ఏ. నర్సిరెడ్డి, కె. వెంకట్రావులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. యుటియఫ్ జిందాబాద్, ఎస్‌టిఎఫ్ఐ జిందాబాద్, అమరవీరుల ఆశయాలను సాధిస్తాం,ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకుందాం. నాయకులారా ముందుండండి మీ వెనకే మేమంటూ కార్యకర్తలంతా పెద్ద ఎత్తున నినదించారు.

అనంతరం ఎస్టీబీసి కళాశాల మైదానం నుండి మహాప్రదర్శన ప్రారంభమైంది. మేళతాళాలతో, డప్పు నృత్యాలతో విచిత్ర వేషాలతో ఉన్న దళాలన్నీ ముందు నడవగా, రాష్ట్ర నాయకులు, పిడిఎఫ్ ఎమ్మెల్సీలు చుక్కారామయ్య, డి. రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, కె.ఎస్.లక్ష్మణ రావు, శ్రీనివాసులురెడ్డి, పదకొండు మహాసభలు జరిపిన జిల్లాల నుండి జాతాగా వచ్చిన పతాకాలు అగ్రభాగాన నడవగా ఒకే తీరైన చీరలు ధరించిన మహిళలు, యుటియఫ్ టీ-షర్టులు ధరించిన పురుషులు, ఆ వెనక వరుసక్రమంలో ఆయా జిల్లాలు ప్రదర్శనలో ముందుకు సాగుతూ కర్నూలు పురవీధుల్లో కదం తొక్కారు. 42 డిగ్రీల ఉష్ణోగ్రతతో రాష్ట్రం మండిపోతున్నా మధ్యందిన మార్తాండుడు సైతం మబ్బుల మాటుకు తరలాల్సిందేనన్నంత దీక్షతో, క్రమశిక్షణతో వివిధ జిల్లాల నుండి తరలివచ్చిన యుటియఫ్ సభ్యులు వారి కుటుంబ సభ్యులు, పిల్లలు, అభిమానులతో ర్యాలీ మహోత్సాహంగా ముందుకు సాగింది. ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించాలని, మధ్యాహ్న భోజన పథకానికి నిధులు పెంచాలని, అప్రెంటిస్ విధానం రద్దు చేయాలని, ఎయిడెడ్, మున్సిపల్ పాఠశాలల ఉపాధ్యాయుల సమస్యలను పరిష్కరించాలనీ, విద్యాహక్కు చట్టాన్ని అమలు చేయాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగానికి నిధులు పెంచాలని డిమాండ్ చేస్తూ ప్లకార్డులు ప్రదర్శించారు. ఉపాధ్యాయుల ఐక్యత వర్థిల్లాలని, ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మికుల ఐక్య వర్థిల్లాలని, ఉపాధ్యాయ-విద్యార్థుల ఐక్యత వర్థిల్లాలంటూ నినదించారు. ఈ ప్రదర్శనకు ఆకర్షణగా నిలిచిన విచిత్ర వేషాల్లో విజయనగర సామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణ దేవరాయలు, మంత్రి తిమ్మరుసు, సోషలిస్టు సమాజ నిర్మాణ మూలవిరాట్టు లెనిన్, మన్నెం వీరుడు అల్లూరి, భగత్‌సింగ్ మొదలైన వారు నిలిచారు. అరుణారుణ వర్ణ శోభితమైన యుటియఫ్ పతాకాలను చేబూని క్రమశిక్షణతో నినదిస్తూ ముందుకు సాగుతున్న వేలాదిమంది గురువులను కర్నూలు ప్రజలు అబ్బురంగా వీక్షించారు. గురవయ్యుల డమ్ములు, ప్రజానాట్యమండలి కళాకారుల డప్పు నృత్యం అందరినీ ఆకర్షించింది. ప్రదర్శన సాగుతున్న దోవపొడవునా ఐద్వా, ఎస్ఎఫ్ఐ, సిఐటియు, ఇన్సూరెన్స్, డివైఎఫ్ఐ, ఎస్‌డబ్ల్యుఎఫ్, మెడికల్ రిప్రజెంటేటివ్స్ మొదలైన ప్రజా సంఘాలు దారికిరువైపుల నిలచి నేతలపై పూల జల్లు కురిపిస్తూ ప్రదర్శనకు మద్దతు తెలిపారు. ఉపాధ్యాయ ఉద్యోగ, కార్మిక, విద్యార్థి, మహిళా ఐక్యత వర్థిల్లాలని, నిత్యావసర వస్తువుల ధరలు తగ్గే వరకు అందరం కలిసి పోరాటం చేద్దామని, పిఎఫ్ఆర్‌డిఏ బిల్లు ఉద్యోగ కార్మికుల జీవితాలను అభద్రతలోకి నెట్టేస్తుందని, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాడు దామని వారు నినదించారు. ప్రదర్శన ఎస్‌టిబిసి కళాశాల నుండి ఆర్ఎస్ రోడ్డు, మౌర్యాఇన్, రాజ్‌విహార్ సెంటరు, మెడికల్ కళాశాల కలెక్టరేటు మీదుగా మహాసభ ప్రాంగణమైన మాంటిస్సోరి పాఠశాల వరకు సాగింది.

మహాసభల ప్రారంభ సభకు యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ అధ్యక్షత వహించారు. ఇటీవల మరణించిన యుటియఫ్ రాష్ట్ర పూర్వ అధ్యక్షులు కోడూరునారాయణరావుకు సంతాపం ప్రకటిస్తూ రాష్ట్ర గౌరవాధ్యక్షులు సుభాస్‌చంద్రబోస్ తీర్మానాన్ని ప్రతిపాదించగా మహాసభలో 2 నిమిషాలు మౌనం పాటించి ఘనంగా నివాళులు అర్పించారు. ఆహ్వాన

సంఘం అధ్యక్షులు జి. పుల్లయ్య కర్నూలు జిల్లా చారిత్రక ప్రాశస్త్యాన్ని వివరించి మహాసభలకు విచ్చేసిన అతిథులు ప్రతినిధులందరికీ స్వాగతం పలికారు.

## అవిశ్రాంత పోరాటాలు-అసాధారణ విజయాలు

ఎన్. నారాయణ అధ్యక్షత వహించి మాట్లాడుతూ 1974లో యుటియఫ్ ఏర్పడిన నాడు ఏ ఆశయాలతో, లక్ష్యాలతో మన ప్రయాణం ప్రారంభించామో 36 సంవత్సరాల తరువాత కూడ అదే స్ఫూర్తితో పురోగమిస్తున్నామన్నారు. పూర్వుల త్యాగాల వారసత్వాన్ని, క్రమశిక్షణను, ఐక్యతను పుణికి పుచ్చుకొని పనిచేస్తున్నామన్నారు. పదకొండు మహాసభల కాలం నుండి నేటి వరకు యుటియఫ్ చేపట్టిన పోరాటాల పరంపరను వివరించారు. విద్యా రంగానికే అవమాన కరంగా పరిణమించిన అప్రెంటిస్ విధానంపై అవిశ్రాంత పోరాటం జరిపి అన్ని ప్రయోజనాలను సాధించుకున్నామని 1,71,000 మంది ఉపాధ్యాయులకు 250 కోట్లు నోషనల్ ఇంక్రిమెంట్లు రూపేణా ఇప్పించగలిగామని అన్నారు. ఇక అప్రెంటిస్ విధానం రద్దు, 2008 డిఎస్‌సి ఉపాధ్యాయులకు టైం స్కేలు సాధించడం మిగిలిందని అందుకై మహాసభల అనంతరం దశల వారీ పోరాటానికి పిలుపునిస్తున్నా మన్నారు. 2002 స్పెషల్ డిఎస్‌సి ద్వారా అపాయింట్ అయిన ఎస్సీ,ఎస్టీ అన్‌ట్రైన్డ్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లకై జరుపుతున్న పోరాటం త్వరలో ఫలించబోతున్నదన్నారు. 9వ పీఆర్‌సీ సాధనకై జెఏసీ చేపట్టిన ప్రతి ఆందోళనా పోరాటాల్లో అగ్రగాములుగా ఉన్నామని, 1982లో రీగ్రూపింగ్ స్కేల్సు తరువాత ఉపాధ్యాయులకు అత్యంత మెరుగైన స్కేల్సు ఈ పీఆర్‌సీలో సాధించుకున్నామని ఇందుకు యుటియఫ్‌తో పాటు పిడిఎఫ్ ఎమ్మెల్సీల తోడ్పాటు ఎంతో ఉందన్నారు. 2011 మార్చిలో జరిగిన ఎమ్మెల్సీ ఎన్నికల్లో నలుగురు ఎమ్మెల్సీలను గెలిపించుకున్నామని, డబ్బు ప్రవాహానికి ఎదురీది నీతి, నిజాయితీలకు నిదర్శనంగా ఎమ్మెల్సీలను గెలిపించిన ఉపాధ్యాయ, పట్టభద్రులను ఆయన అభినందించారు. ప్రాంతీయ, కుల ఉద్యమాల పేరుతో రాష్ట్రంలో ఉపాధ్యాయ సంఘాలు ముక్కచెక్కలయినాయని, స్థిరమైన లక్ష్యంతో యుటియఫ్ మాత్రం ఏకోన్ముఖంగా ముందుకుపోతుం దన్నారు. కేంద్ర ప్రభుత్వం కోట్లాది రూపాయలు రాష్ట్రానికి నిధులుగా సమకూర్చిందని అవి నేరుగా పాఠశాల విద్యాశాఖకు కాకుండా ఆర్‌వియం, ఆర్ఎంఎస్ఏలకు ఇస్తున్నారని వీటిని రాష్ట్ర ప్రభుత్వం సమీక్షించి విద్యారంగంలో ఏం సాధించారో తెలపాలన్నారు.

కేంద్ర ప్రణాళికా సంఘం విద్యా వైద్య రంగాలకు కేటాయించిన నిధుల నుండి రెండున్నరవేల కోట్ల రూపాయలను రైల్వే శాఖకు ఎందుకు తరలించారని నారాయణ ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. విద్యా చట్టానికి భిన్నంగా రాష్ట్ర ప్రభుత్వం రేషనలైజేషన్ పేరుతో వందల స్కూళ్ళ మూసివేతకు సిద్ధపడిందని, జి.ఓ. 177 తెచ్చి ఉద్యమాలపై ఉక్కుపాదం మోపుతున్నదని, వీటి రద్దు కొరకు యుటియఫ్ ఉద్యమిస్తున్నదని, ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించుకోవడానికి విద్యా రక్షణ ఉద్యమం చేపట్టామన్నారు.

## పిఎఫ్ఆర్‌డిఏ బిల్లును ఉపసంహరించాలి

పిఎఫ్ఆర్‌డిఏ బిల్లుకు వ్యతిరేకంగా మహాసభ తీర్మానాన్ని ఆమోదించింది. పెన్షన్ నియంత్రణ నిధి అభివృద్ధి బిల్లు 2011 (పిఎఫ్ఆర్‌డిఏ)ను తక్షణమే ఉపసంహరించాలని పెన్షన్ నిధుల ప్రైవేటీకరణను ఆపాలని, ప్రస్తుత పెన్షన్ విధానాన్ని కొనసాగించాలని మహాసభ కేంద్రప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. ఈ తీర్మానాన్ని రాష్ట్ర కార్యదర్శి కె. వెంకటరావు ప్రతిపాదించగా జెఏసి కో-చైర్మన్, పబ్లిక్ సెక్టారు ఎంప్లాయిస్ ఫెడరేషన్ అధ్యక్షులు ఎం. జనార్ధన్ రెడ్డి బల పరిచారు. ఆయన మాట్లాడుతూ పూర్వుల త్యాగాల ఫలితంగా పెన్షన్ హక్కు వచ్చిందని ఇప్పుడు ప్రభుత్వం రద్దుకు సిద్ధపడి మనకు సవాలు విసిరిందని భారత దేశ ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక వర్గం ఏకమై ప్రభుత్వానికి తగిన బుద్ధి చెప్పాలన్నారు. పెన్షన్ రక్షణకై ఏ త్యాగానికైనా సిద్ధపడదామన్నారు.

## సందేశాలు

**వి. గోపాల్‌రెడ్డి :** జెఏసి చైర్మన్, ఏపిఎన్‌జిఓ సంఘ అధ్యక్షులు వి. గోపాల్‌రెడ్డి సందేశం యిస్తూ జెఏసితో యుటియఫ్ కున్న అనుబంధాన్ని, ఉద్యమాల్లో యుటియఫ్ భాగస్వామ్యాన్ని ప్రశంసించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రైవేటీకరణ విధానాలను వ్యతిరేకించాలని, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికుల సంక్షేమాన్ని ప్రభుత్వాలు గాలికి వదిలేస్తున్నాయని విమర్శించారు. రాష్ట్రంలో ఏ రంగంలో చూసినా ప్రైవేటీకరణ పెరిగి పోతున్నదని, విద్యారంగంలో ఇప్పటికీ ప్రైవేటు వారి దోపిడీ పెరిగిందన్నారు. ఉద్యోగులు పీఆర్‌సీ కోసం సమ్మెలు చేయవలసి వస్తున్నదని కానీ ఎంపీలు, ఎమ్మెల్యేలు తమ జీతాలు పెంచుకునేందుకు ఏ ఆటంకాలు ఏ చర్చలూ ఉండవన్నారు. వారికి ధరల పెరుగుదలతో విలవిల్లాడుతున్న ప్రజానీకం కనబడరని ఎద్దేవా చేశారు. విద్యారంగంలో వస్తున్న పెడ ధోరణులకు వ్యతిరేకంగా ఉపాధ్యాయులు రాజీలేని పోరాటం చేయాలన్నారు.

జెఏసి కోచైర్మన్ జనార్ధన్‌రెడ్డి, డిప్యూటీ సెక్రటరీ జనరల్ మరియు ఏపిఎన్‌జిఓస్ ప్రధానకార్యదర్శి అశోక్ బాబులు మాట్లాడుతూ మహాసభలు విజయవంతం కావాలని ఆకాంక్షించారు. మాజీ శాసన సభ్యులు ఎం.ఏ. గఫూర్, పిడిఎఫ్ ఎమ్మెల్సీలు, యుటియఫ్ సీనియర్ రాష్ట్ర నాయకులు, రాష్ట్ర ఆఫీస్ బేరర్లు ఈ కార్యక్రమంలో వేదికపై ఆసీనులయ్యారు.

## విద్యాసదస్సు

మధ్యాహ్నం నిర్వహించిన విద్యా సదస్సుకు యుటిఎఫ్ సీనియర్ నాయకులు ప్రస్తుత ఉపాధ్యాయ నియోజకవర్గ ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ ప్రాథమిక విద్య తీవ్ర నిర్లక్ష్యానికి గురౌతుందన్నారు. అసర్, ఎన్‌సిఇఆర్‌టిల నివేదికల ప్రకారం రాష్ట్రంలోని నాలుగవ తరగతి చదివే ప్రభుత్వ పాఠశాలల విద్యార్థుల్లో 2వ తరగతి స్టాండర్డ్ కూడ లేదని స్పష్టమౌతుందన్నారు. పాఠశాల విద్య సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుందని ఆవేదన వ్యక్తం చేశారు. ఇంటర్మీడియేట్‌లో అన్ని కళాశాలలకు సంబంధించి 25 లక్షలు సీట్లుండగా కేవలం 9 లక్షలమంది మాత్రమే ఇంటర్ చదివేందుకు ముందుకువస్తున్నారని అన్నారు. విద్యారంగం ఎదుర్కొంటున్న సంక్షోభంపై మేధావులు, రాజకీయ నాయకులు, ఉపాధ్యాయులు, ప్రభుత్వం చర్చించి పరిష్కారం కనుగొనాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. రాష్ట్రంలో పెట్రోలు బంకులు అత్యాధునిక హంగులతో నిర్మించబడుతున్నాయి. కాని కోట్లాది రూపాయల నిధులు విద్యారంగానికి కేటాయిస్తున్నామని చెప్తున్నా పాఠశాలలకు ప్రహరీ గోడల నిర్మాణం ఎందుకు జరగడం లేదో పాలకులు చెప్పాలన్నారు.

**రామిరెడ్డి సందేశం :** యుటియఫ్ సీనియరు నాయకులు, పూర్వ ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి సందేశం ఇస్తూ 90వ దశకం నుండి కేంద్ర ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాల పేరుతో విద్యారంగాన్ని ప్రైవేటీకరించే ప్రయత్నం చేసిందని, ఆ విధానాలను వ్యతిరేకిస్తూ ఉద్యమాలు చేస్తున్న తరుణంలోనే అఖిల భారత స్థాయిలో సిసిఎస్‌టిఓతో ప్రారంభించి ఎస్‌టిఎఫ్ఐని స్థాపించామని అన్నారు. కేంద్రం అధికారాలను, నిధులను తన వద్ద పెట్టుకొని రాష్ట్రాలకు మొండి చెయ్యి చూపుతున్నదని, ప్రభుత్వరంగంలో విద్య మనలేని స్థితి వచ్చిందన్నారు. కేరళ, తమిళనాడుల్లో పాఠశాల విద్య, మధ్యాహ్న భోజన పథకం బాగా విజయవంతం అవుతున్నాయని వారికి మంచి ప్రణాళిక ఉందన్నారు. కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నామని చెప్పుకొంటున్నా మౌలిక

వసతులు లేని పాఠశాలలు రాష్ట్రంలో వేలల్లో ఉన్నాయన్నారు. విద్యారంగం పట్ల మన ప్రభుత్వానికి సమగ్ర దృక్పథం లేదని, ప్రతి విద్యామంత్రి తమదైన శైలిలో ప్రయోగాలు చేస్తుంటారని విమర్శించారు. ఉపాధ్యాయులు తాము పని చేస్తున్న చోట తల్లిదండ్రులను, గ్రామస్తులను కలుపుకొని ప్రభుత్వ పాఠశాలల రక్షణకు ఉద్యమించాలని పిలుపునిచ్చారు.

యుటియఫ్ ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు పాఠశాల విద్యారంగంపై ఒక విధాన పత్రాన్ని మహాసభలో ప్రవేశ పెడుతూ విద్యారంగానికి ఒక ప్రత్యేక కమీషన్ వేయాలని తాము గతం నుండి డిమాండ్ చేస్తున్నా ప్రభుత్వం నిర్లక్ష్యం వహిస్తున్నదన్నారు. విద్యారంగ విభజన వల్ల ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఏమీ ఒరగదని మంత్రి పదవులు పెరుగుతాయని అన్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం విద్యారంగం పట్ల నిర్లక్ష్యాన్ని వీడి పాఠశాల విద్యను పటిష్టం చేయాలని డిమాండ్ చేశారు.

**ఎన్. తులసి రెడ్డి :** కాంగ్రెస్ అధికార ప్రతినిధి, 20 సూత్రాల అమలు పథకం చైర్మన్ ఎన్. తులసీరెడ్డి బడ్జెట్‌లో విద్యారంగానికి ఇటీవల కేటాయింపులు తగ్గిపోవడం తమకు కూడా ఆందోళన కలిగిస్తున్నదన్నారు. సాగునీరు, వ్యవసాయం, సేవారంగాలకు కూడా ప్రాధాన్యత పెంచడం మూలంగా విద్యారంగానికి కేటాయింపులు పెంచాలంటే ఏదో రంగానికి తగ్గించాల్సి ఉందన్నారు. గత సంవత్సరం విద్యారంగానికి 16% నిధులు కేటాయించగా ఈ సంవత్సరం 13 1/2% మాత్రమే కేటాయింపులు జరిగాయన్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో పడిపోతున్న విద్యా ప్రమాణాల మెరుగుదలకు ప్రణాళికలు తయారు చేయాల్సిన అవసరం వుందన్నారు. మారుతున్న పరిస్థితుల్లో రెసిడెన్షియల్ పాఠశాలలకు మంచి రోజులు వస్తున్నాయన్నారు. రాష్ట్రంలోని విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యల్ని, యుటియఫ్ ప్రతిపాదించిన అంశాల్ని ముఖ్యమంత్రి, విద్యాశాఖ మంత్రులతో చర్చించి పరిష్కారం కోసం ప్రయత్నిస్తానన్నారు.

**మండవ వెంకటేశ్వర రావు :** తెలుగు దేశం పొలిట్‌బ్యూరో సభ్యులు, పూర్వ పాఠశాల విద్యామంత్రి మండవ వెంకటేశ్వర రావు మాట్లాడుతూ విద్యారంగం అన్ని కోణాల్లో వెనుకబడి ఉందన్నారు. విద్య, ఆరోగ్యం అందరికీ సమానంగా అందించేలా ప్రభుత్వ విధానాలుండాలన్నారు. ఇందుకోసం దీర్ఘకాలిక ప్రణాళికలు అవసరం అన్నారు. కేంద్ర ప్రభుత్వం విద్యాహక్కు చట్టం చేసి చేతులు దులుపుకుందని, దాన్ని అమలుపరచే విధంగా ప్రభుత్వమే బాధ్యతలు తీసుకోవాలన్నారు. ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకునేందుకు ప్రతి ఒక్కరు కృషి చేయాలన్నారు. ప్రైవేటు విద్యా సంస్థలు విద్యతో వ్యాపారం చేసుకుంటున్నాయని, అక్రమ మార్గాలతో ర్యాంకులు సాధించి తల్లిదండ్రులను భ్రమల్లో ముంచెత్తుతున్నారన్నారు.

**బి.వి. రాఘవులు:** విద్యాభివృద్ధి జరగకుండా దేశాభివృద్ధి సాధ్యం కాదని సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి. రాఘవులు అన్నారు. ఆయన విద్యాసదస్సులో పాల్గొని ప్రసంగిస్తూ దేశంలో మనుస్మృతి వంటి విష సంస్కృతి, ఫ్యూడల్ సంస్కృతి పోకుండా విద్యాభివృద్ధి జరగదని అన్నారు. మనుస్మృతిలో కేవలం కొంతమంది మాత్రమే చదువుకునేందుకు అనుమతిస్తూ, ఆడవాళ్ళు, శూద్రులు చదువుకోరాదని కఠిన ఆంక్షలు విధించారని అన్నారు.

ఆడవాళ్ళు, శూద్రులు చదువుకు దూరమైతే నూటికి 90 శాతం మంది విద్యకు దూరమైనట్లేనని, ఇలాంటి దుష్ట వారసత్వాన్ని వదిలించుకోకుండా విద్యారంగాన్ని అభివృద్ధి చేసుకోలేమన్నారు. ఇప్పటికీ విద్య అదే సంస్కృతిలో కొనసాగుతుందన్నారు. పాఠశాలల్లో మధ్యాహ్న భోజన సమయాల్లోనూ దళిత విద్యార్థులను సహపంక్తి భోజనం చేయకుండా అడ్డుకుంటున్నారని, దళిత మహిళలు వండిన భోజనాన్ని దళితేతర పిల్లలు తినడం లేదని అన్నారు. మనకంటే బాగా వెనుకబడిన ఆఫ్రికా, బంగ్లాదేశ్, శ్రీలంక వంటి దేశాల్లో అక్షరాస్యత ఎంతో ఎక్కువగా ఉందన్నారు. ఇండోనేషియా మలేషియా లాంటి ఇస్లామిక్ దేశాల్లో కూడా 90 శాతంపైగా అక్షరాస్యత ఉందన్నారు. చైనాలో 1959 నాటికే వంద శాతం అక్షరాస్యతను సాధించారన్నారు. మనం ఇప్పటికీ 74 శాతం వద్దనే ఉన్నామని, వ్యవసాయ కూలీలకు, ఇతర పనులు చేసుకునేవారికి చదువులు అక్కర్లేదు అనే పాలకుల ధోరణి కూడా మారాలన్నారు. చైనాలో వ్యవసాయ కూలీలకు కూడా చదువు చెప్పించడం ద్వారా వరి దిగుబడి ఎకరాకు వంద బస్తాలదాకా వస్తే మన దగ్గర చదువులేకపోవడంతో 30 నుంచి 40 బస్తాలకే పరిమితం అవుతుందన్నారు. పాలకవర్గాలు విద్యారంగంపై ఖర్చు పెట్టడం వల్ల ముడుపులు రావనే లక్ష్యంతో భారీ ప్రాజెక్టులకు ప్రాధాన్యత నిస్తున్నారని, ఈ దృక్పథం పోవాలన్నారు. చదువుకు ఖర్చు పెట్టే ప్రతిపైసా దేశ భవిష్యత్తుకు పెట్టుబడిగా భావించాలన్నారు. చదువు మూలంగా వ్యక్తికేకాక సమాజానికి మేలు జరుగుతుందన్నారు. యుటియఫ్ నాయకత్వం అక్షరాస్యత తక్కువగా ఉన్న మండలాలను గుర్తించి సామాజిక పరిస్థితులను అధ్యయనం చేసి ప్రభుత్వానికి నివేదిక ఇవ్వాలని పిలుపునిచ్చారు.

సిపిఐ రాష్ట్ర కార్యదర్శి కె. నారాయణ అనివార్య కారణాలవల్ల మహాసభకు హాజరు కాలేకపోతున్నానని, యుటియఫ్ మహాసభలు విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నట్లు పంపిన సందేశాన్ని సిపిఐ కర్నూలు జిల్లా కార్యదర్శి రామాంజనేయులు చదివి వినిపించారు.

**చుక్కారామయ్య :** ప్రముఖ విద్యావేత్త, పిడిఎఫ్ చైర్మన్ చుక్కారామయ్య మాట్లాడుతూ అన్ని దేశాల్లోనూ రాజకీయ పార్టీలు తమ ఎన్నికల సందర్భంగా రూపొందించే మానిఫెస్టోల్లో ఖచ్చితంగా విద్యకు సంబంధించి కొన్ని అజెండాలుంటాయని, అలాంటి పద్ధతి మన దేశంలో ఉండాలన్నారు. భవిష్యత్తులోనైనా ప్రతి రాజకీయ పార్టీ తమ మేనిఫెస్టోలో విద్యారంగాన్ని చేర్చాలన్నారు. ప్రాథమిక విద్య విజయవంతం కావాలంటే మధ్యాహ్న భోజన పథకం సక్రమంగా, సహృదయంతో అమలు చేయాలన్నారు. ప్రస్తుతం మధ్యాహ్న భోజనం పథకం అన్నం లేని వారికి అన్నం పెడుతున్నాం అన్న ధోరణితో సాగుతున్నదని ఇది సరైంది కాదని అన్నారు. ప్రస్తుతం మన విద్యా విధానం పెట్టుబడి దారులకు అనుకూలంగా ఉందని ఈ పద్ధతి పోవాలన్నారు. ఉపాధ్యాయుల ఎంపిక కోసం ప్రస్తుతం అనుసరిస్తున్న పరీక్షా విధానాన్ని రామయ్య తప్పు పట్టారు. నిపుణులైన విద్యావేత్తల ఆధ్వర్యంలో ఒకే పరీక్ష ద్వారా ఉపాధ్యాయులను ఎంపిక చేస్తే సరిపోతుందన్నారు. దేశ రక్షణకు సైన్యంపై ఎంత శ్రద్ధ చూపుతామో అంతే శ్రద్ధ ప్రభుత్వం విద్యా రంగంపై చూపాల్సిన అవసరముంద న్నారు. ప్రభుత్వం చేపట్టిన క్రమబద్ధీకరణ ఒక రకంగా పాఠశాలల మూసివేతకు దోహదపడే ప్రణాళిక అని విమర్శించారు.

## అలరించిన సాంస్కృతిక ప్రదర్శనలు

మహాసభ వేదికపై సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి. ఈ కార్యక్రమానికి రాష్ట్ర గౌరవాధ్యక్షులు సి. హెచ్. సుభాష్‌చంద్రబోస్ అధ్యక్షత వహించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఆయన మాట్లాడుతూ ఎలక్ట్రానిక్ మీడియా వారు సంస్కృతికి కొత్త కొత్త అర్థాలు చెప్తున్నారని అన్నారు. అన్ని వర్గాల, అన్ని వయస్సుల వారి మెదళ్ళను ఛానళ్ళు కలుషితం చేస్తున్నాయని, ఉమ్మడి సంస్కృతి నుండి వ్యక్తి సంస్కృతి వైపు నడిపిస్తున్నార న్నారు. చదవడం, వినడం మానేసి టీవీలకు కళ్ళప్పగిస్తున్నారని అన్నారు. అభ్యుదయ సాహిత్యాన్ని అందరూ చదవాలని, చదివించాలని కోరారు. ప్రజా సంస్కృతి పరిఢవిల్లాలంటే అభ్యుదయ ఉద్యమాల ద్వారా, ఉపాధ్యాయుల ద్వారానే సాధ్యమవుతుందన్నారు. అనంతరం సాంస్కృతిక

# సమరశీల వారసత్వంతో యుటియఫ్ ముందుకు సాగాలి



ఎం.వి.ఎస్. శర్మ

యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభల రెండవరోజు మే 10వ తేదీన ఉదయం సునయన ఆడిటోరియంలో ప్రతినిధుల సభ ప్రారంభమైంది. రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాస్‌చంద్రబోసు, అధ్యక్షులు ఎన్. నారాయణ, సహాధ్యక్షులు పి. బాబురెడ్డి, కార్యదర్శి కె. విజయగౌరి అధ్యక్ష వర్గంగా వ్యవహరించారు. పిడిఎఫ్ ఎమ్మెల్సీ ఎం.వి.ఎస్. శర్మ ప్రతినిధుల సభను ప్రారంభించారు. ఆయన మాట్లాడుతూ ఐక్యత, పోరాటం అనే రెండింటిని మార్గదర్శకాలుగా ఎంచుకొని యుటియఫ్ సమరశీల వారసత్వంతో పురోగమిస్తున్నదని అభినందించారు. రాష్ట్రంలోని ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాల్లో అగ్రగామిగా ఉంటూ జెఏసిలో కీలక భూమికను పోషిస్తున్నదన్నారు. విద్యారంగం అనేక సవాళ్ళను ఎదుర్కొంటున్న ఈ సమయంలో యుటియఫ్ మహాసభలు జరుగుతున్నాయని అన్నారు. రాబోయే కాలంలో విద్యా వ్యవస్థనే కాక ప్రజల ఉమ్మడి ఆస్థి మీద, స్వేచ్ఛా హక్కుల మీద, ప్రజాస్వామ్యం మీద పెద్ద ఎత్తున దాడి జరుగబోతున్నదనీ, పరిస్థితులను అధ్యయనం చేయాలని అందుకు తగ్గట్టుగా ఆర్థిక ప్రయోజనాలకేకాక ప్రజాస్వామ్య హక్కుల రక్షణకై ఉద్యమాలు చేపట్టాలని పిలుపునిచ్చారు. యుపిఏ-2 ఏర్పాటుకు మన్మోహన్ చాలా ఉత్సాహపడ్డారనీ, యుపిఏ 1లో ఉన్నట్లు వామ పక్షాల వత్తిడి ఉండదనీ, వామపక్షాలు మద్దతు ఉపసంహరించు కోవడంతో జైలు నుండి విడుదల అయినట్లు, వెట్టిచాకిరీ నుండి విముక్త మైనట్లు స్వయంగా ప్రధాని ప్రకటించుకోవడం గమనించాలన్నారు. నిధులు కావాలంటే మేం చెప్పినట్లు సంస్కరణలు అమలు చెయ్యాలని కేంద్రం రాష్ట్రాలను వత్తిడి చేస్తున్నదనీ రెండువేల కోట్ల రూపాయలు ఆర్‌విఎంకి వచ్చాయనీ, కానీ పాఠశాల విద్యాశాఖకు వాటిపై హక్కు లేదన్నారు. భారతీయుడి సగటు విద్యార్జన కాలం 2 సంవత్సరాలు, చైనాలో 5 సంవత్సరాలు, కొరియా 8 సం॥లుగా ఉన్నది. మన ప్రాథమిక విద్యారంగ జీవితకాలం పెరగాలి. ప్రాథమికరంగానికి నిధులు పెరగాలి. విద్యా చట్టం అమలు చేయడానికి ప్రైవేటు సంస్థల సహకారం తీసుకుంటామని, చందనా ఖాన్ చెప్పారని కానీ ఉపాధ్యాయ సంఘాలు కానీ, తల్లిదండ్రులకు కానీ దానిలో పాత్ర లేదేమిటి అని ప్రశ్నిస్తే వారి డిమాండ్సు గురించి ప్రత్యేకంగా మాట్లాడుతామన్నారు. అంటే ఉపాధ్యాయులకు తమ జీతనాతాల గురించి తప్ప విద్యారంగాన్ని గురించి వారికి అవసరం లేదని ప్రభుత్వం భావిస్తున్నదన్నమాట. ప్రైవేటు విద్యను ప్రోత్సహించడంలో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలను మూసివేయడంలో మన రాష్ట్రం ముందున్నదన్నారు. మూసివేసిన పాఠశాలలను, అందులోని విద్యార్థులను స్వచ్ఛంద సంస్థలకు అప్పచెబుతున్నారని కొల్లగొట్టడానికి భూములు, నీళ్ళు, గనులు, అడవులు అన్నీ అయిపోయినాయని, ఇక మిగిలింది ప్రాథమిక విద్యారంగమేనంటు మరి ఇప్పుడు మనం పోషించాల్సిన పాత్ర ఏమిటి? అంటూ ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించుకోవడానికి పెద్ద యుద్ధమే చేయాలి. చాలా సన్నాహాలు చేసుకోవాలి. శతృవు చాలా బలవంతుడు. ఎదుర్కొవడానికి అవసరమైన శక్తిని కూడగట్టుకోవాన్నారు. ప్రపంచీకరణ ప్రభావం మన మీద పడింది. సమాజసేవ అనేది గతంలో నిస్వార్థంగా ఉండేది. ఇప్పుడు వ్యాపారాత్మకం అయ్యింది. వ్యవస్థ రక్షణ కోసం ఉద్యమాన్ని పటిష్టం చేసుకోవాలి అని కాకుండా ఉద్యమాన్ని క్రెడిట్ కార్డులా కొందరు ఉపయోగించుకుంటున్నారని, ఈ విపరీత ధోరణి యువతలో ఎక్కువగా ఉందని వీరి ఆలోచనా ధోరణిని మార్చే దిశగా యుటియఫ్ ఆలోచించాలని అన్నారు. పరిమితమైన సంకుచితమైన ఆలోచనా ధోరణిని మనం తప్పు పట్టలేమని, వ్యక్తి, వ్యక్తి అవసరాలే ప్రధానం అన్న ధోరణి "ప్రపంచీకరణలోంచి వచ్చిందని, ఈ ప్రపంచీకరణ ఉమ్మడి ఆలోచనను, ఉమ్మడి వ్యవస్థను నాశనం చేస్తుంద"ని అన్నారు. ప్రపంచీకరణ చైతన్యం కలిగిన ఒక పౌరుణ్ణి యాంత్రిక వినియోగ దారుడిగా తయారు చేసిందని ప్రముఖ ఆర్థిక వేత్త నోమ్‌చామ్‌స్కీ అన్నారని తెలిపారు. ప్రపంచీకరణ ప్రమాదాన్ని గుర్తింప చేసేందుకు వారికి అవసరమైన శిక్షణ ఇవ్వాలని, పరిస్థితులను, అనుభవాలను వారి కళ్ళముందు సాక్షాత్కారింప చేయాలని అన్నారు. ఈ రాష్ట్రాన్ని వెనుక ఉండి పరిపాలిస్తున్నది ప్రపంచబ్యాంకు అనీ, పాలకులు, అధికారులు ప్రపంచబ్యాంకుతో మిళితమయ్యారని నీటిలో ఉప్పులా కలిసి పోయారనీ, చూస్తే కనబడదు. తాగితే తెలుస్తుందని అన్నారు.

యుటియఫ్ నాయకత్వం తన కార్యకర్తల స్థాయిని పెంచే దిశగా ప్రణాళికలు రూపొందించాలనీ, ప్రాథమిక యూనిట్లు అయిన పాఠశాల,

కార్యక్రమాలను ప్రారంభించారు. రాష్ట్ర కార్యదర్శి తాండవకృష్ణ నేతృత్వంలో కర్నూలు, గుంటూరు, ఖమ్మం జిల్లాల సాంస్కృతిక దళాలు, ప్రజా నాట్యమండలి కళాకారులచే నృత్యాలు, నాటికలు, మిమిక్రీ, అభ్యుదయ గీతాలు ప్రదర్శించారు. సాంస్కృతిక కార్యక్రమాలు మహాసభ ప్రతినిధులను అలరింపచేయడమేకాక ఆలోచింప చేశాయి కూడా.

## విజ్ఞానదాయకం ఎగ్జిబిషన్

మహాసభల సందర్భంగా ఏర్పాటు చేసిన వైజ్ఞానిక ప్రదర్శన స్టాల్స్ విద్యారంగానికి సంబంధించి విలువైన సమాచారాన్ని, విజ్ఞానాన్ని అందించాయి. రాష్ట్ర కార్యదర్శులు ఎ. నర్సిరెడ్డి, ఎ. వెంకట్‌లు, నల్లగొండ, కర్నూలు జిల్లా శాఖల సహకారంతో వ్యంగ్య చిత్రాలు, పట్టికలు రూపొందించి ప్రదర్శించారు. స్థానిక పాఠశాలల విద్యార్థులు లోకాస్ట్, నోకాస్ట్ బోధనోపకరణాలను ప్రదర్శించారు. జనవిజ్ఞాన వేదిక, ప్రజాశక్తి బుక్‌హౌస్ వారు పుస్తక ప్రదర్శన ఏర్పాటు చేసి అభ్యుదయ సాహిత్యాన్ని ఉపాధ్యాయులకు అందుబాటులో ఉంచారు.

## ఐక్య ఉపాధ్యాయ ప్రచురణల స్టాల్

యుటియఫ్ ప్రచురణల కమిటీ ఆధ్వర్యంలో అధ్యాపకదర్శినీలు, మెడికల్ రీయింబర్స్‌మెంట్ సర్వస్వం తదితర పుస్తకాలతోపాటు, చీరలు, టీ-షర్టులు, వివిధ రకాల బ్యాగులు చౌక ధరల్లో ఉపాధ్యాయులకు అమ్మకానికి పెట్టారు. ప్రచురణల కమిటీ చైర్మన్ సుభాస్‌చంద్రబోస్, రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.ఎస్. ప్రసాద్, నాయకులు డి. మస్తాన్‌రావు, ఎం. లక్ష్మారెడ్డి, ఐక్య ఉపాధ్యాయ సత్యనారాయణల ఆధ్వర్యంలో సేల్స్ కౌంటర్‌ను నిర్వహించారు.

మండల కమిటీలను పటిష్టం చేసుకుంటే తప్ప ఉపరితలంతో ఉద్యమాలు సాగవనీ, పోరాటాల్లోనూ వికేంద్రీకరణ జరగాలన్నారు. పునాదులను గట్టిపరచుకుని ఉద్యమాలు ప్రజా ఉద్యమాలుగా పరిణతి చెందితే ప్రభుత్వరంగాలను పరిరక్షించుకోగలమని అన్నారు. తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాలను సాధించగలిగేది మండల, పట్టణ స్థాయిల్లోనేనన్నారు. సంవత్సరానికొకసారి ఇచ్చే సభ్యత్వ రుసుం, నామ మాత్రపు విరాళం కాకుండా జీతాలు పెరిగినప్పుడో, ప్రమోషన్ సందర్భంలోనో, ఒక నెలలో అదనంగా వచ్చిన సొమ్మును విరాళంగా ఇచ్చే సంస్కృతిని అలవాటు చేసుకోవాలని సూచించారు. ఎనిమిది మంది పిడిఎఫ్ ఎమ్మెల్సీలను ఉద్యమంలో భాగంగా చూడాలని, సమస్యలపై ప్రాతినిధ్యాలు ఏవైనా యుటియఫ్ ద్వారానే రావాలని అన్నారు. సమస్యలను గుర్తించడంలో, పరిష్కరించడంలో ముందుండాలన్నారు. ఐక్య ఉద్యమాల అవసరం చాలా ఉన్నదనీ జాక్టోను కాంగ్రెసు ప్రభుత్వం చంపేసిందనీ, ఇప్పుడు ఐక్య ఉద్యమాలకు ఊపిరిపోసే కర్తవ్యాన్ని యుటియఫ్ నిర్వహించాలనీ అన్నారు. ఉపాధ్యాయ సంఘాలనే కాకుండా వివిధ మేనేజిమెంట్లలో పని చేస్తున్న కాంట్రాక్టు, ప్రైవేటు, గెస్ట్, టీచర్లందరినీ కలుపుకుని రావాలన్నారు. ఒక విశాలమైన, బలమైన సంఘ నిర్మాణానికి, వ్యాప్తికి ఈ మహాసభలు దిశా నిర్దేశం చేయాలని శర్మ ఆకాంక్షించారు.

## సౌహార్ధ సందేశాలు

ఎస్‌టిఎఫ్ఐ జాతీయ నాయకులు, తమిళనాడు ప్రైమరీ టీచర్సు ఫెడరేషన్ అధ్యక్షులు కణ్ణన్ మహాసభలో సందేశమిస్తూ ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు అందరం ఒకటిగా ఉన్నామని రాష్ట్ర విభజనతో విడిపోయామని అన్నారు. ఎస్‌టిఎఫ్ఐ నిర్మాణంలో యుటియఫ్ క్రియాశీలక పాత్ర పోషించిందని, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా మనం కలిసి పోరాటాలు నిర్వహిస్తున్నామని అన్నారు. పార్లమెంటులో ప్రవేశపెట్టిన పిఎఫ్ ఆర్‌డిఏ బిల్లుతో ఉద్యోగ ఉపాధ్యాయుల శ్రమ సంపదను కేంద్రం దోపిడీ చేసి పెట్టుబడిదారులకు అందజేస్తున్నదని విమర్శించారు. కరుణానిధి, జయలలిత ప్రభుత్వాలు ఉద్యోగులపై మోపిన ఉక్కుపాదాన్ని పటిష్ట ఉద్యమాలతోనే తొక్కిపెట్టామని, సమ్మె హక్కు లేదన్నా సమ్మెలు నిర్వహిస్తున్నామనీ, అంతులేకుండా పెరుగుతున్న ఆహార సరుకుల ధరలపై కూడా మనం ఉద్యమించాలన్నారు. తమిళనాడు ఉద్యోగ ఉపాధ్యాయులు జైళ్ళకు వెళ్ళినప్పుడు యుటియఫ్, జెఏసిల నుండి అందిన మద్దతు తమకెంతో బలాన్నిచ్చిందని గుర్తు చేసుకున్నారు.

టిఎన్‌పిజిటిఏ రాష్ట్ర నాయకులు కె. భూపాలన్ సందేశమిస్తూ యుటియఫ్ ఉద్యమాలు తమకెప్పుడూ స్ఫూర్తినిస్తాయని అన్నారు. పిఎఫ్ ఆర్‌డిఏ బిల్లు చట్టం కాకుండా పోరాడాలన్నారు. ఐక్య ఉద్యమాల ఆవశ్యకత ఎంతైనా ఉందని పేర్కొంటూ విద్యాచట్టం కార్పొరేట్లకు వరంగా మారిందన్నారు. విద్యారంగానికి పెట్టే ఖర్చును కేంద్ర ప్రభుత్వం భవిష్యత్తుకు పెట్టుబడిగా చూడకుండా అనవసర ఖర్చుగా, అనవసర బాధ్యతగా భావిస్తున్నదని విమర్శించారు.

అంగన్‌వాడీ వర్కర్సు & హెల్పర్స్ యూనియన్ రాష్ట్ర అధ్యక్షురాలు పి. లలితమ్మ, రైతు సంఘం నాయకులు ఎస్. రామారావు, ఎస్ఎఫ్ఐ రాష్ట్ర ఉపాధ్యక్షులు, నూర్ మహ్మద్, కాంట్రాక్టు ఉద్యోగుల సంఘం రాష్ట్ర కార్యదర్శి ఏ.వి. నాగేశ్వర రావు, ఫ్రీ సాఫ్ట్‌వేర్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా (ఎఫ్ఎస్ఎంఐ) జాతీయ కార్యదర్శి కిరణ్‌చంద్ర, సిఐయుటి నాయకులు అబ్బాస్, డివైఎఫ్ఐ, సాహితీ స్రవంతి స్థానిక నాయకులు తదితరులు హాజరై మహాసభలు జయప్రదం కావాలని, విద్యారంగంలోనే కాక, సామాజిక రంగంలోనూ, యుటియఫ్ ప్రధాన భూమికను పోషించాలని కోరారు.

యుటియఫ్ రాష్ట్ర నాయకులు, పిడిఎఫ్ ఎమ్మెల్సీ వై. శ్రీనివాసులు రెడ్డి సందేశమిస్తూ ప్రభుత్వ పాఠశాలల్లోని ఉపాధ్యాయుల పోస్టుల రేషనలైజేషన్‌కు సంబంధించి ప్రభుత్వం ఇటీవల విధుదల చేసిన జి.ఓ. 55 విద్యాహక్కు చట్టానికి వ్యతిరేకంగా ఉన్నదని, జి.ఓ.ను తక్షణం సవరించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ప్రతి ప్రాథమిక పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులుండాలని, అవసరమైన చోట కొత్త పోస్టులు ఇవ్వాలన్నారు. ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలల్లో ఉన్న పండిట్, పిఇటి పోస్టులను అప్‌గ్రేడ్ చేయాలన్నారు, కౌన్సిల్‌లో నేరుగా ఎన్నుకోబడిన 16 మంది ఎమ్మెల్సీల్లో సగంమంది యుటియఫ్ బలపర్చిన వారేనని, ఆ గెలుపు ఘనత యుటియఫ్‌దేనన్నారు.

## నివేదికలు - తీర్మానాలు

రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు 11వ మహాసభ అనంతరం సంఘం నిర్వహించిన కార్యకలాపాలను, పోరాటాలు- సాధించిన విజయాలు, అనుభవాలు, రాష్ట్ర వ్యాప్తంగా సంఘం నిర్మాణ పరిస్థితిని సమీక్షిస్తూ నివేదికను సమర్పించారు. కోశాధికారి ఎం. సంయుక్త ఆర్థిక నివేదికను, ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు సిహెచ్. రవి పత్రిక నివేదికను, ఆడిట్ కమిటీ కన్వీనర్ సిహెచ్.వి. రాజన్‌బాబ్ ఆడిట్ నివేదికను ప్రవేశపెట్టారు. హాజరైన ప్రతినిధులు జిల్లాల వారీగా సమావేశమై నివేదికలపై చర్చించుకున్న అనంతరం జిల్లా డెలిగేషన్ పక్షాన 1) బి. భాస్కరరావు, 2) జి. గిరిధర్ (శ్రీకాకుళం), 3) డి. రాము, 4) ఎస్. మురళీ మోహనరావు (విజయనగరం), 5) పి.ఎస్. రాజేంద్రప్రసాదవర్మ (విశాఖ), 6) కె. సత్తిరాజు, 7) జి. ప్రభాకరవర్మ, 8) జి. చిట్టిబాబు (తూ॥గో॥), 9) ఎస్. సాల్జీ (ప॥గో॥), 10) సిహెచ్. రాములు (నల్గొండ), 11) కె. సంజీవ రెడ్డి, 12) కె.ఏ. ఉమామహేశ్వర రావు (కృష్ణ), 13) ఎం. వెంకటప్ప (ఎం.నగర్), 14) ఎం. హనుమంతరావు, 15) టి. మల్లేశ్వర రావు (గుంటూరు), 16) పి. స్వామిరెడ్డి, (ఆదిలాబాద్), 17) పి. రమణారెడ్డి, 18) కె. శ్రీనివాసరావు, 19) ఎం. వెంకటేశ్వరరెడ్డి (ప్రకాశం), 20) కె. భూమిరెడ్డి (కరీంనగర్), 21) కె. పరంధామయ్య (నెల్లూరు), 22) కె. రంజిత్‌కుమార్ (వరంగల్), 23) ఎన్. సోమచంద్రారెడ్డి (చిత్తూరు), 24) ఆర్. విక్రమ్‌రెడ్డి (ఖమ్మం), 25) ఎం. ఆంజనేయులు (రంగారెడ్డి), 26) బి. లక్ష్మిరాజా (కడప), 27) మేడె దేవదాస్ (హైదరాబాద్), 28) వి. సత్యనారాయణ (మెదక్), 29) ఎస్‌ఎం. జిలాని (అనంతపురం), 30) ఎం.వి. సోమేశ్వర్లు (నిజామాబాద్), 31) ఎన్. నర్సింహుడు (కర్నూలు), 32) వి. కనకదుర్గ (పశ్చిమగోదావరి), 33) దబ్బు హేమలత (ఎం.నగర్), 34) సిహెచ్. పద్మావతి (గుంటూరు)లు చర్చలో పాల్గొని నివేదికలను స్థూలంగా ఆమోదిస్తూ ఆయా జిల్లాల అభిప్రాయాలను మహాసభకు తెలియజేశారు.

రాష్ట్ర కార్యదర్శులు ఎన్. తాండవకృష్ణ, ఎ. నర్సిరెడ్డి, పి. మాణిక్‌రెడ్డి బి. నాగేశ్వరరావు, బి. నరసింహారావు తదితరులు విద్యారంగం, ఉపాధ్యాయ సమస్యలు, సాధారణ సమస్యలపై తీర్మానాలను ప్రవేశ పెట్టగా మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

నిబంధనావళిలో నిర్మాణం అంశానికి సంబంధించి 2010 ఆగస్టులో కార్యవర్గం ఆమోదించిన సవరణలను రాటిఫికేషన్ కొరకు,

2011 నుండి సభ్యత్వ రుసుం రు. 100/-కు పెంచుతూ, నిర్మాణానికి సంబంధించిన మరికొన్ని సవరణలను రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ మహాసభలో ప్రతిపాదించారు. ప్రతినిధులు చర్చించిన అనంతరం ఏకగ్రీవంగా ఆమోదించారు. నివేదికలన్ని ఆమోదం పొందిన వెంటనే ప్రతినిధులకు కృతజ్ఞతలు తెలుపుతూ, 11వ మహాసభలలో ఎన్నికైన రాష్ట్ర కార్యవర్గం రద్దైనట్లుగా ఎన్. నారాయణ ప్రకటన చేసినారు.

అనంతరం సీనియర్ నాయకులు ఎం.ఏ.కె. దత్తు ఎన్నికల అధికారిగా, మరో సీనియర్ నాయకులు జి. చిట్టిబాబు సహాయకులుగా రాష్ట్ర కార్యవర్గానికి నిర్వహించిన ఎన్నికల్లో 116 మంది కార్యవర్గ సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అనంతరం నూతన కార్యవర్గ సభ్యులు విడిగా సమావేశమై 19 మంది రాష్ట్ర ఆఫీస్ బేరర్లను, 5గురు సభ్యుల ఆడిట్ కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

నూతన ఆఫీస్ బేరర్లు, ఆడిట్ కమిటీ, కార్యవర్గ సభ్యులందరితో జి. చిట్టిబాబు సంఘ ప్రమాణం చేయించారు. నూతన అధ్యక్షులు ఎన్. నారాయణ అధ్యక్షతన మహాసభ తిరిగి సమావేశమైంది. సమయాభావం వల్ల భవిష్యత్ కర్తవ్యాలపై చర్చించి కార్యాచరణను నిర్ణయించే అధికారాన్ని రాష్ట్ర కార్యవర్గానికి అప్పగించింది.

## విద్యతోనే మహిళలకు రక్షణ - కేంద్రమంత్రి పురంధేశ్వరి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర 12వ మహాసభల ముగింపు సభకు కేంద్ర మానవ వనరుల అభివృద్ధిశాఖ సహాయ మంత్రి డా॥ పురంధేశ్వరి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త అధ్యక్షతన నిర్వహించిన సమావేశంలో పురంధేశ్వరి ప్రధానోపన్యాసం చేస్తూ విద్యారంగంలో సంస్కరణలు అవసరం అన్నారు. చట్టాలు ఎన్ని ఉన్నా మహిళలకు రక్షణ కవచం విద్య మాత్రమే నన్నారు. అన్ని సమస్యలకు చట్టాలు రక్షణ కల్పించలేవని, విద్యతోనే అన్ని విధాల రక్షణ ఉంటుందన్నారు. 1948వ సంవత్సరంలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ విద్యా విధానాన్ని రూపొందించారని, ఇప్పటికి 60 ఏళ్ళు అయిన నేపథ్యంలో సంస్కరణల అవసరం ఏర్పడిందని అన్నారు. విద్యారంగంలో ప్రమాణాలతో కూడిన విద్యను అందించాలన్నారు. భిన్న సంస్కృతులు, సంప్రదాయాలు, భాషలు కలిగిన భారత దేశంలో 65% అక్షరాస్యత సాధించడం సామాన్య విషయం కాదన్నారు. దీన్ని వంద శాతానికి పెంచాల్సిన అవసరం ఉందనీ, మహిళల్లో అక్షరాస్యత పెరగాలనీ, దేశ జనాభాలో 50 శాతంగా ఉన్న మహిళలు విద్యావంతులు కాకపోతే దేశాభివృద్ధి జరగదన్నారు. ప్రభుత్వాలు స్త్రీ విద్య మీద దృష్టి కేంద్రీకరిస్తున్నాయన్నారు. ప్రాథమిక విద్య రాష్ట్రాల పరిధిలోనే ఉందని, కేంద్రం ఇచ్చే నిధులను సరైన రీతిలో వినియోగించుకోవలసిన బాధ్యతతోపాటు పర్యవేక్షణ కూడా చేయాలన్నారు. పట్టణ, గ్రామీణ ప్రాంతాల విద్యార్థుల మధ్య పెరుగుతున్న అంతరాలను తగ్గించే ప్రయత్నం చేయాలన్నారు.

**ప్రముఖ విద్యావేత్త చుక్కారామయ్య** మాట్లాడుతూ విద్యా సదస్సులకు హాజరు కావడం ద్వారా మంత్రులకు, విద్యావంతులకు, రాజకీయ నాయకులకు క్షేత్ర స్థాయి ఇబ్బందులు తెలుస్తాయన్నారు. హక్కులతోపాటు ఉపాధ్యాయులు బాధ్యతతో విధి నిర్వహణలో పాల్గొనాలన్నారు. వామపక్ష ఉద్యమాలు బలంగా ఉన్న చోట మహిళలపై హింస తగ్గుతుందన్నారు. వామపక్షభావ జాలం మహిళలకు రక్షణ నిస్తుందని, ప్రజాస్వామ్యం మనుగడ సాగించాలంటే వామపక్ష ఉద్యమాలను ప్రోత్సహించాలని, బలపరచాలని అన్నారు. అందరికీ నాణ్యమైన, సమానమైన విద్య అందించగలిగిన విద్యా విధానం రావాలని ఆకాంక్షించారు. పోటీ ప్రపంచానికి అవసరమైన సామర్థ్యం మన విద్యార్థులకు అందాలని అభిలషించారు.

స్థానిక ఎమ్మెల్సీ, ప్రజా వైద్యులు డా॥ గేయానంద్ మాట్లాడుతూ అత్యంత వెనుకబడిన రాయలసీమలో విద్యావకాశాలను అందించాలన్నారు. సీమలో ఒక కేంద్రీయ విశ్వ విద్యాలయాన్ని స్థాపించేందుకు చొరవ తీసుకోవాలని కేంద్ర మంత్రి పురందేశ్వరికి విజ్ఞప్తి చేశారు. రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ రాష్ట్రంలోని పాఠశాలల స్థితిగతులను వివరిస్తూ రాష్ట్ర ప్రభుత్వం విద్యారంగంలో చేపడుతున్న చర్యలు విద్యా చట్టానికి తూట్లు పొడుస్తున్నాయన్నారు. అక్షరాస్యత శాతాన్ని పెంచేందుకు వేలాది పోస్టులు అవసరం కాగా రేషనలైజేషన్ పేరుతో ఉన్న పోస్టులకే మంగళం పాడుతూ పరోక్షంగా వేల స్కూళ్ళ మూసివేతకు కారణం అవుతుందన్నారు. ఈ సందర్భంగా మహిళా ఉపాధ్యాయుల సమస్యలపై ఒక వినతి పత్రాన్ని రాష్ట్ర కార్యదర్శి కె. విజయగౌరి చదివి విన్పించిన అనంతరం మంత్రికి అందజేశారు. ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం, శ్రీనివాసులురెడ్డి, ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వ రావు, గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ తదితర కార్యదర్శి వర్గ సభ్యులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో యుటియఫ్ మహిళా విభాగం పక్షాన పురంధేశ్వరిని సత్కరించారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు డి.ఎల్. ప్రసన్న కుమారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## ఆహ్వాన సంఘానికి అభినందన

శక్తికిమించిన శ్రమతో ఆతిథ్యమిచ్చి చక్కటి వసతి, భోజన సౌకర్యాలను కల్పించి మహాసభల విజయవంతానికి సహకరించిన యుటియఫ్ కర్నూలు జిల్లాశాఖను, ఆహ్వాన సంఘాన్ని రాష్ట్ర కమిటీ అభినందించింది. జిల్లా నాయకులు, వాలంటీర్లుగా శ్రమించిన యుటియఫ్ కార్యకర్తలు, ప్రజా సంఘాల కార్యకర్తలు, ఆర్థిక సహకారాన్ని అందజేసిన ఉపాధ్యాయులు, శ్రేయోభిలాషులకు, ప్రెస్, మీడియా వారందరికీ ధన్యవాదాలు తెలిపింది. రాష్ట్ర కమిటీ పక్షాన అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులకు జ్ఞాపికలను బహుకరించారు.

## అప్రెంటిస్ సమస్యపై అంతిమ పోరాటం

## జూన్ 27 నుండి యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ నిరవధిక నిరాహారదీక్ష

9వ పీఆర్‌సీ సిఫారసు మేరకు ఉపాధ్యాయ నియామకాలలో అప్రెంటిస్ విధానం రద్దు చేయాలని, 2008 డిఎస్‌సి ద్వారా నియామకమైన 45వేల మంది ఉపాధ్యాయులకు వారి నియామకపు తేదీ నుండి పూర్తి జీతం చెల్లించాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు **ఎన్. నారాయణ** నేతృత్వంలో కొందరు అప్రెంటిస్ టీచర్లు జూన్ 27 నుండి హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్‌వద్ద నిరవధిక నిరాహారదీక్షకు పూనుకుంటున్నారు. ఈ దీక్షకు మద్ధతుగా శిబిరంలో ప్రతిరోజు 100 మంది ఉపాధ్యాయులు సామూహిక రిలే నిరాహారదీక్ష చేస్తారు. అన్ని జిల్లాలు, డివిజన్ కేంద్రాలలో యుటియఫ్ ఆధ్వర్యంలో రిలే నిరాహార దీక్షలు నిర్వహిస్తారు. ఈ దీక్షలలో అప్రెంటిస్ ఉపాధ్యాయులు పెద్ద సంఖ్యలో పాల్గొని పోరాటాన్ని విజయవంతం చేయాలని యుటియఫ్ కోరుతున్నది.

**అప్రెంటిస్ అంతం ...యుటియఫ్ పంతం**

# 12వ మహాసభలలో ఎన్నికైన
## నూతన రాష్ట్ర కార్యవర్గం

గౌరవాధ్యక్షులు : **సిహెచ్. సుభాస్‌చంద్రబోస్**
అధ్యక్షులు : **ఎన్. నారాయణ**
సహాధ్యక్షులు : **పి. బాబురెడ్డి, ఎం. సంయుక్త**
ప్రధానకార్యదర్శి : **ఐ. వెంకటేశ్వర రావు**
కోశాధికారి : **పి. మాణిక్‌రెడ్డి**

### కార్యదర్శులు

**సిహెచ్. రవి** (సెంటర్)
**సి.కె. నాగేంద్రబాబు** (అనంతపురం)
**కె. విజయగౌరి** (విజయనగరం)
**ఏ. నర్సిరెడ్డి** (నల్లగొండ)
**బి. నరసింహారావు** (ఖమ్మం)
**ఎం.వెంకటేశ్వర రెడ్డి** (ప్రకాశం)
**టి. లక్ష్మారెడ్డి** (మెదక్)
**బి. నాగేశ్వర రావు** (కృష్ణా)
**ఎన్. కిష్టయ్య** (ఎం.నగర్)
**కె.ఎస్.ఎస్. ప్రసాద్** (తూ॥గోదావరి)
**ఎన్. తాండవకృష్ణ** (గుంటూరు)
**ఎన్. సోమచంద్రారెడ్డి** (చిత్తూరు)
**ఎస్. సాబ్జీ** (ప॥గోదావరి)

### ఆడిట్ కమిటీ

కన్వీనర్ : **సిహెచ్.వి.రాజన్‌బాబ్** (హైదరాబాద్), సభ్యులు : **వి.మాలకొండారెడ్డి** (ప్రకాశం),**ఏ. శ్రీనివాస్** (వరంగల్), **బి.వి. రమణమూర్తి** (ప॥గోదావరి), **బి. మాణిక్యంశెట్టి** (కర్నూలు)

### రాష్ట్ర కార్యవర్గ సభ్యులు

జి. గిరిధర్, బి. భాస్కర్‌రావు, సిహెచ్. రవీంద్ర (శ్రీకాకుళం), డి. రాము, ఎస్. మురళీమోహన్, కె. శేషగిరి (విజయనగరం), పి.వి.ఎస్.ఆర్.కె. వర్మ, ఎన్. సుబ్బారావు,ఆర్. రామకొండల రావు, (విశాఖపట్నం), కె. సత్తిరాజు, జి. ప్రభాకర్‌వర్మ, ఎస్. జ్యోతిబస్, ఎం. విజయగౌరి, కె.వి. ప్రసాద్‌బాబు, టి. సుర్యానారాయణ, టి. కామేశ్వర రావు (తూర్పుగోదావరి), ఎస్. శ్రీకాంత్, ఎం.ఐ. విజయకుమార్, ఎస్. జయప్రభ, వై.వి. డేవిడ్‌రాజు, జి.వి.వి. రామానుజరావు, పి. జయకర్ (పశ్చిమగోదావరి), కె.ఏ.ఉమామహేశ్వరరావు, జి. పాల్‌బాబురావు, కె. సంజీవరెడ్డి, డి. నవభారతి, ఏ. కృష్ణ సుందరరావు (కృష్ణా), ఎం. హనుమంతరావు, జి. ప్రభుదాస్, జి. విజయసారధి, కృష్ణతులసి, టి. సత్యనారాయణ, యు. రాజశేఖర్, పి. (గుంటూరు), కె. శ్రీనివాస్, పి. రమణారెడ్డి, డి. రామిరెడ్డి, ఎం. ప్రేమమ్మ, కె. వెంకట్రావు, డి. వీరాంజనేయులు (ప్రకాశం), కె. పరంధామయ్య, సిహెచ్. శ్రీహరి, పి. జానకీరాం, ఎం.వి. చలపతి, ఎస్.కె. ఖాజా రసూల్, టి. కొండాచారి (నెల్లూరు), జి. శ్రీరామమూర్తి, జి. ఉదయలక్ష్మి, ఎస్.హెచ్. రహమాన్, వై. చంద్రశేఖర్‌రెడ్డి, వై. శ్రీనివాసులు రెడ్డి (చిత్తూరు), బి. లక్ష్మిరాజ, ఎస్. ఓబులరెడ్డి, ఎస్.వి. సుబ్బరాజు (కడప), ఎస్.ఎం.డి. జిలాన్, బి. శ్రీరాములు, భాస్కర్ (అనంతపురం), జి. రాజశేఖర్, కె. నాగేశ్వర రావు, బి. రాందాస్, సిహెచ్. దుర్గాభవాని (ఖమ్మం), కె. రంజిత్‌కుమార్, ఎస్. సదానంద్, బి. వెంకట్‌రెడ్డి (వరంగల్), కె. భూమ్‌రెడ్డి, టి.రాజేష్ (కరీంనగర్), ఏ. వెంకట్, సి. స్వామిరెడ్డి, ఎం. రాజన్న (ఆదిలాబాద్), సిహెచ్. రాములు, ఎం.రాజశేఖర్ రెడ్డి, జి. ఉషాదేవి, ఎన్. బల్‌రాం, పి. లక్‌పతినాయక్ (నల్లగొండ), ఎం. వెంకటప్ప, కె. జంగయ్య, ఎస్. రవి ప్రసాద్ గౌడ్ (ఎం.నగర్), పి. బాలగోపాల్, వి. సత్యనారాయణ (మెదక్), డి. సత్యానంద్, ఎం.వి. సోమేశ్వర్లు (నిజామాబాద్), ఎం. ఆంజనేయులు, ఎన్. పురుషోత్తమరావు, డి. మల్లారెడ్డి డి.ఎల్. ప్రసన్న కుమారి (రంగారెడ్డి), మేడె దేవదాస్, ఎస్.వై. కొండల రావు, కె. రేణు, ఎన్. రమేష్ (హైదరాబాద్), 4 కో–ఆప్షన్ (కర్నూలు), ఎం.ఏ.కె. దత్, ఎన్. రమణయ్యశాస్త్రి, డి. మస్తాన్‌రావు, ఎం. లక్ష్మారెడ్డి (సెంటర్)

### ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గం

**సిహెచ్. రవి** (ప్రధాన సంపాదకులు), **ఎం. సంయుక్త**, **కె. వెంకట్రావు** (ప్రకాశం), **ఎన్. పురుషోత్తమరావు**, **టిఎస్ఎన్. మల్లేశ్వర రావు** (గుంటూరు), **డా॥ ఏ. విద్యాదేవి** (వరంగల్)

# ఆహ్వాన సంఘ స్వాగతోపన్యాసము

అధ్యక్షా !

వేదికపై ఆసీనులై ఉన్న ఉపాధ్యాయ రాష్ట్ర, జాతీయ నాయకులు మరియు రాష్ట్రం నలుమూలల నుండి వచ్చిన ఉపాధ్యాయ ఉద్యమ ప్రతినిధులారా!

యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభలలో పాల్గొనేందుకై వచ్చిన మిమ్మల్నందరినీ ఆహ్వాన సంఘం తరపున హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము. మీ రాకకై, మీకు అతిథ్యమిచ్చేందుకై కర్నూలు నగరం సాదరంగా ఎదురు చూస్తున్నది. మీకు స్వాగతం పలకాలని జిల్లా ఉపాధ్యాయ ఉద్యమం సమయాత్తమై ఉంది.

ప్రజా పోరాట సాంప్రదాయాలున్న కర్నూలు గడ్డపై యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభలు జరగడం సంతోషంగా ఉంది. 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరగటానికంటే పదేళ్ళకు ముందు ఆంగ్లేయులనెదిరించి వారిని ముప్పుతిప్పలు పెట్టి, మాతృభూమిపై భక్తితో ప్రాణాలను బలిదాన మొసగిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఈ ప్రాంతీయుడే. సరాయి పాలనకు వ్యతిరేకంగా పోరాడిన కొండారెడ్డి కర్నూలు కోటలోనే ఖైదు చేయబడి ప్రాణాలు వదిలాడు. నేడు నగరం మధ్యలోనున్న "కొండారెడ్డి బురుజు" ఆయన స్మృతి చిహ్నమే. కర్నూలు జిల్లాలో ఉన్న నల్లమల అరణ్యాలు తెలంగాణా విప్లవ పోరాట గెరిల్లాలకు స్థావరాలై సహాయపడినవి. దేశ స్వాతంత్ర్య కోసం సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా జరిగిన పోరులో కర్నూలు జిల్లా ప్రజలు మమేకమయినారు.

**జి. పుల్లయ్య,**
**చైర్మన్, ఆహ్వాన సంఘం**

కళాసాహిత్యాలలో కూడా కర్నూలు జిల్లా ప్రత్యేకత కలది. తెలుగులో మొదటి నవల వెలువడింది కర్నూలులోనే. కర్నూలు డిప్యూటీ కలెక్టరుగా పనిచేసిన గోపాల క్రిష్ణమ్మ శెట్టిగారు కులాచారాలను, వర్గభేదాలను, మూఢాచారాలను విమర్శిస్తూ 1872లోనే "శ్రీరంగరజా చరిత్ర" అనే నవలను వ్రాసినారు. ఇక కళాపూర్ణోదయం వ్రాసిన కృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకరైన పింగళి సూరన ఈ ప్రాంతం వాడే. 'ముగ్గురు మరాఠీ'లుగా ప్రసిద్ధమైన చరిత్ర ఈ జిల్లాకు సంబంధించినదే. ఈ జిల్లాలోని మహానంది, అహోబిలం, శ్రీశైలం లాంటి ప్రాచీన ఆలయాలు, కోటలు, మసీదులు మరియు గుమ్మజ్‌లు నాటి కళా నైపుణ్యాలకు చిహ్నాలు.

వయోజన విద్య, గ్రంథాలయోద్యమ పితామహులు, తెలుగువారి తొలి దినపత్రిక 'ఆంధ్రపత్రిక' తొలి సంపాదకులు అయిన గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు ఈ జిల్లా వాసులే. 'తెలుగు ప్రజలందరికీ ఒక రాష్ట్రం' కావాలన్న భావన బలపడింది నంద్యాలలో 1915లో జరిగిన 'ఆంధ్ర మహాసభ'లోనే, దత్త మండలాలు (సీడెడ్) అన్న గౌరవ హీనమైన పేరు బదులు గర్వంగా 'రాయలసీమ'గా నామకరణం చేయాలన్న ప్రతిపాదన వచ్చింది ఆ సభలోనే.

కర్నూలు ప్రాంతం చాలా ప్రాచీనమైనది. చరిత్ర పూర్వయుగం, పాత రాతియుగం, కొత్త రాతియుగాల ఆదిమ మానవ జీవితాలకు సంబంధించిన పురాతత్త్వ శాస్త్ర ఆధారాలు అనేకం ఇక్కడ లభించినాయి. రాతి ఆయుధాలు తయారు చేసుకోవడానికి శ్రేష్ఠమైన రాళ్ళు తుంగభద్ర, కృష్ణానదీ తీరాల వెంబడి లభించేవనీ, వాటిని ఉపయోగిస్తూ ఆ తీరాల వెంబడి జనావాసాలుండేవనీ చరిత్ర చెబుతుంది. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అత్యంత ప్రాచీనమైన "బెలూం" గుహలు ఈ జిల్లాలోనివే. ప్రఖ్యాత చైనా యాత్రికుడు హుయాన్ త్సాంగ్ ఈ ప్రాంతం మీదుగానే కంచికి వెళ్ళినాడట.

క్రీ॥శ॥ 11,12 శతాబ్దాల మధ్య వెలసిన 'కందెనవోలు' పల్లె కాలక్రమాన ఈనాటి కర్నూలుగా పరిణామం చెందింది. కాకతీయుల నుండి ఆంగ్లేయుల దాకా ఎందరెందరో రాజులు, చక్రవర్తులు, నవాబులు, సుల్తానులు ఈ ప్రాంతంపై ఆధిపత్యం చెలాయించారు.

నైసర్గికంగా కర్నూలు రాయలసీమకు ముఖద్వారంగా ఉంది. జిల్లాలోని నల్లమల, ఎర్రమల అడవులు సహజ సౌందర్యంగల చక్కని అరణ్యాలు. జిల్లాలో తుంగభద్ర, కృష్ణా, కుందు, హంద్రి నదులు ప్రవహిస్తున్నాయి. అయినా జిల్లాలోని చాలా ప్రాంతాలు నిరంతరం కరువు కాటకాలతో మగ్గుతున్నాయి. భూగర్భంలో అమూల్యమైన ఖనిజ సంపద ఉంది. ఇనుప ఖనిజము, సున్నపురాయి, రంగు రంగుల నాపరాళ్ళు ఖరీదైన గ్రానైట్ రాళ్ళు ఈ జిల్లాలో దొరుకుతాయి. జొన్నగిరి ప్రాంతంలో వజ్రాలు లభిస్తాయి. కర్నూలు, నంద్యాల, ఆదోని, ఎమ్మిగనూరు, పాణ్యం, డోన్, బేతంచర్ల వంటి ప్రాంతాలు పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ప్రాంతాలు. బంగినపల్లి మామిడిపళ్ళు ఈ జిల్లావే.

ఆధునికాంధ్ర రాజకీయ చరిత్రలో కర్నూలు కూడా తన ప్రత్యేకతను నిలుపుకొంది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత తొలి రాజధానిగా గౌరవాన్నందుకుంది. రాష్ట్ర, దేశ అధికార రాజకీయాలను ప్రభావితం చేసిన అనేకమంది కర్నూలు జిల్లా నుండే వెళ్ళినారు. ఇద్దరు ముఖ్య మంత్రులు, ఒక ప్రధానమంత్రి, ఒక రాష్ట్రపతి ఈ జిల్లా నుండే ప్రాతినిధ్యం వహించినారు. ఈనాటి ప్రజా ఉద్యమాలలో కూడా కర్నూలు జిల్లా తన వంతు పాత్ర పోషిస్తూనే ఉంది. 1952లో కృష్ణా నదీ జలాలను తమిళనాడుకు తరలించాలని రాజాజీ తలపెట్టినప్పుడు ఆంధ్ర నదీ జలాలు న్యాయంగా ఆంధ్రలోనే వినియోగించాలని సాగించిన ఆందోళనలో కర్నూలు జిల్లా ప్రజానీకం ప్రధాన పాత్ర వహించారు. 1954లో ఆంధ్ర రాష్ట్ర రైతు యాత్ర కర్నూలులో జరిగింది. భూస్వాముల గ్రూపు రాజకీయాలు, ఫ్యాక్షన్ హత్యలు ఇటీవల కాలంలో తగ్గుముఖం పట్టాయి.

ఇక జిల్లాలో విద్యారంగ పరిస్థితికొస్తే ప్రస్తుతం జిల్లా అక్షరాస్యత గతంలోకన్నా మెరుగుపడింది. జిల్లాలో స్వాతంత్ర్యానికి పూర్వం నుండి విద్యాసేవ చేసిన అనేక మిషనరీ పాఠశాలలు ఘన చరిత్ర

కలిగి ఉన్నాయి. ఎంతోమంది ప్రముఖులను తీర్చిదిద్దిన ఎయిడెడ్ పాఠశాలలు, మున్సిపల్ పాఠశాలలు ప్రభుత్వ విధానాల వల్ల నేడు ఖాయిలా పడ్డాయి. గ్రామీణ ప్రాంతాల్లో సైతం విద్యా సేవనందిస్తున్న ప్రభుత్వ పంచాయితీ రాజ్ పాఠశాలలు కూడా కునారిల్లుతున్నాయి. మరోవైపు ప్రైవేట్ విద్యారంగం అభివృద్ధి చెందుతున్నప్పటికీ, వాటిని సైతం మింగివేసే విధంగా కార్పొరేట్ విద్యారంగం వేళ్ళూనుకుంటుంది. అయినా శక్తి మేరకు కృషి చేసి వాటికి ధీటుగా ఫలితాలు సాధించే ఉపాధ్యాయులు ఈ జిల్లాలోని ప్రభుత్వ రంగ పాఠశాలల్లో పనిచేస్తుండడం సానుకూల అంశం.

ఉపాధ్యాయ ఉద్యమంలో కూడా కర్నూలుకు విశిష్టత ఉన్నది. 1974లో రాజమండ్రి తొలి మహాసభ సందర్భంగా ఏర్పడిన తొలి యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి వర్గంలో కర్నూలుజిల్లా నుండి కర్రెన్నగారు ప్రాతినిధ్యం వహించారు. ఈ జిల్లాలో జరిగిన సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమంలో యుటియఫ్ తనదైన శైలిలో ప్రధానపాత్ర పోషించి, ఎంతోమంది నిరక్షరాస్య వయోజనులు అక్షరాస్యులుగా మారడానికి కృషి చేసింది. సామాజిక స్పృహతో వివిధ ప్రజా సంఘాలతో కలిసి పోరాటాలు చేయడమేగాక, వివిధ రంగాల ఆందోళనలకు సంఘీభావం తెల్పి చేయూతనిచ్చింది. ఎన్నో ఉపాధ్యాయ, ఉద్యోగ ఐక్య ఉద్యమాలలో అగ్రభాగాన నిలిచింది. అనుకోని వరదలతో జిల్లా అట్టుకుడికినప్పుడు ఎన్నో విధాలుగా ప్రజలను ఆదుకోవడంలో ముందు భాగాన ఉన్నది. జిల్లాలో ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకు కృషి చేస్తున్నది. కర్రెన్నగారితో పాటు వెంకట్రామయ్య, గోవిందప్ప, బి. క్రిష్టారెడ్డి, నరసప్ప, వెంకట రమణమ్మ, ఎ. చెన్నకేశవరెడ్డి, జి.సి.లక్ష్మిరెడ్డి, టి.క్రిష్ణయ్య, గురుస్వామి, రంగస్వామి వంటి ఎంతోమంది సీనియర్ నాయకుల కృషి వల్ల ఈ జిల్లా ఉద్యమం రాష్ట్ర మహాసభలు నిర్వహించే స్థాయికి ఎదిగింది.

అంతర్జాతీయంగా అలుముకొన్న ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ విధానాల వల్ల ప్రభుత్వ విద్యారంగ మనుగడకే ముప్పు వాటిల్లే పరిస్థితుల్లో అలాంటి తిరోగామి విధానాలను నిలువరించేందుకు పోరాడుతున్న యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభలకు ఆతిథ్యం ఇచ్చే అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞతలు తెలియజేసుకుంటూ మరొక్కసారి స్వాగతం చెబుతున్నాను.

అలానాడు యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించిన నాకు ఈనాడు రాష్ట్ర మహాసభల ఆహ్వాన సంఘం అధ్యక్షునిగా మీ అందరికీ ఆతిథ్యం ఇచ్చే అవకాశం లభించడం అరుదైన గౌరవంగా భావిస్తున్నాను. మా శక్తి మేరకు తగిన సౌకర్యాలు కల్పించేందుకు ప్రయత్నిస్తున్నామని వినమ్రంగా తెలుపుకుంటున్నాను. మా ఏర్పాట్లలో ఏమైనా లోపం జరిగితే, అసౌకర్యాలను మన్నించ వలసినదిగా మా విజ్ఞప్తి.

ఈ మహాసభ రాష్ట్ర ఉపాధ్యాయ ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవడానికి తోడ్పడగలదని తదనుగుణంగా చర్చలు, సమీక్షలు జరగగలవనీ ఆశిస్తూ... ఉద్యమ వందనాలతో సెలవు తీసుకుంటున్నాను.

## పాట

### యుటియఫ్ రాష్ట్ర మహాసభల స్వాగత గీతం

- ఎలమర్తి రమణయ్య, కర్నూ

1. పల్లవి: స్వాగతాంజలి సుస్వాగతాంజలి
సాదరంగ యుటియఫ్ సమర్పించు అంజలి
హార్థికంగా యుటియఫ్ ఘటియించు అంజలి
ఐక్య ఉపాధ్యాయ ఘటియించు అంజలి

అ.ప. : రాష్ట్ర మహాసభలకు - కందనోలు జిల్లాకు
విచ్చేసిన ప్రముఖులకు అతిథులకు నేతలకు
అరుదెంచిన అధ్యాపక ఉద్యమ కెరటాలకు
॥వందనాలు

**చరణాలు**

1. తెలుగు మూలమైన త్రిలింగాల నొక్కటి
శ్రీశైలం శివక్షేత్రం విలసిల్లిన జిల్లాకు
ఘనుడా అశోకుడు దక్షిణాది నేలగా
నెలకొల్పిన రాజధాని అలరారే సీమకు
॥అరుదెంచిన

2. చెరువులు కట్టించి కరువు-తరిమిన రాయల కొలువున
కమ్మని ప్రబంధాన్ని రచియించిన సూరన
జాగిలాన్ని కుందేలే వెంటాడిన పోతుగడ్డ
విజయనగర సామ్రాజ్యం విరాజిల్లిన జిల్లాకు
॥అరుదెంచిన

3. తొలి భారత స్వాతంత్ర్యపు సమరానికి పూర్వమే
తెల్లదొరల నెదిరించిన పాలెగాడి ప్రాంతానికి
వందేమాతరమంటూ నినదించిన యోధుడు
ఆంధ్ర తిలక్ గాడిచర్ల పురిటిగడ్డ కర్నూలుకు
॥అరుదెంచిన

4. భారత రాజ్యాంగ సభాసభ్యుడైన సర్ధారు
దేశంలో ప్రథమ దళిత ముఖ్యమంత్రి దామోదరు
నీతికి మారుపేరు ముఖ్యమంత్రి కోట్లను
విప్లవ నేతలను కన్న తల్లి కర్నూలుకు
॥అరుదెంచిన

5. సోనా మసూరిని పండించే అన్నపూర్ణ
మధురము బనగానపల్లె మామిడి పండే జిల్లా
గౌరవయ్యల జానపదం కళకే ఇది పుట్టినిల్లు
ఉపాధ్యాయ కార్మిక ఉద్యోగ ఉద్యమాల ఖిల్లా
కందనోలు జిల్లాకు - రాష్ట్ర మహాసభలకు
॥అరుదెంచిన

# పాఠశాల విద్యాభివృద్ధికి యుటియఫ్ ప్రతిపాదనలు

## రాష్ట్ర మహాసభలో యుటియఫ్ ప్రవేశ పెట్టిన పత్రం

ఐ. వెంకటేశ్వర రావు
యుటియఫ్ ప్రధానకార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) "అధ్యయన,అధ్యాపనం, సామాజిక స్పృహ"తో పని చేస్తున్నది. ఉపాధ్యాయుల సమస్యలతోపాటు విద్యారంగ సమస్యల పరిష్కారానికి ముఖ్యంగా పాఠశాల విద్యాభివృద్ధికి ప్రత్యేకంగా కృషి చేస్తున్నది. ప్రతి మహాసభలోనూ విద్యారంగ సమస్యలను చర్చించి పరిష్కార మార్గాలు సూచిస్తూ తీర్మానాలు చేసి ప్రభుత్వానికి అందించటం జరుగుతున్నది. విద్యా విధానంలో ప్రభుత్వం మౌలికమైన మార్పులు చేసిన సందర్భాల్లో అందులోని లోపాలను ఎత్తిచూపి ప్రత్యామ్నాయ విధానాలను ప్రతిపాదించటం జరుగుతున్నది. 1986లో నూతన విద్యా విధానం 1992లో ఆచార్య రామ్మూర్తి కమిటీ, జాతీయ పాఠ్యప్రణాళికా చట్రం 2000, 2005, విద్యాహక్కు చట్టం తదితర సందర్భాల్లో యుటియఫ్ అనేక నిర్మాణాత్మక సూచనలు చేసింది. రెండేళ్ల క్రితం నల్లగొండలో జరిగిన 11వ రాష్ట్ర మహాసభలో రాష్ట్ర పాఠశాల విద్యారంగాన్ని పరిశీలించి కొన్ని ముఖ్యమైన ప్రతిపాదనలు చేశాము. రాష్ట్ర విద్యారంగాన్ని సమగ్రంగా సమీక్షించి, ఈనాటి అవసరాలకు అనువైన విద్యా విధానాన్ని రూపొందించటానికి రాష్ట్ర విద్యా కమీషన్ నియమించాలని సూచించాము. కానీ రాష్ట్ర ప్రభుత్వం ఆ పనిచేయలేక పోయింది. కొంతమంది ఉపాధ్యాయులను నియమించటం, కొన్ని పాఠశాలలకు భవనాల నిర్మాణం వంటి కొన్ని చర్యలు చేపట్టినా అనేక సమస్యలు అలాగే వున్నాయి. ఇటీవలి కాలంలో ప్రభుత్వ ఏకపక్ష నిర్ణయాల వలన మరికొన్ని క్రొత్త సమస్యలు ముందుకొచ్చాయి. ఈ పరిస్థితుల్లో రాష్ట్రంలో పాఠశాల విద్యాభివృద్ధికి క్రింద పేర్కొన్న ప్రతిపాదనలు చేస్తున్నాము.

**1. విద్యాహక్కు, ఆర్ఎంఎస్ఏ సద్వినియోగం కావాలి**

6-14 సంవత్సరాల పిల్లలు అందరికీ విధిగా చదువు చెప్పాలని విద్యాహక్కు చట్టం వచ్చింది. దాని ప్రకారం బడిలోలేని పిల్లలందరినీ బడిలో చేర్చాలి. వారికి అవసరమైన అదనపు పాఠశాలల్ని, రెసిడెన్షియల్ స్కూల్స్‌ని ఏర్పాటు చేయాలి. దేశ వ్యాప్తంగా 10 లక్షల మంది ఉపాధ్యాయులు అవసరమవుతారని, అందులో ఆంధ్రప్రదేశ్‌కి 65వేల మంది ఉపాధ్యాయులు కావాలని విద్యాహక్కు చట్టం అమల్లోకి వచ్చిన 2010 ఏప్రిల్ 1న కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. అందుకు విరుద్ధంగా రాష్ట్ర ప్రభుత్వం జి.ఓ.55 తెచ్చింది. విద్యాహక్కు చట్టాన్ని అమలు చేసే పేరుతో పాఠశాలలు, ఉపాధ్యాయ పోస్టుల రేషనలైజేషన్‌కి ప్రభుత్వం పూనుకొన్నది. ప్రభుత్వ తాజా ఉత్తర్వుల ప్రకారం దాదాపు 10వేల ప్రాథమిక పాఠశాలలు సింగిల్ టీచర్ స్కూల్స్‌గా దిగజారిపోతాయి. ఆ పాఠశాలల్లో చదివే విద్యార్థులకు తీవ్రమైన అన్యాయం జరుగుతుంది. తక్కువ మంది విద్యార్థులు వుండే పాఠశాలలను ఎక్కువమంది విద్యార్థులుండే పాఠశాలల్లో విలీనం చేయాలనే పథకాన్ని సిద్ధం చేసింది. అది అమలు జరిగితే దాదాపు 7వేల స్కూళ్లు మూతబడతాయి. వీటిలో అత్యధికం దళిత వాడలు, గిరిజన తండాల్లోనే వున్నాయి. విద్యాహక్కు చట్టంలోనే ఎస్సీ, ఎస్టీ కాలనీల్లో పాఠశాలలను నెలకొల్పే విధానాన్ని విరమించాలని చెప్పటం జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ అసమగ్ర చర్యలతో విద్యాహక్కు చట్టం మన మన రాష్ట్రానికి ఉపయోగం జరిగే పరిస్థితి లేదు. కాగా విద్యాహక్కు చట్టంతో ప్రైవేట్ విద్యా వ్యాపారానికి ప్రోత్సాహం లభిస్తున్నట్లుగా వున్నది.

రాష్ట్రీయ మాధ్యమిక్ శిక్షా అభియాన్‌తో సెకండరీ విద్యను బలోపేతం చేసే కార్యక్రమంలో భాగంగా 6300 హైస్కూళ్లలో ఇంగ్లీష్ మీడియం సెక్షన్‌లు ప్రారంభించటం జరిగింది. కానీ ఇంగ్లీష్‌లో పాఠాలు చెప్పే టీచర్లను నియమించటం లేదు. అందువలన ప్రభుత్వ ఇంగ్లీష్ మీడియంలోని విద్యార్థులు ప్రైవేట్ ఇంగ్లీష్ మీడియంలోకి వెళ్లిపోతున్నారు. సక్సెస్ పథకంతో ప్రభుత్వ, జిల్లా పరిషత్ హైస్కూళ్లకే ప్రాధాన్యత యిస్తూ మున్సిపల్, గిరిజన హైస్కూళ్లకు అన్యాయం చేయబడుతున్నది. ఎయిడెడ్ హైస్కూళ్లను గాలికి వదిలేయటం జరిగింది. 3500 మోడల్ హైస్కూళ్లు ప్రభుత్వ డబ్బుతో ప్రైవేట్ యాజమాన్యంలో నెలకొంటున్నాయి. కంప్యూటర్ విద్య ఔట్‌సోర్సింగ్ పేరుతో కార్పొరేట్ సంస్థలకు లాభదాయకంగా మారింది. అందువలన పాఠశాలల్లో పనిచేస్తున్న కంప్యూటర్ టీచర్‌లు అర్థాకలితో అలమటిస్తున్నారు. కేరళ రాష్ట్రంలో ఐసిటి విద్య పాఠశాల సిలబస్‌లో అంతర్భాగంగా నడుస్తున్నది. రెగ్యులర్ టీచర్లే కంప్యూటర్ పాఠాలు చెబుతున్నారు. కేంద్ర ప్రభుత్వం ఆ రాష్ట్రానికి అవార్డ్ యిచ్చింది. దాన్ని ఆదర్శంగా తీసుకోవాలని చెప్పినా మన విద్యాశాఖ పట్టించుకోవటం లేదు.

**2. పాఠశాల విద్య విభజన వద్దు, ఇంటర్ విలీనం వద్దు**

పాఠశాల విద్యాశాఖను ప్రాథమిక, మాధ్యమిక శాఖలుగా విభజించి, ఇంటర్ విద్యను మాధ్యమిక విద్యలో విలీనం చేయాలనే ప్రభుత్వ పథకం సరైంది కాదని యుటియఫ్ తదితర ఉపాధ్యాయ సంఘాలు తీవ్రంగా వ్యతిరేకించాయి. దానితో ప్రభుత్వం పునరాలోచనలో పడింది. ఇంటర్ విలీనం విషయంలో వెనక్కి తగ్గింది. కానీ పాఠశాల విద్య విభజన చర్యలు కొనసాగిస్తూనే వున్నది. ప్రాథమిక విద్యాశాఖ డైరెక్టరేట్ కోసం ఏర్పాట్లు చేస్తోంది. ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలను ఒక శాఖగా, మిగిలిన హైస్కూళ్లను మరో శాఖగా చేస్తే పాఠశాల విద్య దెబ్బతినే ప్రమాదం వున్నది. కొఠారి కమీషన్ చెప్పిన పదో తరగతి దాకా నిరంతర విద్య కోసం ఒకే శాఖగా వుండాలనే మౌలిక విధానం ఎగిరిపోతుంది. ప్రాథమిక విద్యా స్థాయికే పరిమితమై డ్రాపవుట్లు పెరుగుతాయి. కేంద్ర ప్రాయోజిత పథకాలను వినియోగించుకోవటంలోనూ నష్టం జరుగుతుంది. ప్రాథమిక ఉపాధ్యాయులకు ప్రమోషన్ అవకాశాలు వుండవు. ప్రభుత్వ శాఖల్లో అతి పెద్ద శాఖగావున్న పాఠశాల విద్యాశాఖ రెండు ముక్కలైపోయి బలహీనమవుతుంది. మంత్రుల కోసం విద్యాశాఖను విభజించటం అన్యాయం. కనుక పాఠశాల విద్యను విభజించవద్దని ఈ మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నది.

**3. బోధనేతర సిబ్బంది కావాలి** ప్రభుత్వ పాఠశాలలకు బోధనేతర సిబ్బంది లేకపోవటం మరో పెద్ద సమస్యగా వున్నది. హైస్కూల్స్‌లో గుమాస్తా, అటెండర్, లాబ్ అసిస్టెంట్ వంటి వారు లేరు. కనీసం వాచ్‌మెన్ కూడా లేరు. ఇలాంటి పోస్టులు అనేవి చాలా కాలంగా చర్చలో కూడా లేవు. గతం నుండి కొనసాగుతున్న కొద్దిమందిగా వున్న వారికి జీతాలు కూడా సరిగా చెల్లించటం లేదు. దీనితో పాఠశాలల నిర్వహణ అస్తవ్యస్థంగా తయారైంది. కనుక పాఠశాలలకు బోధనేతర సిబ్బందిని నియమించాలి. అన్ని పాఠశాలలకు కనీసం వాచ్‌మెన్‌ని, హైస్కూళ్లకు కావాల్సిన కనీస సిబ్బందిని నియమించినా లక్షమంది నిరుద్యోగ యువతకు ఉద్యోగ అవకాశం లభిస్తుంది. పాఠశాలల నిర్వహణలో ఎంతో మార్పు వస్తుంది.

**4. పర్యవేక్షణా లోపం పాఠశాల విద్యకు శాపం**

ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయులతో సక్రమంగా పని చేయించలేని వైఫల్యం కొనసాగుతూనే వున్నది. ఏడాదికి ఒక్కసారైనా తనిఖీ చేసే విధానం, తరుచుగా పర్యవేక్షణలు జరిపే విధానం కనుమరుగైపోయింది. 760 మండలాల్లో విద్యాశాఖ అధికారులు లేరు. ఉన్న కొద్దిమంది ఎంఇఓలు పాఠశాలల పర్యవేక్షణ కంటే వేరే పనుల్లోనే మునిగిపోతున్నారు. హైస్కూల్స్‌ని పర్యవేక్షించాల్సిన డిప్యూటీ డిఇఓ పోస్టులు 120కిగాను 74 ఖాళీగా వున్నాయి. 16 జిల్లాల్లో డిఇఓలే లేరు. ఇంత భారీ సంఖ్యలో సంవత్సరాల తరబడి విద్యాధికారులు లేకపోవటం వలన పాఠశాల విద్యాపాలన కునారిల్లిపోతోంది. కనుక ప్రభుత్వ పాఠశాలలకు పర్యవేక్షణ, తనిఖీ విధానం పునరుద్ధరించబడాలి. క్షేత్ర స్థాయిలో అధికారుల నియామకాలు జరగాలి. పాఠశాల విద్యాపరిపాలనా సామర్థ్యం పెరగాలి. ఏకీకృత సర్వీస్ రూల్స్ అగమ్యగోచరంగా వున్నందున ప్రత్యామ్నాయ చర్యలతో విద్యాధికారులను నియమించాలి.

**5. విద్యకి బడ్జెట్ పెరగాలి - నిధులు సద్వినియోగం కావాలి**

విద్యారంగానికి ప్రాధాన్యత ఇస్తున్నట్లు బడ్జెట్ ప్రసంగాల్లో ప్రభుత్వాలు గొప్పగా చెబుతున్నాయి. కానీ ప్రతి బడ్జెట్‌లో కేటాయింపులు ఎంతోకొంత పెరిగినా మొత్తం బడ్జెట్‌లో విద్యారంగం వాటా తగ్గిపోతూనే వున్నది. 15 సంవత్సరాల క్రితం రాష్ట్ర బడ్జెట్‌లో విద్యారంగం వాటా 16%గా వుండేది. అది క్రమంగా తగ్గుతూ వచ్చి ఈనాడు 2011-12 వార్షిక బడ్జెట్‌లో 12 శాతానికి పడిపోయింది. అందులో పాఠశాల విద్యకు కేటాయించిన రూ. 14,025 కోట్లు బడ్జెట్‌లో 10.9%గానే ఉంటుంది. గతేడాదికంటే రూ. 1848 కోట్లు అదనంగా కేటాయించినా విద్యాహక్కు చట్టం అమలు కోసం యేటా రూ. 4వేల కోట్లు అదనంగా కావాలనే డిమాండ్‌కి సరిపోయే విధంగా లేదు. సక్సెస్ పథకంతో హైస్కూల్స్ అభివృద్ధి చేయటం వాటిలో ఇంగ్లీషు మీడియం సెక్షన్‌కి అదనపు వసతి, ఉపాధ్యాయులు, పాఠ్య పుస్తకాలు, లైబ్రరీ తదితర అవసరాల కోసం మరో రూ. 2వేల కోట్లు కావాలి. జి.ఓ.3 ప్రకారం కంప్యూటర్ టీచర్లు, విద్యావాలంటీర్లు, సిఆర్‌టిలు తదితర లక్షమంది అసంఘటిత ఉపాధ్యాయులకు పూర్తి జీతాలు చెల్లించటానికి రూ.720 కోట్లు కావాలి. ఈ విధంగా చూస్తే పాఠశాల విద్యాభివృద్ధికి మరింత ఎక్కువ నిధులు కేటాయించాలి. బడ్జెట్‌లో కేటాయించిన నిధుల్లో 20% వరకు ఖర్చు చేయకుండా ప్రభుత్వం మిగుల్చుకుంటుంది. మరో 20% దుర్వినియోగం అవుతుంది. ఇలాంటి లోపాలు, లొసులుగులను అరికట్టి విద్యా నిధులను సద్వినియోగం చేస్తేనే పాఠశాల విద్యలో ప్రగతిని సాధించగలము.

**6. అవినీతి, అక్రమాలు అరికట్టాలి**

విద్యకి బడ్జెట్ కేటాయింపులే చాలినంతగా లేకపోతుంటే అందులో అవినీతి, దుర్వినియోగంతో మరింత నష్టం జరుగుతోంది. స్వచ్ఛంద సంస్థలకు, ప్రైవేట్ సంస్థలకు కోట్లాది రూపాయలు వెచ్చిస్తున్నారు. సకాలంలో ఖర్చు చేయకపోవటంతో పెద్ద ఎత్తున నిధులు దారిమళ్లుతున్నాయి. ఎస్ఎస్ఏలో ఎన్ని కోట్లు అన్యాక్రాంతమవుతున్నాయో ఇటీవలి కుంభకోణాలు తెలియజేస్తున్నాయి. పై స్థాయిలో మంత్రులు, అధికారుల ఖర్చు విపరీతంగా పెరిగి పోతూవుంటే క్షేత్ర స్థాయి అధికారులైన మండల విద్యాశాఖాధికారులకు కనీసం అటెండర్ కూడ లేదు. పాఠ్య పుస్తకాల సరఫరాకి రవాణా చార్జీలు కూడ చెల్లించడం లేదు. ఈ పరిస్థితి మారాలి. విద్యాశాఖ నిధులు వినియోగంపై సరైన నియంత్రణ విధానం వుండాలి. విద్యారంగంలో అవినీతి, అక్రమాలు అరికట్టాలి.

**పాట**

# యుటియఫ్ ఉద్యమ గీతం

– చంద్రకంటి మద్దయ్య

స్లోగన్స్ : జై...యుటియఫ్....జై....జై యుటియఫ్
రండి రండి చూడ రండి యుటియఫ్ మహాసభలు
కర్నూలు నగరమందు ఉపాధ్యాయ సంబరాలు

కోరస్ : వెయ్...చిందెయ్...చిందెయ్...చిందెయ్‌రో...
సై...సై...సై...వెయ్‌రో...సై రో...
వెయ్‌రో....సైరో.... 4 హ్హో...హ్హో...హోయ్య...య్య...

పల్లవి : జై...జై యుటియఫ్...జై.... బోలోరే...
సై...సై... యుటియఫ్ (ఛాలెంజ్ రే)... డోలు బజారే...
చదువులమ్మ ఒడిలోన... విద్యార్థులను తీర్చిదిద్ది...
ఉపాధ్యాయ వృత్తిలోన...ఉన్నత శిఖరాలనెక్కి...
ఉద్యమాల కడలిలోన...ఉప్పెనల్లె...ఉప్పొంగె...

॥జై యుటియఫ్॥

చరణం : 1974లోన ఆగష్టు పదో తేదిన అమలాపుర మందున
....... 2 (రిథమ్)
విశాలాంధ్ర...ఉపాధ్యాయు/లందరి నొకటిగ..జేసి....2
ఉద్యమాలె...నిర్మించగ...విజయాలె సాధించగ...2
సింగమంటి చెన్నుపాటి...జ్ఞాపకంగ...వెలసినట్టి
ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ...ఫెడరేషన్...
అప్పారి...మైనేని....నాదేళ్ల...వత్సవాయి...
దాచూరి...పోలిశెట్టి...కదలి...గంగిశెట్టి...మేధావులంత
స్నేహానికి...చిహ్నంగా...చేయి చేయి కలిపినారు...
యుటియఫ్...స్థాపించి...ఉద్యమాలె... నడిపినారు....

చర 2 : అధ్యయనం....అధ్యాపనం... సామాజిక స్పృహాలంట...2
హక్కులు, బాధ్యతలు.../యుటియఫ్ నేత్రాలంట...2
అవినీతికి వ్యతిరేకం.../యుటియఫ్ సిద్ధాంతం...2
ఉపాధ్యాయ సంక్షేమం.../విద్యలోన విప్లవం...2

హక్కులకై...నినదించగా –ప్రభుత్వాల మెడలొంచగా....
ఎన్నాళ్లో.... అహర్నిశల ఉద్యమాలు
సమసమాజ స్థాపనకై...యుటియఫ్ శ్రమించగా...
ఎర్రజెండ ఎగురుతోంది...అందరి గుండెల నిండుగా...
గురువర్యుల...జీవితాల – చిరునవ్వుల ....వెన్నెలలు నిండగ హ్హో...
యుటియఫ్ పిలుపు ... ఉపాధ్యాయులకు మేలుకొలుపు...
చదువుల సామ్రాజ్యంలో – సరికొత్త పొద్దుపొడుపు....2
నాడైనా...నేడైనా...రేపైనా...ఎప్పుడైన.....
ఎదురులేని...బెదురులేని...తిరుగులేని... అలుపులేని యుటియఫ్
ఉద్యమాల సారథిగా...కదం త్రొక్కుతున్నదిరా....
విజయాల వారధిగా...వెలుగుతున్న...దివిటీరా...

॥జైజై యుటియఫ్॥




# రాష్ట్ర మహాసభల విజయవంతానికి ఆహ్వాన సంఘం కృషి



**కె. సురేష్ కుమార్**
ప్రధానకార్యదర్శి ఆహ్వాన సంఘం & యుటియఫ్ కర్నూలు జిల్లా

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 12వ రాష్ట్ర మహాసభలు 2011 మే 9,10,11 తేదీలలో కర్నూలు నగరంలో అత్యంత వైభవంగా జరిగాయి. ఈ మహాసభలు విజయవంత మయ్యేందుకు ఆహ్వాన సంఘం శక్తికి మించి కృషిచేసింది.

09.06.2010న విజయవాడలో జరిగిన రాష్ట్ర కార్యవర్గం ఈ మహాసభలు 2010 డిసెంబర్ 9,10,11 తేదీలలో కర్నూలు నగరంలో నిర్వహించాలని, దీనికి కర్నూలు జిల్లా శాఖ ఆతిథ్యమివ్వాలని ప్రతిపాదించింది. ఈ పని కర్నూలు జిల్లా ఉద్యమానికి తలకుమించిన భారమే అయినా వివిధ కారణాల వల్ల రాయలసీమలో తొలిసారిగా కర్నూలు నగరంలో నిర్వహించాలని రాష్ట్రకమిటీ ప్రతిపాదించినందున, నిర్ణయించటంతో జూన్ 27న జరిగిన కర్నూలు జిల్లా కార్యవర్గం మహాసభల నిర్వహణకు సంసిద్ధతను తెలియజేసింది. తదనుగుణంగా జులై 25న కర్నూలులో ఆహ్వాన సంఘం ఏర్పాటు సమావేశం నిర్వహించింది. దీనికి రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ, ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు, గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, సహాధ్యక్షులు పి. బాబురెడ్డి, 'ఐక్య ఉపాధ్యాయ' ప్రధాన సంపాదకులు చావ రవి, రాష్ట్ర కార్యదర్శులు సి.కె. నాగేంద్ర బాబు, ఎన్. కిష్టయ్యలతోపాటు జిల్లాలోని సీనియర్ నాయకులు, కార్యకర్తలు హాజరయ్యారు. రాష్ట్ర నాయకులు మాట్లాడుతూ జిల్లాలోని కార్యకర్తలందరికీ మహాసభల నిర్వహణకు తగిన చైతన్యం, ఉత్సాహం కల్గించారు. ఆ ఉత్సాహంతో అప్పటికప్పుడు కార్యకర్తలు దాదాపు 3 లక్షల రూపాయలను మహాసభల విరాళాలుగా ప్రకటించారు. యుటియఫ్ జిల్లా పూర్వ ప్రధానకార్యదర్శి రవీంద్ర విద్యాసంస్థల డైరెక్టర్ జి. పుల్లయ్య చైర్మన్‌గా, కె. సురేష్‌కుమార్ ప్రధాన కార్యదర్శిగా, బి. మాణిక్యంశెట్టి కోశాధికారిగా, కర్నూలు మాజీ శాసన సభ్యులు ఎం.ఏ. గఫూర్, జిల్లా జెఏసి చైర్మన్ వి.సి.హెచ్. వెంగళరెడ్డి, యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఎన్. నరసింహుడు, సీనియర్ నాయకులు ఏ. చెన్నకేశవరెడ్డి, జి.సి.లక్ష్మిరెడ్డిలు కో-చైర్మన్‌లుగా, నగరంలోని ప్రముఖ వైద్యులు, విద్యావేత్తలు, విద్యాశాఖాధికారులు, గౌరవ సలహాదారులుగా, వివిధ ప్రజా సంఘాల నాయకులు, శ్రేయోభిలాషులు వైస్-చైర్మన్‌లుగా, జిల్లా ఆఫీస్‌బేరర్లు, సీనియర్ నాయకులు కార్యదర్శులుగా మరియు అన్ని మండల/పట్టణ శాఖల ప్రధాన బాధ్యులు కార్యవర్గ సభ్యులుగా యుటియఫ్ 12వ రాష్ట్ర మహాసభల ఆహ్వాన సంఘం ఏర్పాటైంది.

ప్రచార సామాగ్రి సిద్ధం చేసుకొని 2010 ఆగస్ట్ నెల నుండి ఆహ్వాన సంఘం తన పని మొదలు పెట్టింది. ఒకవైపు నిధి వసూళ్ళు, మరో వైపు మహాసభల వేదికలు, మైదానాలు, వసతి కోసం కళ్యాణ మండపాలు రిజర్వ్ చేయడం వంటి పనులు సాగుతున్న తరుణంలో శాసనమండలి ఎన్నికల ప్రకటన రావడం, కర్నూలు-కడప-అనంతపురం ఉపాధ్యాయ మరియు గ్రాడ్యుయేట్ నియోజకవర్గాలు రెండింటిలోనూ మనం బలపరిచే అభ్యర్థులు పోటీలో ఉండటం వల్ల 2011 మార్చి 15న వరకు మహాసభలకు సంబంధించిన పని మొత్తాన్ని ప్రక్కన పెట్టవలసి వచ్చింది. మహాసభల పని నిమిత్తం అప్పుడప్పుడే కర్నూలుకు వచ్చిన రాష్ట్ర కార్యదర్శి చావా రవి మార్గ నిర్దేశకత్వంలో నాలుగున్నర మాసాలపాటు ఎమ్మెల్సీ ఎన్నికల పని పూర్తి చేసి పట్టభద్రుల నియోజకవర్గ ఎమ్మెల్సీ ఎన్నికల్లో విజయం సాధించాము.

ఆ తర్వాత మార్చి 20న జరిగిన రాష్ట్ర కార్యవర్గం తిరిగి మహాసభలను 2011 మే 9,10,11 తేదీలలో నిర్వహించాలని నిర్ణయించటంతో కర్నూలులో మార్చి 27న జిల్లా కార్యవర్గ సమావేశం నిర్వహించాము. మహాసభల కర్తవ్యంపై ఈ సమావేశానికి రాష్ట్ర నాయకులు ఎన్.నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు, చావ రవి హాజరై కార్యకర్తలకు తిరిగి ఉత్సాహం నింపడంతో ఏప్రిల్ 6న కర్నూలులో ఆహ్వాన సంఘ సమావేశం జరిపి మహాసభల ఏర్పాట్లను ముమ్మరం చేశాము. ఈ సమావేశంలోనే మహాసభలను విజయవంతంగా నిర్వహించేందుకు ఒక్కో జిల్లా ఆఫీస్ బేరర్ ఒక్కో కమిటీకి కన్వీనర్‌గా యుటియఫ్ ముఖ్య కార్యకర్తలూ, వివిధ ప్రజా సంఘాల బాధ్యులను కలిపి 12 సబ్ కమిటీలు ఏర్పాటు చేయడం జరిగింది. ఆ తర్వాత చావ రవి మహాసభలు పూర్తయ్యేవరకు కర్నూలులోనే మకాం వేసి కార్యకర్తలను గైడ్ చేయడంతోపాటు, స్వయంగా ఏర్పాట్లు నిర్వహణలో భాగస్వామ్యం వహించారు.

**నిధి వసూళ్ళు:** ఆహ్వాన సంఘం ఏర్పాటైన నాటి నుండి జిల్లా అధ్యక్షులు ఎన్. నరసింహుడు, ప్రధానకార్యదర్శి కె. సురేష్‌కుమార్, సహాధ్యక్షులు డి. రామశేష్యులు టీములుగా జిల్లా వ్యాప్తంగా ఉపాధ్యాయుల వద్ద

వెళ్ళి మహాసభల ప్రాధాన్యతను వివరించి ఆర్థిక సహకారాన్ని కోరారు. జిల్లా ఆఫీస్‌బేరర్లు, మండల శాఖల బాధ్యులు కూడా వారి పరిధిలో వారు నిధి వసూళ్ళలో పాల్గొన్నారు. యుటియఫ్ ప్రతిష్టకనుగుణంగా ఉపాధ్యాయుల చైతన్య స్థాయిని బట్టి సంఘాలకతీతంగా ఉపాధ్యాయు లందరూ రూ. 500/- నుండి రూ. 10,000/- వరకు హామీలిచ్చి ఆదరించారు. ఆ విధంగా దాదాపు 18 లక్షల రూపాయలు ఉపాధ్యాయుల ద్వారా వ్రాయించగలిగారు. అయితే, వసూళ్ళు చేయటానికి ఎమ్మెల్సీ ఎన్నికలు ఆటంకమయ్యాయి. అందువల్ల కేవలం 10 లక్షల 43వేల రూపాయలు మాత్రమే వసూలు చేయగలిగాము. వీటితో మహాసభల నిర్వహణ సాధ్యం కాదు గనుక, ఈ పరిస్థితిని అధిగమించేందుకు చివరి దశలో కొంతమంది విద్యా సంస్థల అధిపతులు, విద్యారంగ శ్రేయోభిలాషుల వద్దకు వెళ్ళి ఆర్థిక సహకారాన్ని కోరగా వారి నుండి మూడు లక్షల రూపాయలు వచ్చాయి. ఈ నిధి వసూళ్ళ కార్యక్రమంలో ప్రధానోపాధ్యాయుల సంఘం నాయకులు జె. రామచంద్రుడు, సుబ్బరాయుడు, పి. సుభాన్‌లతోపాటు రాష్ట్ర నాయకులు ఐ. వెంకటేశ్వర రావు, చావ రవి మరియు ఎన్. కిష్టయ్యలు సహకరించారు. పోస్టర్లు, ఆహ్వానాలు, తోరణాలు, తదితర రూపాలలో రాష్ట్ర కమిటీ దాదాపు లక్షన్నర రూపాయలు ఆర్థిక సహకారాన్ని అందించింది.

**వసతి ఏర్పాట్లు:** మహాసభలకు వివిధ జిల్లాల నుండి వచ్చిన ప్రతినిధులు, అతిథులు, ఉపాధ్యాయులందరికీ వసతి ఏర్పాట్లు చేయడం ఖర్చుతో కూడుకున్నపని. అయితే వేసవి సెలవులు అయినందున మన పని కాస్త సులువు అయింది. మహాసభల ప్రాంగణం మరియు మహిళా ప్రతినిధులతో సహా ప్రతినిధులు, ఉపాధ్యాయులందరికీ ఒకే చోట సౌకర్యవంతమైన వసతి దొరకడం ఈ మహాసభల ప్రత్యేకత. అందుకొరకు కలెక్టరేట్‌తోసహా అన్ని కార్యాలయాలు మరియు మీడియా సెంటర్‌కు సమీపంలో ఉన్న మాంటిస్సోరి హైస్కూల్‌ను మనకు ఆ పాఠశాల యాజమాన్యం ఉచితంగానే ఇచ్చారు. అదనంగా వచ్చిన ఉపాధ్యాయుల వసతి కొరకు ఆ యాజమాన్యం వారిదే నగర శివారులోని ఇండస్ స్కూల్‌ను కేటాయించారు. అక్కడ ఉన్నంత వరకు అందరికీ ప్యూరిఫైడ్ వాటర్ ఇచ్చారు. అంతమంచి మహాసభల ప్రాంగణం, వేదిక మరియు వసతిని ఇచ్చిన పాఠశాల కరస్పాండెంట్ శ్రీమతి పి. కళ్యాణమ్మ డైరెక్టర్ కె. రాజశేఖర్‌గార్లకు కృతజ్ఞతలు.

తనవంతుగా ఆర్థిక సహకారాన్నందించటంతోపాటు వివిధ జిల్లాల నుండి వచ్చి రైల్వేస్టేషన్‌లోనే లేక బస్‌స్టేషన్‌లోనో దిగిన ఉపాధ్యాయుల ను వారి అకామిడేషన్ వద్దకు చేరవేసేందుకు ఆహ్వాన సంఘ చైర్మన్, రవీంద్ర విద్యా సంస్థల డైరెక్టర్ జి. పుల్లయ్య బస్సులను ఏర్పాటు చేశారు.

**నగరంలో అలంకరణ :** మహాసభలకు 10 రోజుల ముందునుండే జిల్లా మొత్తం వాల్‌పోస్టర్లు, స్టిక్కర్లు అంటించడమేగాక, కర్నూలు నగరంలో వాల్‌రైటింగ్స్, ఫ్లెక్సీ బ్యానర్లతో ప్రచారం జరిగింది. రెండు రోజుల ముందు నుండి వివిధ కూడళ్ళలో తోరణాలు, స్వాగత ఆర్చీలు ఏర్పాటు చేయడం వల్ల నగరమంతా ఎరుపురంగు పులుపుకొని యుటియఫ్ మయమైంది. ఇదంతా వివిధ ప్రజాసంఘాల సహకారంతోనే సాధ్యమైంది.

**సునయన ఆడిటోరియం :** ప్రతినిధుల సభకు వేదికగా కలెక్టరేట్‌లోని సునయన ఎ/సి ఆడిటోరియంను ముందే అనుమతిపొంది ఉన్నప్పటికీ చివరి క్షణంలో అనుమతి నిరాకరించారు. అప్పుడు రాష్ట్ర నాయకులు కలెక్టర్‌ను కలవటంతో తిరిగి అనుమతించారు. దీనికి సహకరించిన కర్నూలు మాజీ శాసన సభ్యులు కా॥ ఎం.ఏ. గఫూర్‌గారికి కృతజ్ఞతలు.

**భోజన వసతి :** మొదటి రోజు ఆరువేలమంది ఉపాధ్యాయులు, తదుపరి రెండు రోజులు ఆరు వందలు ప్రతినిధులు, అతిథులకు భోజన ఏర్పాటు జరిగింది. భోజనాల వద్ద ఇబ్బందిపడిన సందర్భాలు లేవు. ప్రతిపూటా ఒక కొత్త వంటకం రాయలసీమ రుచులను (భక్ష్యాలు, రాగిముద్ద, ఉగ్గాని-బజ్జి, చికెన్, ఫిష్ మొ॥) వడించడం జరిగింది. వీటికి తోడు ప్యాపిలి మండలశాఖ నుండి వచ్చిన బొప్పాయి పళ్ళు, అనంతపురం జిల్లా శాఖ వారు ఇచ్చిన 'ఓళిగ'లు మరియు కడప జిల్లా శాఖ వారు ఇచ్చిన సపోటా పళ్ళు ప్రతినిధులకు అదనపు రుచినిచ్చాయి. అయితే, వీటన్నింటినీ వండించి, వడించడంలో వాలంటీర్లుగా పనిచేసిన వివిధ ప్రజా సంఘాల నాయకులు, కార్యకర్తల కృషి అమోఘము, అనిర్వచనీయము. వారికి కృతజ్ఞతలు.

**వివిధ ప్రజాసంఘాల సహకారం :** ఈ మహాసభలు ఆద్యంతం వివిధ ప్రజా సంఘాల నాయకులు మరియు కార్యకర్తలు విలువైన సహకారాన్ని అందించారు. సి.ఐ.టి.యు. నాయకులు బి. రామాంజ నేయులు, ఐద్వా నాయకులు పి. నిర్మల, మెడికల్ రెప్స్ నాయకులు వెంకట్, చేతివృత్తిదారుల సమన్వయ సంఘం నాయకులు జె.ఎన్. శేషయ్య, ఎస్‌డబ్ల్యుఎఫ్ నాయకులు జె. దివాకర్, జె.వి.వి. నాయకులు కె. బడేసాహెచ్, సాహితీస్రవంతి నాయకులు జె. రఘుబాబు, ఎస్.ఎఫ్.ఐ. నాయకులు నరసింహ, కె.వి.పి.ఎస్. నాయకులు ఎం.డి. ఆనంద్‌బాబు, 'ఐలు' నాయకులు కె. కుమార్, పి.ఎన్.ఎం. నాయకులు ఆర్.ఏ.వాసు నాయకత్వంలో పలువురు కార్యకర్తలు వాలంటీర్లుగా పనిచేసి మహాసభల విజయవంతానికి ఎనలేని కృషి చేశారు.

**ప్రెస్ / మీడియా సహకారం :** మహాసభల ఆహ్వాన సంఘం ఏర్పాటైనప్పటి నుండి మహాసభలు ముగిసేంతవరకు ఎలక్ట్రానిక్ మరియు ప్రింట్ మీడియా అందించిన సహకారం అత్యంత విలువైనది. ప్రతి సందర్భంలోనూ తగినంత ప్రాధాన్యతనిస్తూ వార్తలు వ్రాశారు. మహాసభ జరిగినన్ని రోజులు పతాక శీర్షికల్లోనూ, మెయిన్ ఎడిషన్‌లోనూ మన వార్తలు వ్రాశారు. టెలికాస్ట్ చేశారు. ఇక 'ప్రజాశక్తి'లోనైతే ప్రత్యేక అనుబంధాన్ని ఇచ్చారు. అందరికీ ధన్యవాదములు.

మహాసభలు విజయవంతంగా నిర్వహించుకోవడంలో జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులతోపాటు పలువురు జిల్లా కార్యదర్శివర్గ సభ్యులు తమ పూర్తి సమయాన్ని సంఘం కోసం కెటాయించి, అప్పగించిన బాధ్యతలను చిత్తశుద్ధితో నెరవేర్చారు.

రాష్ట్ర మహాసభలు విజయవంతంగా నిర్వహించడంతో జిల్లాలో యుటియఫ్ ప్రతిష్ట ఎంగానో ఇనుమడించింది. ఈ స్థాయిలో మహాసభలు నిర్వహించడం యుటియఫ్‌కు మాత్రమే సాధ్యం అని పలువురు సోదర సంఘాల కార్యకర్తలు బహిరంగంగా వ్యాఖ్యానించటమే ఇందుకు నిదర్శనం. మహాసభల నిర్వహణ కోసం శారీరకంగానూ, ఆర్థికంగానూ శ్రమించిన కార్యకర్తలకు, ఆర్థిక సహకారాన్నందించి ప్రోత్సహించిన అభిమానులు, దాతలందరికీ పేరుపేరునా ఆహ్వాన సంఘం పక్షాన కృతజ్ఞతాభివందనాలు...

# అప్రయత్న పదోన్నతి పథకం - నూతన నిబంధనలు



ఎన్. కుమార్‌రాజా
గుంటూరు జిల్లా

ఉద్యోగుల,ఉపాధ్యాయుల, కార్మికుల ఐక్య కార్యాచరణ సమితి (జెఏసి)తో ది. 23.01.2011న ప్రభుత్వం కుదుర్చుకున్న ఒప్పందం మేరకు 2010 నూతన వేతన స్కేళ్ళలో అప్రయత్న పదోన్నతి పథకానికి సవరణలు చేస్తూ రాష్ట్ర ప్రభుత్వం జి.ఓ.ఎం.నం.96, తేది. 20.05.2011ను విడుదల చేసింది. ఈ ఉత్తర్వులలో పేర్కొన్న నూతన నిబంధనలు గురించి తెలుసుకుందాము.

అప్రయత్న పదోన్నతి పథకం క్రింద ప్రస్తుతం అమలులో ఉన్న 8/16/24 సంవత్సరాల స్కేళ్ళు ఇకపై రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు ఉపాధ్యాయులు, ఎయిడెడ్ మరియు స్థానిక సంస్థలు బోధన మరియు బోధనేతర సిబ్బంది అందరికీ 6/12/18/24 సంవత్సరాలకు వర్తింపు అవుతాయి.

ఇకపై 6/12/18/24 సంవత్సరాలకు ఇచ్చే పదోన్నతి స్కేళ్ళు వరుసగా స్పెషల్ గ్రేడ్ పోస్టు స్కేలు, SPPS-IA/SAPPS-IA, SPPS-IB/ SAPPS-IB, SPPS-II/SAPPS-IIగా ఉంటాయి. గ్రేడ్-I నుండి XXV వరకు వేతన స్కేళ్ళులో గల అనగా రు. 25,600-50,560 వేతన స్కేలు వరకు వేతనం పొందే వారికి అందరికి అప్రయత్న పదోన్నతి పథకం వర్తిస్తుంది.

అప్రయత్న పదోన్నతి పథకంలో 6/12/24 సంవత్సరాల స్కేళ్ళు అనగా SG, SPPS-IA/SAPPS-IA, SAPS-II/ SAPPS-IIలలో FR 22 (a)(i) మరియు FR 31(2) ప్రకారం వేతన స్థిరీకరణ చేస్తారు.

18 సంవత్సరాలకు అనగా SPPS-IB/SAPPS-IB మాత్రం 12 సంవత్సరాల స్కేలులోనే ఒక ఇంక్రిమెంట్ మంజూరు చేస్తారు.

6/12/18 సంవత్సరాల స్కేళ్ళు తీసుకుంటూ రెగ్యులర్ ప్రమోషన్ పొందిన వారికిFR 22 B ప్రకారం వేతన స్థిరీకరణ చేస్తారు. 24 సం॥ల స్కేలు తీసుకొని రెగ్యులర్ ప్రమోషన్ పొందిన వారికి మాత్రం FR 22 (a)(i) మరియు FR 31(2) ప్రకారం వేతన స్థిరీకరణ చేస్తారు.

సర్వీసు నిబంధనల ప్రకారం రెగ్యులర్ పదోన్నతులకు వర్తించే అర్హతలే అప్రయత్న పదోన్నతులకూ వర్తింప చేస్తారు.

దిగువ క్యాడర్‌లో SPP-II స్కేలు తీసుకొని పై క్యాడర్‌కు పదోన్నతి పొందిన సందర్భంలో వారికి అప్రయత్న పదోన్నతి పథకం ఇకపై వర్తించదు.

ఈ ఉత్తర్వులు ది. 01.02.2010 నుండి అమలులోకి వస్తాయి. ఈ నూతన నిబంధనల ద్వారా వచ్చు వేతన స్థిరీకరణ బకాయిలు 01.02.2010 నుండి ది. 31.05.2011 వరకు ఉద్యోగి, ఉపాధ్యాయుల ప్రావిడెంట్ ఫండ్ ఖాతాకు జమచేస్తారు. ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలేని వారి బకాయిలు కంపల్సరీ సేవింగ్స్ ఫండ్ (CPS) ఖాతాకు జమ చేస్తారు.

పదోన్నతులకు జాప్యం జరుగుతున్న ఈ కాలంలో, సుదీర్ఘ పోరాటాల ఫలితంగా విడుదల అయిన ఈ ఉత్తర్వులు ఉపాధ్యాయులకు ప్రయోజనం కలిగించే విధంగా ఉన్నాయి.

### ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కేళ్ళ పట్టిక

| కేటగిరి ఆర్డినరి | 6 సం॥లు SG | 12 సం॥లు& 18 సం॥లు SPPIA&IB SAPPIA &IB | 24 సం॥లు SPP-II SAPP-II |
|---|---|---|---|
| I | 19050-45850 | 19050-45850 | 21820-48160 |
| | | | 20680-46960 |
| II | 15280-40510 | 18030-43630 | 18030-43630 |
| | | 16150-42590 | 18030-43630 |
| III | 11530-33200 | 14860-39540 | 18030-43630 |
| | | 11860-34050 | 15280-40510 |

## శభాష్ కర్నూలు...

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 12వ రాష్ట్ర మహాసభలకు ఆతిథ్యమిచ్చి విజయవంతం గావడానికి సహకరించిన కర్నూలు జిల్లాశాఖను యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గం ప్రత్యేకంగా అభినందించింది.

మే 31న హైదరాబాద్ చెన్నుపాటిభవన్‌లో ఎన్.నారాయణ అధ్యక్షతన నిర్వహించిన రాష్ట్రకార్యవర్గ సమావేశంలో కర్నూలు జిల్లాశాఖను. ఆహ్వాన సంఘాన్ని అభినందిస్తూ తీర్మానాన్ని ఆమోదించారు. ఇటీవలికాలంలో వేగంగా అభివృద్ధి చెందుతున్న కర్నూలు జిల్లా ఉద్యమానికి మానవ వనరులు,ఆర్థిక వనరులు పరిమితంగానే ఉన్నప్పటికీ రాయలసీమ ప్రాంతంలో రాష్ట్ర మహాసభలు నిర్వహించాలన్న రాష్ట్ర కమిటీ ప్రతిపాదనను సవాలుగా స్వీకరించి కార్యకర్తలు పట్టుదలగా శ్రమించి మహాసభలను విజయవంతం గావించారు. ప్రతినిధులకు ఏలోటూ రాకుండా ఆహ్వాన సంఘం కల్పించిన వసతి, భోజన సౌకర్యాలు, సభా నిర్వహణా వేదికల పట్ల రాష్ట్ర కార్యవర్గం సంతృప్తిని వ్యక్తం చేసింది. జిల్లా యుటియఫ్ కార్యకర్తలు, ప్రజాసంఘాల కార్యకర్తలు మహాసభల కోసం స్వచ్ఛందంగా శ్రమించిన తీరును ప్రత్యేకంగా ప్రశంశించింది. ప్రెస్, మీడియా కవరేజి పట్ల పూర్తి సంతృప్తిని వ్యక్తం చేసింది.

రాష్ట్ర మహాసభల విజయం స్ఫూర్తి జిల్లా ఉద్యమ విస్తరణను మరింత వేగవంతం చేస్తుందని ఆశాభావాన్ని రాష్ట్ర కమిటీ వ్యక్తం చేసింది. నిర్దిష్టమైన ప్రణాళికతో జిల్లా నిర్మాణాన్ని పటిష్ట పరచుకుంటూ విద్య, ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి రెట్టించిన ఉత్సాహంతో కృషి చేయాలని సూచించింది.

# ప్రశ్నోత్తరాలు




నిర్వహణ : సిహెచ్. రవి, ప్రధానసంపాదకులు
mail : ikyopadhyaya@gmail.com


ప్రశ్న : **01.11.1996న నియామకమైన ఎస్‌జిటి ఉపాధ్యాయుడు 01.11.2008 నాటికి 12 సం॥ల సర్వీసు పూర్తి చేస్తున్నందున కొత్త ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము ప్రకారం 12 సం॥ల స్కేలు ఎప్పటి నుండి మంజూరు చేస్తారు?**

**- డి. శ్రీనివాస్,** పాల్వంచ, ఖమ్మం

జవాబు : నూతన ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము ఉత్తర్వులు జి.ఓ.నం. 96 ఆర్థిక, తేది. 20.05.2011 ప్రకారం 6/12/18/24 సం॥ల స్కేళ్ళు 01.02.2010 నుండి అమలులోనికి వచ్చాయి కనుక 1.11.1996న నియామకమైన ఉపాధ్యాయునికి 01.11.2008 నాటికి 12 సం॥లు పూర్తయినప్పటికీ, 01.02.2010 నుండి (ఎస్‌జిటి పోస్టులోనే కొనసాగుతున్న యెడల) మాత్రమే 12 సం॥ల స్కేలు ఎస్‌పిపి-1(ఎ) మంజూరు చేస్తారు.

ప్రశ్న : **నేను 1996 డిఎస్‌సి ద్వారా ఎస్‌జిటిగా ఎంపికై 2002 నవంబర్‌లో ఎస్ఏగా ప్రమోషన్ పొందాను. 31.10.2008 నాటికే 6 సం॥ల సర్వీసు పూర్తయింది. నాకు కొత్త ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము ఎప్పటి నుండి అమలు చేస్తారు? దాని వల్ల ప్రయోజనం ఉంటుందా? ది. 01.11.2010 నుండి 8 సం॥ల స్కేలు తీసుకున్నాను.**

**- పి.వి.వి.ఎస్.ఎస్. శ్రీనివాస్,** తణుకు, ప॥గో॥

జవాబు : ఉంటుంది. జి.ఓ. 96 ఆర్థిక, తేది. 20.05.2011 ప్రకారం 01.02.2010 నుండి 6/12/18/24 సం॥ ప్రమోషన్ స్కేళ్ళ అమలులో కొచ్చినందున మీకు 01.02.2010 నుండి 6 సం॥ల స్పెషల్ గ్రేడ్ స్కేలు మంజూరు చేస్తారు. మీరు 01.11.2010 నుండి స్పెషల్ గ్రేడ్ స్కేలు పొంది వున్నందున, 01.02.2010 నుండి 31.10. 2010 వరకు వచ్చే బకాయిలను పిఎఫ్ ఖాతాలకు జమ చేస్తారు. 2014 నవంబర్ వరకు ఎస్ఏ క్యాడర్‌లోనే కొనసాగితే అప్పుడు ఎస్‌పిపి-1 స్కేలు మంజూరు చేస్తారు.

ప్రశ్న : **నేను 15.06.1995 నుండి ఎస్‌జిటిగా పనిచేస్తూ 31.01. 2009న ఎస్ఏ ప్రమోషన్ పొందాను. ఎస్‌జిటిగా $13^1/_2$ సం॥ల సర్వీసు పూర్తి చేసినందున, కొత్త ఏ.ఏ. స్కీము ప్రకారము ఎస్‌జిటిలో 12 సం॥ల స్కేలు పొందే అవకాశం ఉంటుందా?**

**- జి. చంద్రశేఖర్,** కర్నూలు

జవాబు : లేదు. కొత్త ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము 01.02. 2010 నుండి అమలులోనికి వచ్చింది. కనుక ఆనాటికి ఒకే క్యాడర్‌లో 6/12/18/14 సం॥లు లేదా అంతకుపై బడిన సర్వీసు పూర్తి చేసిన వారికి 01.02.2010 నుండి, ఆ తేదీ తర్వాత పూర్తయిన వారికి పూర్తయిన తేదీ నుండి జి.ఓ. 96 ఆర్థిక, తేది. 20.05.2011 ప్రకారం SG; SPPIA/SAPPIA; SPP-IB/SAPP-IB; SPP-II/ SAPP-II స్కేళ్ళు మంజూరు చేస్తారు. మీరు 01.02.2010 నాటికి ఎస్‌జిటి క్యాడర్‌లో లేరు కనుక మీకు ఎస్‌జిటిలో SPP-IA స్కేలు వచ్చే అవకాశం లేదు.

ప్రశ్న : **నేను అక్టోబర్ 98 నుండి ఎస్‌జిటిగా పని చేస్తున్నాను. 2010 అక్టోబర్ నాటికి 12 సం॥లు సర్వీసు పూర్తయింది. అప్పుడు నా వేతనం రు. 14440. 12 సం॥ల స్కేలు మంజూరు తర్వాత నా వేతనం ఎంత వుంటుంది? ఇంక్రిమెంటు నెల అక్టోబరు కొనసాగుతుందా?**

**- రవికుమార్,** మంచిర్యాల, ఆదిలాబాద్.

జవాబు : అక్టోబర్ 2010లో మీకు 12 సం॥ల సర్వీసు పూర్తి అయిన తేదీ నాడు SPP-I(A) స్కేలు 14,860-39,540 నందు FR 22a (i) ప్రకారం రు. 14,860గా మీ వేతనం నిర్ణయించబడుతుంది. FR 31(2) ప్రకారం ఇంక్రిమెంటు నెల అక్టోబర్ కొనసాగుతుంది.

ప్రశ్న : **నేను స్పెషల్ విద్యావాలంటీర్‌గా 2003 మార్చి 3న నియామకమై 07.05.2005 నాడు డిఇడి శిక్షణ పూర్తి చేసుకొని 16 నవంబర్ 2005 నాడు ఎస్‌జిటి స్కేలు పొందాను. నాకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఎప్పటి నుండి లభిస్తాయి?**

**- పి. సుధాకర్,** మెదక్

జవాబు : జి.ఓ.నం. 69, తేది. 27.05.2011 ప్రకారం మీరు ఎస్‌జిటి స్కేలు పొందిన (16.11.2005) నాడు రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు వేతనంలో కలుపుతారు. తదుపరి కాలానుగుణంగా వేతనాన్ని నోషనల్‌గా స్థిరీకరించి 01.02.2011 నుండి పెరిగిన వేతనాన్ని చెల్లిస్తారు.

ప్రశ్న : **నేను వ్యక్తిగత కారణాలతో జీత నష్టం సెలవు దరఖాస్తు చేశాను. అనంతరం అనారోగ్యానికి గురవడం చేత 53 రోజుల అనంతరం వైద్య ధృవ పత్రాలను సమర్పించి విధులలో చేరాను. ఈ సెలవును వ్యక్తిగత సెలవుగా పరిగణిస్తారా? వైద్య కారణాలపై ఇ.ఓ.ఎల్‌గా పరిగణిస్తారా?**

**- యు. శివలక్ష్మి,** కె. పల్లెకోన, గుంటూరు జిల్లా

జవాబు : మొదట వ్యక్తిగత కారణాలతో సెలవుకు దరఖాస్తు చేసిన నాటి నుండి అనారోగ్యానికి గురైన నాటి వరకు వ్యక్తిగత కారణాలతో జీత నష్టపు సెలవుగాను, అనారోగ్యానికి గురైన నాటి నుండి విధులలో చేరే వరకు వైద్య ధృవ పత్రం ఆధారంగా అనారోగ్య కారణాలపై జీత నష్టపు సెలవుగాను పరిగణిస్తారు.

ప్రశ్న : **నా వార్షిక ఇంక్రిమెంటు తేదీ ఏప్రిల్ 5, నా రిటైర్మెంట్ తేదీ. 19.03.2012. నేను 05.04.2012 నాటి ఇంక్రిమెంటుకు అర్హురాలినేనా? అర్హత వుంటే ఎవరు మంజూరు చేయాలి?**

**- బి. ఉదయలక్ష్మి,** శంభుని పేట,..........

జవాబు : జి.ఓ. 133 ఆర్థిక, తేది. 13.05.1974 (అ.ద. 2, పే 10) ప్రకారం మీ వార్షిక ఇంక్రిమెంటు నెలలో ఏ తేదీన ఉన్నా 1వ తేదీగానే పరిగణించాలి. అదే విధంగా మీ రిటైర్మెంట్ తేదీ. 19.03.2012 ఐనప్పటికీ మీరు 31.03. 2012 వరకు సర్వీసులోనే కొనసాగుతారు. కనుక జి.ఓ.నం.

235 ఆర్థిక, తేది. 27.10.1998 (అ.ద.16, పేజి 243) ప్రకారం మీకు ఏప్రిల్ నెలలోగల ఇంక్రిమెంటు పెన్షన్ ప్రయోజనాల కోసం నోషనల్‌గా పొందేందుకు అర్హత ఉన్నది. మీ డిడిఓనే మంజూరు చేయాల్సి వుంటుంది.

ప్రశ్న : నేను మండల పరిషత్ పాఠశాలలో ఎస్‌జిటిగా పనిచేస్తూ ఏపిపిఎస్‌సి గ్రూప్-2 పోస్టుకు ఎంపికైనందున 2010 సెప్టెంబరులో డిఇఓ అనుమతితో విడుదలై ఆ పోస్టులో చేరాను. ఎస్‌జిటిలో వేతనం ప్రస్తుత పోస్టు వేతనంకంటే ఎక్కువగా ఉన్నది. నా పాత వేతనానికి రక్షణ ఉంటుందా? నేను ఉపాధ్యాయునిగా పొందిన సంపాధిత సెలవులు ఇప్పుడు వినియోగించుకోవచ్చునా?

– వి. శ్రీనివాసరావు, హైదరాబాద్

– జి. బభ్రువాహన, రాజమండ్రి, తూ॥గో

జవాబు : (i) జి.ఓ. 105 ఆర్థిక, తేది. 02.06.2011 ప్రకారం ఉపాధ్యాయునిగా మీరు పొందిన వేతనానికి రక్షణ ఉంటుంది. FR 22 (a) (iv) ప్రకారం మీ వేతనాన్ని కొత్త పోస్టులో స్థిరీకరిస్తారు.

(ii) మీరు ఉపాధ్యాయునిగా పొందిన సంపాదిత సెలవు, అర్థ వేతన సెలవులను ప్రస్తుత పోస్టులో వినియోగించు కోవచ్చును.

ప్రశ్న : నేను 30.06.2011న రిటైర్ అవుతున్నాను. నా ఖాతాలో నిల్వవున్న ఎరండ్ లీవు, అర్థజీతపు సెలవులను పెన్షన్ ప్రతిపాదనలు ఏ.జి. కార్యాలయానికి పంపకమునుపే క్యాష్ చేసుకోవచ్చునా?

– పి. నజీర్‌బాషా, పి. పంజాని, చిత్తూరు జిల్లా

జవాబు : చేసుకోవచ్చు. ఇఎల్, హెచ్‌పిఎల్‌లను రిటైరైన మరుసటి రోజు నుండి ఎప్పుడైనా ఎన్‌క్యాష్ చేసుకోవచ్చు. పెన్షన్ ప్రతిపాదనలు రిటైర్మెంట్‌కు 18 నెలలు ముందుగానే ఏ.జి. కార్యాలయం పరిశీలనకు పంపుకోవచ్చు.

ప్రశ్న : నేను ఇంటర్ టిటిసితో గిరిజన సంక్షేమశాఖలో ఎస్‌జిటిగా పనిచేస్తున్నాను. 2010 మార్చి నాటికి 24 సం॥ల సర్వీసు పూర్తయింది. నా వయసు 46 సం॥లు. డిగ్రీ, బిఇడి అర్హతలు లేవు. నాకు 24 సం॥ల స్కేలు వస్తుందా?

– ఎస్. గోపాలరావు, పలాస, శ్రీకుళం జిల్లా

జవాబు : వచ్చే అవకాశం లేదు. హైస్కూల్ హెచ్.ఎం. ప్రమోషన్ అర్హతలు ఉంటేనే ఎస్‌జిటిలకు 24 సం॥ల (SPP-II) స్కేలు మంజూరుకు అర్హత లభిస్తుంది. అయితే ఇటీవల విడుదలైన జి.ఓ. 96 ఆర్థిక, తేది.20.05.2011 ప్రకారం మీకు 01.02.2010 నుండి 18 సం॥ల స్కేలు SPP-I(B)లో ఒక ఇంక్రిమెంటు లభిస్తుంది.

ప్రశ్న : 2002 డిఎస్‌సిలో అన్‌ట్రైన్డ్‌గా ఎంపికైన ఉపాధ్యాయునికి ఇ.ఓ.ఎల్ కారణంగా ఇంక్రిమెంటు తేదీ డిసెంబర్ నుండి జులైకి మారినది. ఆర్‌పిఎస్-2010 వేతన స్థిరీకరణ అనంతరం 2002 బ్యాచ్ అందరికంటే ముందుగా అతను ఇంక్రిమెంటు పొందుతున్నాడు. అతనితో మిగిలిన ఉపాధ్యాయులు ప్రీ పోన్‌మెంట్ తీసుకోవచ్చా?

– జి. శంకరయ్య, మంచాల, రంగారెడ్డి జిల్లా

జవాబు : తీసుకోవచ్చు. ఆర్‌పిఎస్-2010 వేతన స్థిరీకరణ జరిగిన తేది. 01.07.2008కి ముందు అతను మిగిలిన వారికంటే తక్కువ వేతనం పొందుతూ, ఫిక్సేషన్‌లో వేతనం సమానమై ముందుగా (జులైలోనే) ఇంక్రిమెంటు పొందుతూ వుంటే జి.ఓ. 52 ఆర్థిక, తేది. 26.02.2010లోని రూల్ 7 (iii) ప్రకారం సర్వీసులో అతనికంటే సీనియర్‌గా ఉన్న వారందరూ అతనితో సమాంగా ఇంక్రిమెంటు తేదిని ప్రీపోన్ చేసుకొనే అవకాశం ఉన్నది.

ప్రశ్న : (i) స్టెప్‌అప్ నిబంధనలలో సేమ్ కేటగిరి "అంటే ఏమిటి? స్కూల్ అసిస్టెంట్స్ అందరూ ఒకే కేటగిరిగా పరిగణించ బడతారా?

(ii) నేను ఎస్‌ఏ(పిఎస్), నా జూనియర్ ఎస్‌ఏ (బి.ఎస్)తో స్టెప్‌అప్ సర్వీసు తీసుకోవచ్చా?

– టి. మధుసూదన్, లక్సెట్టిపేట, ఆదిలాబాద్

జవాబు : సర్వీసు నిబంధనల ఉత్తర్వుల ప్రకారం స్కూల్ అసిస్టెంట్స్ అందరూ ఒకే క్లాస్/కేడర్‌గా పరిగణించబడతారు. స్కూల్ అసిస్టెంట్స్‌లోని ప్రతి సబ్జెక్టు ఒక కేటగిరీగా పరిగణించ బడుతుంది. స్టెప్‌అప్ నిబంధలలో "సేమ్ కేటగిరీ" అంటే "ఒకే సబ్జెక్టుకు చెందిన" అని అర్థం చేసుకోవాలి.

(ii) మీరు, మీ జూనియరు వేర్వేరు కేటగిరీ సబ్జెక్టుల స్కూల్ అసిస్టెంట్లు చెందిన పోస్టులలో వున్నందున, నిబంధనల ప్రకారం "స్టెప్‌అప్"కు అవకాశం లేదు.

ప్రశ్న : నేను బి.కాం., బి.ఇడి అర్హతలతో మండల పరిష్ ఎస్‌జిటిగా పనిచేస్తూ 16 సం॥ల స్కేలు తీసుకున్నాను. 24 సం॥ల సర్వీసు పూర్తిగావస్తున్నది. 24 సం॥ల స్కేలు పొందటానికి ఏ టెస్టులు పాస్ కావాలి?

– కె.వి. మధుసూదన్‌రావు, కాకినాడ

జవాబు : హైస్కూల్ ప్రధానోపాధ్యాయుని పదోన్నతికి అవసరమైన అర్హతలు కలిగివుంటే ఎస్‌జిటిలకు 24 సం॥ల స్కేలు మంజూరు చేస్తారు. మండల / జిల్లా పరిషత్ టీచర్లకు తాత్కాలిక సర్వీసు నిబంధనల జి.ఓ. 10 విద్య, తేది. 23.01.2009 ప్రకారం డిగ్రీ, బిఇడిలతో పాటు జి.ఓ., ఇఓ టెస్టులు పాస్ కావాలి. 50 సం॥ల వయసు నిండిన వారికి టెస్టుల మినహాయింపు వర్తిస్తుంది. మీకు 50 సం॥ వయస్సు నిండని యెడల జి.ఓ., ఇఓ టెస్టులు ఉత్తీర్ణులైతే 24 సం॥ల SPP-II స్కేలు పొందవచ్చు.

ప్రశ్న : ఉన్నత పాఠశాలలో నైట్‌వాచ్‌మెన్‌కు పిహెచ్‌సి అలవెన్సు ఎవరు మంజూరు చేయాలి.?

– ప్రధానోపాధ్యాయులు, జెడ్‌పిహెచ్ఎస్, దేవుపల్లి, విజయనగరం

జవాబు : జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లోని బోధనేతర సిబ్బందికి ఇంక్రిమెంటు, సాధారణ సెలవులు మినహా ఇతరత్రా అన్ని అంశాలలో మంజూరు అధికారాలు సిఇఓ/ డిప్యూటీ సిఇఓ జిల్లా పరిషత్‌కే ఉన్నాయి. కనుక పిహెచ్‌సి అలవెన్సును కూడా జిల్లా పరిషత్ అధికారులే మంజూరు చేయాలి.

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
# 12వ రాష్ట్ర మహాసభలు
## 2011 మే 9,10,11 -కర్నూలు

## సంఘం కార్యాకలాపాల నివేదిక

అధ్యక్షా !

### మహాసభ ప్రతినిధులారా!

యుటియఫ్ 11వ రాష్ట్ర మహాసభలు 2009 ఫిబ్రవరి 20,21,22 తేదీల్లో నల్లగొండలో జయప్రదంగా జరుపుకున్నాము. ఈ 27 నెలల కాలంలో అనేక ఆందోళనలు, పోరాటాలు చేశాము. ఈ మహాసభల కాలంలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో వచ్చిన మార్పులు మనపైనా, విద్యారంగంపైనా, సమాజంపైనా ప్రభావం చూపుతున్నాయి. అందుకే వీటిని మనం పరిశీలించాలి.

### అంతర్జాతీయం

ప్రపంచ చరిత్రలో 21వ శతాబ్దం ప్రవేశిస్తూనే అనేక కొత్త పరిణామాలు తీసుకువచ్చింది. ప్రత్యామ్నాయం లేదనుకున్న ప్రపంచీకరణకు ప్రజా ప్రతిఘటన ప్రారంభమైంది. ఎదురే లేదనుకున్న అమెరికాకు అనేక వైపుల నుండి సవాళ్లు ప్రారంభమయ్యాయి. ఏకధ్రువ ప్రపంచం బహుళ ధృవ ప్రపంచంగా మారుతున్నది. ఫైనాన్స్ పెట్టుబడి సంక్షోభం అమెరికాతోపాటు ప్రపంచ దేశాలెన్నిటినో అతలాకుతలం చేసింది. అనేక దేశాల ఆర్థిక వ్యవస్థలు చిన్నాభిన్నమయ్యాయి. హెచ్చుమందికి ఉపాధి కల్పించే పెద్ద పెద్ద పరిశ్రమలు మూతబడ్డాయి. బ్యాంకులు దివాళాతీసాయి. లక్షలాదిమంది నిరుద్యోగులుగా మారారు. ప్రజల కొనుగోలు శక్తి దారుణంగా పడిపోయింది. ఈ దశలో ప్రజలకు అండగా నిలవాల్సిన ప్రభుత్వాలు ఆర్థిక మాంద్యం నుండి బయటపడేందుకు వేలకొలది కోట్ల డాలర్లు బెయిలవుట్ల రూపంలో బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టాయి. అయినా ఆయా దేశాలు ఇప్పటికీ తేరుకోలేదు. అయితే ప్రభుత్వ రంగం బలంగా ఉన్న సోషలిస్టు దేశాలపై ఆర్థిక మాంద్యం ప్రభావం తక్కువగా ఉంది. యూపిఏ-1 ప్రభుత్వ హయాములో వామపక్షాలు ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ప్రభుత్వాన్ని నిలువరించగలగడంతో భారత దేశంపై కూడా ఆర్థిక మాంద్యం ప్రభావం తక్కువగా పడింది.

అమెరికాను సమూలంగా మార్చివేస్తానని "మార్పు" నినాదంతో అధికారంలోకి వచ్చిన ఒబామా ప్రభుత్వం పాత ప్రభుత్వాల ఒరవడిలోనే పాలన సాగిస్తోంది. ప్రభుత్వాలు ఏవైనా అమెరికా విధానాలు ఒకే విధంగా ఉంటాయని స్పష్టమైంది. వికీలీక్స్ పత్రిక అమెరికా దౌత్యపత్రాలను, యుద్ధ డైరీలను లీక్‌చేసి అమెరికా నిజస్వరూపాన్ని ప్రపంచానికి వెల్లడించింది. ఫలితంగా ప్రపంచ దేశాలు అమెరికాను ఖాతరు చేయని స్థితి ఎదురవుతున్నది. తాను పెంచి పోషించిన అంతర్జాతీయ ఉగ్రవాది ఒసామా బిన్ లాడెన్‌ను అమెరికా హతమార్చింది.

ఇటీవలి కాలంలో అరబ్ దేశాలు, ఉత్తర ఆఫ్రికా దేశాలలో ప్రజా తిరుగుబాట్లు ఒక వెల్లువలా వచ్చాయి. ట్యునీషియాలో ప్రారంభమైన తిరుగుబాట్లు ఈజిప్టు, యెమెన్, జోర్డాన్, సిరియా, అల్జీరియా తదితర

### అవిశ్రాంత పోరాటాలు - అసాధారణ విజయాలు

27 నెలల కాలంలో ఉపాధ్యాయుల సమస్యలపై అవిశ్రాంత పోరాటాలు చేసి అసాధారణ విజయాలు సాధించాము. ఉపాధ్యాయుల ఐక్య ఉద్యమం విచ్ఛిన్నమయి బలహీనపడింది. అయినా యుటియఫ్‌గా ఉపాధ్యాయుల మనోభావాలకు అనుగుణంగా రాజీలేని పోరాట సంస్థగా నిలబడి సమరశీల పోరాటాలు చేశాము. తిరుగు లేని విజయాలు సాధించాము. ఉపాధ్యాయ ఉద్యమంలో మైలురాళ్లుగా ఎన్నటికి మరచిపోలేనివిగా ఈ విజయాలుంటాయి. వీటి సాధనకు కారకులైన, పోరాటాలలో పాల్గొన్న కార్యకర్తలకు, ఉపాధ్యాయులకు ఈ మహాసభ ఉద్యమ జేజేలు తెల్పుతున్నది.

నోషనల్ ఇంక్రిమెంట్లు జి.ఓ. 2పై వివరణ ఉత్తర్వులు,మున్సిపల్ ఉపాధ్యాయులకు 010 హెడ్ జీతాలు, 1027 పోస్టులు మంజూరు, గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులకు సర్వీస్ రూల్స్, ఈ పాఠశాలలకు 2151 పోస్టుల మంజూరు, స్పాట్ రేట్లు 50% పెంపుదల, మన సంఘం మరియు పిడిఎఫ్ ఎమ్మెల్సీల విజ్ఞప్తుల మేరకు 9వ వేతన సంఘం సిఫారసుల ద్వారా వచ్చిన ఉత్తర్వులు, ప్రారంభ వేతనాలలో 2,3 స్టేజీల పెరుగుదల, అప్రెంటిస్ రెండేళ్ళ సర్వీసు పెన్షన్‌కు లెక్కింపు, 2002 అక్టోబర్ డిఎస్‌సి వారికి పాత పెన్షన్ అమలు, అర్థ జీతపు సెలవు ఎన్‌క్యాష్‌మెంట్, అదనపు పెన్షన్, మెడికల్ బిల్ సిఫారసు మరియు జెఏసీ అగ్రిమెంట్ ద్వారా ఇంటి అద్దె పెంపు, 6/12/18/24 స్కేళ్లు సాధన, ఎస్‌సి, ఎస్‌టి స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు వంటివి చారిత్రాత్మక విజయాలుగా, భవిష్యత్ పోరాటాలకు స్ఫూర్తినిచ్చేవిగా చెప్పుకోవచ్చు. ఈ మహాసభల కాలంలో సాధించిన ఉత్తర్వుల వలన ఉపాధ్యాయుల ఆర్థిక పరిస్థితి బాగా మెరుగుపడింది.

దేశాలకు పాకాయి. నియంతలైన ట్యునీషియా అధ్యక్షుడు, బెన్ అలీ, ఈజిప్టు అధ్యక్షుడు హోస్నీ ముబారక్ గద్దెదిగాల్సి వచ్చింది. మరో పక్క వామపక్ష విధానంతో వెనిజులా, క్యూబా, బ్రెజిల్, చిలీ, అర్జెంటైనా దేశాలు అభివృద్ధి పథంలో దూసుకుపోతున్నాయి. చైనా ఒక క్రమ పద్ధతిలో అభివృద్ధి చెందుతూ అమెరికా, జపాన్ ఆర్థిక వ్యవస్థలకు సవాలు విసురుతోంది.

## జాతీయం

యూపిఏ-2 ప్రభుత్వం అవినీతి కుంభకోణాలకు నెలవుగా మారింది; 2జి స్పెక్ట్రం, కామన్‌వెల్త్, ఆదర్శ్, ఐపిఎల్.... ఇలా కేంద్రంలో నేడు బయట పడ్తున్న వరుస కుంభకోణాలు చూస్తుంటే కాంగ్రెస్ పార్టీ, ప్రభుత్వ పెద్దలు అవినీతిలో ఎంతగా కూరుకుపోయారో తెలుస్తోంది. అధికారంలోని పెద్దలు, పారిశ్రామిక వేత్తలు, మీడియాల మధ్యక్రోనీ కేపిటలిజం సృష్టించిన లాబీని నీరారాడియా ఉదంతం బయటపెట్టింది. తన ప్రభుత్వంలోని మంత్రులే కుంభకోణాలలో దొరికిపోతుంటే, మన్మోహన్ సింగ్ మాత్రం తాను సచ్ఛీలుడనని చెప్పుకుంటున్నాడు. ఈ నేపథ్యంలో పెట్టుబడిదారీ వ్యవస్థలో అభివృద్ధికి-అవినీతికి ఉన్న అవినావభావ సంబంధం మరోసారి ఋజువైంది. రాజకీయ వ్యవస్థను కూడా భ్రష్టుపట్టించింది. బూర్జువా పార్టీలన్నీ ఏదో ఒక మోతాదులో ఈ ఊబిలో కూరుకుపోతున్నాయి. కర్నాటకలో ఎడ్యూరప్ప కుటుంబ సభ్యులకు భూ కేటాయింపులు, గాలిజనార్ధనరెడ్డి సోదరుల గనుల అక్రమ లీజులు, ఆదర్శ్ హౌసింగ్ కుంభకోణంలో బిజెపి అధ్యక్షుడు నితిన్ గడ్కరీపాత్ర, కామన్‌వెల్త్ కుంభకోణంలో కేంద్రమంత్రి సురేష్ కల్మాడీతోబాటు బిజెపి నాయకుడు సుధాంష్ మిట్టల్ పాత్రలు అవినీతి అంశంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్‌కు, ప్రతిపక్షంలో ఉన్న బిజెపికి తేడా ఏమిలేదని తేల్చేసింది. ఈ నేపథ్యంలో అవినీతికి వ్యతిరేకంగా లోక్‌పాల్ బిల్లు కోసం అన్నాహజారే నిరశన దీక్ష ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. అయితే ఈ కుంభకోణాలకు కారణమైన రాజకీయ పార్టీలు, కార్పొరేట్ శక్తులు, మీడియాలే అన్నాహజారే దీక్షకు మోతాదుకుమించి ప్రచారాన్ని కల్పించడం విశేషం.

పాలకుల నయా ఉదారవాద ఆర్థిక విధానాలు భారత దేశంలో వ్యవసాయ సంక్షోభాన్ని తీవ్రతరం చేసాయి. ఫ్యూచర్ ట్రేడింగ్, ఎగుమతి-దిగుమతి విధానాలు, పెట్రోలియం ఉత్పత్తుల ధరల పెంపు, వ్యవసాయం నుండి ప్రభుత్వ పెట్టుబడుల ఉపసంహరణ, సబ్సిడీల కుదింపు వంటి ప్రభుత్వ విధానాల కారణంగా ధరలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. ఫలితంగా ఇండియాలో సంపన్న భారతం, దిగులుబారిన పేద భారతం అనే రెండు భారతదేశాలు ఏర్పడుతున్నాయి.

2011 వన్డే ఇంటర్నేషనల్ ప్రపంచకప్ పోటీల్లో టీమిండియా విశ్వవిజేతగా నిలిచి 27 ఏళ్ల తర్వాత చారిత్రాత్మక విజయాన్ని సొంతం చేసుకొంది.

దేశంలో ప్రస్తుతం జరుగుతున్న 5 రాష్ట్రాల ఎన్నికలు కీలకంగా పరిణమించాయి. అస్థిరత నుండి సుస్థిరతకు నడిపిన బెంగాల్ లెఫ్ట్‌ఫ్రంటు ప్రభుత్వాన్ని కూలదోసేందుకు మమతా బెనర్జీ నాయకత్వంలో కాంగ్రెస్, మావోయిస్టులు, ఎస్‌యుసిఐ, తృణమూల్ కాంగ్రెస్‌లు ఒక్కటై ప్రయత్నిస్తునాయి. గత మూడున్నర దశాబ్దాలుగా సాధించిన రాజకీయ సుస్థిరతను, ప్రజాతంత్ర చైతన్యాన్ని, ఆర్థిక ఫలాలను ధ్వంసం చేయబూనుకుంటున్నాయి. కేరళలో ఎన్నికలు ముగిసినా, రైతు సంక్షేమం కోసం "ఎండోసల్ఫాన్"క్రిమి సంహారక మందుకు వ్యతిరేకంగా ముఖ్యమంత్రి అచ్యుతానందన్ చేపట్టిన దీక్ష వామపక్షాలు అధికారంలో ఉన్నా, లేకపోయినా ప్రజల పక్షానే ఉంటాయని తేటతెల్లం చేసింది. ఇందుకు భిన్నంగా తమిళనాడు ఎన్నికలలో డిఎంకె, ఏఐఏడిఎంకెలు వ్యవహరించిన తీరు బూర్జువా పార్టీలు అధికారం కోసం ఎంతటికైనా తెగిస్తాయని ఋజువు చేసింది.

## రాష్ట్ర పరిస్థితులు

రాజశేఖరరెడ్డి మరణానంతరం అవినీతిలో వాటాలకోసం, అధికారం కోసం కాంగ్రెస్ పార్టీలో కుమ్ములాటలు ప్రారంభమయ్యాయి. సూత్రాలు, సిద్ధాంతాలు, రాజకీయ విధేయతల గురించి ఎవరు ఎన్ని చెప్పినా ఈ నాటకీయ పరిణామాలన్నిటికి కారణం అవినీతి, ఆశ్రిత పెట్టుబడిదారీ దోపిడీయే.

ఈ క్రమంలో ప్రజా సమస్యలన్నీ గాలికి వదిలివేయబడ్డాయి. రైతు సంక్షేమం పట్టించుకునే వారు లేరు. పథకాలలో కోతలు ప్రజలను కృంగదీస్తున్నాయి. కొన్ని నెలలుగా రాష్ట్రం వివిధ ఉద్యోగ, కార్మిక, వేతన వర్గాలు, విద్యార్థులు, రైతులు ఆందోళనలతో అట్టుడికిపోతోంది. పాలన గాడిలో పెట్టాల్సిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి ఆయన ప్రభుత్వానికి సమస్యల పరిష్కారంకన్నా కడప ఉప ఎన్నికలే ప్రధాన సమస్య అయిపోయింది. మొత్తం మంత్రివర్గంతో కడపలో మకాం వేయడంతో సామాన్యుల సమస్యలు పట్టించుకునే వారే లేకుండా పోయారు.

## విద్యారంగ పరిస్థితి

అందరూ విద్య ద్వారానే సామాజిక మార్పు సాధించవచ్చునంటారు. ఏ దేశానికైనా విద్య,వైద్య రంగాలు కీలకమైనవని చెబుతుంటారు. రాష్ట్రంలో గత 10 ఏళ్ళలో అక్షరాస్యత 7.3% పెరిగింది. మహిళల అక్షరాస్యత 59.74% పెరిగింది. 12% పెరుగుదల మంచి మార్పు. మొత్తంగా చూస్తే ఆశించిన స్థాయిలో అక్షరాస్యత శాతం పెరగలేదు.

మన దేశంలోను, రాష్ట్రంలోను విద్యారంగంలో ప్రభుత్వ విధానాలు ఆందోళనలు కల్గిస్తున్నాయి. ఇటీవల కేంద్ర ప్రభుత్వం విధానాలు విద్యారంగంపై పెత్తనం చేసే విధంగా ఉన్నాయి. దేశమంతా ఒకే సిలబస్ గురించి మాట్లాడుతున్నారు. ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యం అనే విధానం ఆచరణలో ప్రైవేటు భాగస్వామ్యం పెంచుతుంది. ప్రభుత్వం తన బాధ్యతల నుండి వైదొలగుతుంది. ఎస్ఎస్‌సి బోర్డుల రద్దు, టీచర్ ఎల్జిబిలిటీ టెస్టులు, ఉపాధ్యాయుల ప్రవర్తనా నియమావళి, 100 రోజుల ప్రణాళిక ద్వారా విద్యారంగంపై రాష్ట్ర ప్రభుత్వ అధికారాలను కేంద్రం హైజాక్ చేస్తుంది. రాష్ట్ర ప్రభుత్వ అందుకు తలూపుతున్నది. రాష్ట్ర ప్రభుత్వం పాలనా సంస్కరణల పేరుతో అధికారాలు పంచుకోవటానికి విద్యా శాఖను విభజన చేసింది. ఈకేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాలు విద్యారంగానికి, ఉపాధ్యాయులకు నష్టం తెస్తాయని ఇప్పటికే వ్యతిరేకించాము.

నిన్నటివరకు సర్వశిక్షా అభియాన్, మాధ్యమిక శిక్షా అభియాన్ పేరుతో ఏదో గొప్ప మార్పు జరుగుతుందని చెబుతున్న ప్రభుత్వాలు విద్యాహక్కు చట్టం ద్వారా సమూల మార్పులు రానున్నట్లు నమ్మిస్తున్నాయి. ఆచరణ ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉన్నది. ఆర్‌విఎం అధికారుల రిపోర్టుల్లోనూ ఇతర స్వచ్ఛంద సంస్థల రిపోర్టులలోను

ఉపాధ్యాయులనే లక్ష్యంగా పెట్టుకొని ప్రభుత్వ పాఠశాలలో నాణ్యమైన విద్య లేదని వారే చెబుతున్నారు. ప్రభుత్వ విద్యారంగం భాగాలేదని నిరాశాజనకంగా ఉన్నదని ప్రభుత్వమే చెబుతుంది. పరోక్షంగా ప్రైవేట్ పాఠశాల విద్యను ప్రోత్సహించడమే ప్రభుత్వ వైఖరిగా ఉన్నది. ప్రభుత్వ బడ్జెట్‌తో నడుస్తున్న ప్రత్యేక పాఠశాలల్లో నాణ్యమైన విద్య అందించడం ద్వారా మంచి ఫలితాలు సాధిస్తున్నాయి. ప్రజలు వాటిని ఆదరిస్తున్నారు. ప్రభుత్వ, పంచాయితీరాజ్, ఎయిడెడ్ విద్యాసంస్థల పరిస్థితి నిరాశాజనకంగా ఉందంటే అక్కడ మౌలిక వసతులు, బోధించడానికి ఉపాధ్యాయులు లేకుండా చేశారు. ఈ పాఠశాలల్లో ఇప్పుడు పిల్లలు లేరని ఉపాధ్యాయులే అక్కర్లేదని, స్కూళ్ళు అవసరం లేదని ప్రభుత్వం సిద్ధాంతీకరిస్తున్నది. విద్యాహక్కు చట్టం అమలులోకి వచ్చేనాటికి ప్రభుత్వ పాఠశాలల పరిస్థితి ఇది. మౌలిక వసతులు మెరుగుపరచి తగిన సంఖ్యలో ఉపాధ్యాయులను నియమించి నాణ్యమైన విద్యను అందించగలమనే విశ్వాసం కలిగించింతేనే మన పాఠశాలలు నిలబడే పరిస్థితి ఉంది. జననాల రేటు తగ్గుదల, పట్టణ ప్రాంతానికి వలసలు, ఇంగ్లీషు మీడియంవైపు ఆలోచనల ప్రభావం నేడు గ్రామీణ ప్రాంతాలలో విద్యార్థుల సంఖ్య ప్రభుత్వ పాఠశాలల్లో గణనీయంగా తగ్గింది. గత పదేళ్లలో ఆరేళ్ళ పిల్లల శాతం 13.35% నుండి 10.21 శాతానికి పడిపోయిందని 2011 జనాభా లెక్కలు చెబుతున్నాయి. పట్టణ ప్రాంతములో పెరుగుతున్న విద్యార్థులకు అనుగుణంగా అక్కడ ప్రభుత్వ పాఠశాలలు లేవు. ప్రైవేటు కార్పొరేటు పాఠశాలల్లో పిల్లలు చేరిపోతున్నారు. ప్రభుత్వ రంగంలో వున్న పాఠశాలలనైనా పరిరక్షించి నాణ్యమైన విద్యను అందించాలని పైకి చెబుతుంది. ఆచరణలో రేషనలైజేషన్ ద్వారా ఉపాధ్యాయులను, పాఠశాలలను తగ్గించే ప్రయత్నం చేస్తుంది. ఒక్క హైదరాబాద్ నగరంలో 300 ప్రభుత్వ పాఠశాలలని మూసి వేయటం జరిగిందంటే ప్రభుత్వ వైఖరి ఏమిటో అర్థమౌతుంది. **పిల్లలు లేని చోట స్కూళ్లు అవసరంలేదని చెబుతున్న ప్రభుత్వం పిల్లలున్న పట్టణ ప్రాంతాలలో పాఠశాలలు పెట్టడం లేదు పైగా ఉన్న స్కూళ్ళనే మూసివేతకు సిద్ధం చేస్తున్నది.** చదువును కొనుక్కోమని ప్రభుత్వమే చెబుతున్నది.

**సెకండరీ పాఠశాలలు :** చాలా కాలం తర్వాత ఉన్నత పాఠశాలలకు సబ్జెక్టు టీచర్ల పోస్టులు మంజూరు చేసి భర్తీ చేయడంతో ఉన్నత . పాఠశాలల పరిస్థితి మెరుగైంది. ఫలితాలు మెరుగుపడ్డాయి. అక్కడక్కడా ఎన్‌రోల్‌మెంట్ పెరిగింది. సమాంతర మీడియం తరగతులు నిర్వహిస్తున్నప్పటికి పిల్లలు ఇంగ్లీషు మీడియంవైపు పోవడం లేదు. పిల్లల కుటుంబ వాతావరణం, ఇంగ్లీషు పునాది లేకపోవడం, ఇంగ్లీషు బోధనలో నాణ్యత లేకపోవడం కారణాలు కావచ్చు. ఇటీవల అప్‌గ్రేడ్ చేయబడిన అన్ని మేనేజ్‌మెంట్ల ఉన్నత పాఠశాలలకు తగినన్ని పోస్టులు మంజూరు చేయాల్సి ఉంది. మాధ్యమిక విద్యకు ప్రాధాన్యత ఇస్తున్నామని చెబుతున్న ప్రభుత్వం కొత్త పోస్టులు మంజూరు చేసే పరిస్థితి లేదని తేల్చి చెప్పడం విడ్డూరంగా ఉంది. కంప్యూటర్ విద్య గురించి గొప్పగా చెబుతున్న ప్రభుత్వం పాఠశాలల్లో నేడు జరుగుతున్న బోధన పరిచయ కార్యక్రమమే తప్ప కంప్యూటర్ విద్య కాదు. ఆర్‌విఎం, మాధ్యమిక శిక్షా అభియాన్ పేరుతో ఖర్చు చేస్తున్న నిధులు దుర్వినియోగం అవుతున్నాయి. అవసరాలతో సంబంధం లేకుండా ఖర్చు చేస్తున్నారు. పాఠశాలలకు మౌలిక వసతులు మెరుగుపర్చి తగినంతమంది ఉపాధ్యాయులను నియమించడం ద్వారా పాఠశాల విద్యను మెరుగు పర్చవలసి ఉంది. విద్యాహక్కు చట్టం అమలుకు చర్యలు చేపట్టవలసి ఉంది. **ఉన్నత విద్యారంగంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాలు ఆ రంగాన్ని పూర్తిగా వదిలించుకొనే వైపు కొనసాగుతున్నాయి.**

### విద్యాహక్కు చట్టం - అమలుకు చేసిన కృషి

"విద్యాహక్కు చట్టం 2009" పార్లమెంట్ ఆమోదంతో (26.08.09) 2010 ఏప్రిల్ 1 నుండి అమల్లోకి వచ్చింది. కేంద్ర ప్రభుత్వం నమూనా మార్గదర్శకాలు ఇచ్చి దీని అమలుకు రాష్ట్ర ప్రభుత్వాలు అన్ని రకాల చర్యలు తీసుకోవాలని మోడల్ రూల్స్ రాష్ట్రాలకు పంపించింది. చట్టంలోని సానుకూల అంశాలను వెంటనే అమలు చేయాలని పాఠశాల మాధ్యమిక విద్యాశాఖ మంత్రులకు, విద్యాశాఖ కార్యదర్శులకు మన సంఘం తరపున అనేక ప్రాతినిధ్యాలు చేసి కదిలించే ప్రయత్నం చేశాం. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు తమవంతు కృషి చేశారు. ఏప్రిల్ 1 ఆర్‌విఎం కార్యాలయంలో జరిగిన సింపోజియంలో ఎన్. నారాయణ మాట్లాడుతూ చట్టాన్ని అమలు చేసే కార్యక్రమాలు వెంటనే ప్రారంభించాలని డిమాండ్ చేశారు. అందుకు అవసరమైన రూల్స్ రాష్ట్ర ప్రభుత్వం రూపొందించాలని గట్టిగా చెప్పడం జరిగింది. అమలుకు పటిష్టమైన యంత్రాంగాన్ని రూపొందించాలని, బడిఈడు పిల్లలను గుర్తించాలని, అవసరమైన పాఠశాలలను వెంటనే ప్రారంభించాలని విద్యాహక్కు నిబంధన ప్రకారం తగిన సంఖ్యలో ఉపాధ్యాయులను నియమించాలని సూచనలు చేశారు. మన సంఘం తరపున రాష్ట్ర ప్రభుత్వం చట్టం అమలుకు ఏం చేస్తుందని ప్రశ్నిస్తూ 26.02.2010న లేఖ వ్రాశాము. ప్రభుత్వం చేపట్టే చర్యలు, కార్యక్రమాలు, ప్రణాళిక ఏమిటో ప్రకటించాలని డిమాండ్ చేశాం. 24.04.2010 తేదీన విద్యాహక్కు చట్టంలో చేయాల్సిన మార్పులపై కొన్ని సూచనలు చేశాము. ఉచిత నిర్బంధ విద్యకు అవసరమైన వయస్సును 6 నుండి 16 సంవత్సరాలుగా 10వ తరగతి వరకు విస్తరింప చేయాలని, పూర్వ ప్రాథమిక విద్యను చట్టం పరిధిలోకి తీసుకోవాలని, ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి, బోధనేతర సిబ్బంది గురించి సూచనలు చేశాము. జూన్ 24,30 తేదీలలో కేంద్ర ప్రభుత్వం మోడల్ రూల్స్‌కి రాష్ట్ర ప్రభుత్వం రూపొందించే రూల్స్‌లో చేర్చాల్సిన, సవరించాల్సిన సూచనలు చేశాము. 2011 జనవరి 1న రాష్ట్ర ముఖ్యమంత్రిగారికి యుటియఫ్ తరపున శుభాకాంక్షలు తెలుపుతూ 2011 సంవత్సరాన్ని విద్యాహక్కు చట్టం అమలు సంవత్సరంగా ప్రకటించాలని కోరుతూ అవసరమైన చర్యలు యుద్ధప్రాతిపదికన చేపట్టాలని విజ్ఞప్తి చేశాము. రాబోయే విద్యాసంవత్సరంలో విద్యాహక్కు చట్టం అమలుకు ప్రభుత్వంపై వత్తిడి చేసే కార్యక్రమాలు మరిన్ని చేపట్టవలసి ఉంది.

### అప్రెంటిస్ టీచర్ల నోషనల్ ఇంక్రిమెంట్లు జి.ఓ. 2 అమలుకు పోరాటం

అప్రెంటిస్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు జి.ఓ.2 అమలుపై ట్రెజరీ అధికారులు అభ్యంతరాలు పెట్టారు. దీనిపై ట్రెజరీ, విద్యాశాఖ నుండి క్లారిఫికేషన్ కొరకు ఆర్థిక శాఖకు పంపగా సమస్య మళ్ళీ మొదటకు వచ్చింది. వివరణ ఉత్తర్వుల కోసం అనివార్యంగా పెద్ద పోరాటానికి దిగాల్సి వచ్చింది.

**2010 జూన్ 4 నుండి 6వ తేదీ వరకు** నోషనల్ ఇంక్రిమెంట్లపై వివరణ ఉత్తర్వులు ఇవ్వాలని ఆర్‌విఎం శిక్షణా కేంద్రాలలో నల్లబ్యాడ్జీలు ధరించి మధ్యాహ్న భోజన విరామ సమయంలో నిరసన ప్రదర్శనలు నిర్వహించాము.

**18.06.2010 చలో సెక్రటేరియట్** అప్రెంటిస్ నోషనల్ ఇంక్రిమెంట్లపై విద్యాశాఖ వివరణ ఉత్తర్వుల కోసం చలో సెక్రటేరియట్‌కు పిలుపునిచ్చాము. 5000 వేలమందితో వర్షాన్నిసైతం లెక్క చేయకుండా జరిగిన ధర్నా కార్యకర్తలల్లో ఉద్యమ స్ఫూర్తిని మరింత పెంచింది.

**జూన్ 19న చలో సెక్రటేరియట్** నిర్వహించాము. వందలాదిమంది కార్యకర్తలను, ఎమ్మెల్సీలను అరెస్టులు చేశారు.

**జూన్ 21 నుండి 26 వరకు** ఇందిరాపార్కు వద్ద నిరాహారదీక్షలు చేశాము. జూన్ 26న ఫైలు ముఖ్యమంత్రి కార్యాలయానికి చేరడంతో రాష్ట్రంలో దీక్షలు విరమించాము. జిల్లాలలో ఉత్తర్వులు సాధించే వరకు దీక్షలు జరిగాయి. జులై 1న 8663 మెమో విడుదలైంది. వివరణ ఉత్తర్వులు యిచ్చేవరకు పోరాటం అనే మన పిలుపు విజయవంతం అయ్యింది.

**స్పెషల్ విద్యావాలంటీర్లు మరియు ఎస్‌సి, ఎస్‌టి అన్‌ట్రైన్డ్ సమస్యలపై కృషి**

**07.01.2010 తేదీన ధర్నా** 855 మందితో ఇందిరాపార్కు వద్ద జరిగింది. జనవరి 8న పిడిఎఫ్ చైర్మన్ చుక్కా రామయ్య నేతృత్వంలో ఎన్. నారాయణ, పి. మాణిక్‌రెడ్డి ముఖ్యమంత్రి రోశయ్యను కలిసి మెమోరాండం సమర్పించి చర్చించారు. యుటియఫ్ తరపున ట్రిబ్యునల్‌లో వేసిన కేసుపై 130 జి.ఓ.ను కొట్టివేస్తూ 748 ఉత్తర్వులు అమలు చేయాలని తీర్పు చెప్పింది. దీనికనుగుణంగా ఉత్తర్వులు యివ్వాలని ప్రాతినిధ్యాలు, పోరాటాలు చేసాము.

**21.07.2010 స్పెషల్ విద్యావాలంటీర్ల సమస్యలపై చలో సెక్రటేరియట్ కార్యక్రమంలో** 1381 మంది పాల్గొన్నారు. అరెస్టులు జరిగాయి. చుక్కారామయ్య నేతృత్వంలో విద్యాశాఖ మంత్రి, విద్యాశాఖ కార్యదర్శికి మెమోరాండంలు సమర్పించాము. వారం రోజుల్లో రిపోర్టు పంపాలని విద్యాశాఖ మంత్రి విద్యాశాఖ కార్యదర్శిని ఆదేశించారు. ఈ పోరాటంలో స్పెషల్ విద్యావాలంటీర్లు ఉత్సాహంగా పాల్గొన్నారు.

**2010 సెప్టెంబరులో ముఖ్యమంత్రికి లేఖలు** స్పెషల్ విద్యావాలంటీర్లు, ఎస్‌సి,ఎస్‌టి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయుల సమస్యల పరిష్కరించాలని ఎస్‌సి, ఎస్‌టి ఎమ్మెల్యే, ఎమ్మెల్సీల ద్వారా సెప్టెంబరు 26-30 మధ్య ముఖ్యమంత్రికి లేఖలు పెట్టించాలని పిలుపునిచ్చాము. ఈ పిలుపు నామమాత్రంగా అమలు జరిగింది.

**05.01.2011 డిఎస్‌ఇ ముట్టడి** 2002 డిఎస్‌సి ఎస్‌సి,ఎస్‌టి, బిసి ఉపాధ్యాయులకు జిపిఎఫ్ అక్కౌంట్స్ ప్రారంభించుటకు అనుమతించాలని, ప్రభుత్వ పెన్షన్ వర్తింప చేయాలని పాఠశాల విద్య డైరెక్టర్ కార్యాలయాన్ని ముట్టడించి గేట్ వద్ద 2 గంటలు బైఠాయించి వందలాదిమంది కార్యకర్తలు నిరసన తెలిపారు. యుటియఫ్ ప్రాతినిధ్యం మేరకు జిపిఎఫ్ ప్రారంభించుటకు, ప్రభుత్వ పెన్షన్‌కు అనుమతిస్తూ 20.12.2010న ఆదేశాలు యిచ్చిన డైరెక్టర్ గారు కొన్ని సంఘాల ఒత్తిడి మేరకు స్పెషల్ విద్యావాలంటీర్లకు ఈ ఆదేశాలు వర్తించవని తిరిగి క్లారిఫికేషన్ ఇవ్వడాన్ని తీవ్రంగా వ్యతిరేకించి నిరసన తెలిపాము.

**23.01.2011 జెఎసి అగ్రిమెంట్‌లో** ఎస్‌సి,ఎస్‌టి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులు మరియు స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలనే డిమాండ్ జెఏసి అగ్రిమెంట్‌లో చేర్చేదానికి మన సంఘం తరపున పట్టుబట్టి సరైన అర్థం వచ్చేలా అగ్రిమెంట్‌లో మాటలు చేర్పించడం జరిగింది. ప్రస్తుతం ఆర్థిక శాఖ అనుమతి ఇచ్చినట్లు తెలుస్తుంది. త్వరలో ఉత్తర్వులు వెలువడే అవకాశం వుంది.

**మున్సిపల్ పాఠశాలల - ఉపాధ్యాయుల సమస్యలపై మన కృషి**

**19.06.2009న** మున్సిపల్ సర్వీసు రూల్స్, బదిలీల నిబంధనలపై ఉపాధ్యాయ సంఘాలతో కమీషనర్ మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ కార్యాలయంలో జరిగిన చర్చలలో రాష్ట్ర నాయకులతోపాటు జిల్లాలలో మున్సిపల్ సమస్యలపై అవగాహన ఉన్న మన కార్యకర్తలు పాల్గొన్నారు. మన సంఘం తరపున చేసిన ప్రతిపాదనలు దాదాపుగా అధికారులు అంగీకరించారు.

♦ **మున్సిపల్ ఆఫీసుల ఎదుట 03.07.2010న ధర్నాలు** 13 జిల్లాలో 36 మున్సిపాలిటీలలో జరిగిన ధర్నాలో 1905మంది పాల్గొన్నారు. మూడు చోట్ల ధర్నాలు చేయకుండా మెమోరాండాలు యిచ్చారు. స్థానిక పోరాటాలలో ఎక్కువ మందిని సమీకరించి చేయడంలో వైఫల్యం జరుగుతుంది.

♦ **మున్సిపల్ డైరెక్టరేట్ ముట్టడి** 23.07.2010 తేదీన జరిగింది. ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి కార్యక్రమాన్ని ప్రారంభించారు. అదనపు సంచాలకులు సమస్యలపై చర్చించారు. 22 మున్సిపాలిటిల నుండి 115 మంది మాత్రమే పాల్గొనడం మన సంఘం స్థాయికి తగినట్లు లేదు. శ్రీకాకుళం, విశాఖ, చిత్తూరు, కడప జిల్లాల నుండి ఒక్కరు కూడ రాలేదు. పెద్ద కార్పోరేషన్లైన విశాఖ, రాజమండ్రి, గుంటూరు, కడప నుండి ఒక్కరూ రాలేదు.

♦ **జులై 24న మున్సిపల్ శాఖమంత్రితో** డి. రామిరెడ్డి నేతృత్వంలో కలిసి మెమోరాండం ఇవ్వగా 26వ తేదీన అధికారులతో చర్చలు ఏర్పాటు చేశారు. మంత్రి ఆనం రాంనారాయణరెడ్డి, ముఖ్య కార్యదర్శి పుష్పా సుబ్రహ్మణ్యం, డైరెక్టర్ ప్రేమ్‌చంద్ మరియు డి.రామిరెడ్డి, రాష్ట్ర నాయకులు పాల్గొన్నారు.

♦ **26.03.2011న** డి. రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, కె.ఎస్. లక్ష్మణ్‌రావు, వై. శ్రీనివాసులు రెడ్డి, యుటియఫ్ రాష్ట్ర నాయకులు మున్సిపల్ శాఖామాత్యులు ఎం. మహీధర్ రెడ్డి గారిని కలిసి సమస్యలపై చర్చించి పరిష్కారానికి చొరవ చూపాలని విజ్ఞప్తి చేశాము.

♦ **04.05.2011న** ఎమ్మెల్సీలు చుక్కారామయ్య, వి. బాలసుబ్రహ్మణ్యం, కె.ఎస్. లక్ష్మణరావు, వై. శ్రీనివాసులు రెడ్డి ఆర్థికశాఖ కార్యదర్శి ఎల్.వి. సుబ్రహ్మణ్యంను కలిసి నోషనల్ ఇంక్రిమెంట్లపై వివాదం కొనసాగించవద్దని విద్యాశాఖ, మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ అధికారులను పిలిపించుకొని వారితో మాట్లాడి క్లియరెన్స్ ఇవ్వాలని కోరారు.

మన సంఘం, మున్సిపల్ ఉద్యోగులు నిరంతరం చేసిన పోరాటాల ఫలితంగా మున్సిపల్ ఉపాధ్యాయులకు 010 హెడ్ ద్వారా జీతాలు 1.04.2009 నుండి అమలులోనికి రావడం గొప్ప విజయం. ఈ ఉత్తర్వుల అమలులో అనేక ఆటంకాలు ఎదురైనాయి. జి.ఓ. 405, తేది. 23.06.2009 ఉత్తర్వులలో జీతాల సమస్య పరిష్కారం అయ్యింది. కాగా 300 జి.ఓ.లో ప్రతినెలా ఆడిట్ చేయాలనే షరతు తొలగింపుకు అనేక ప్రాతినిధ్యాలు చేసాము. దీనిపై స్టేట్ ఆడిట్ వారు యిచ్చిన మెమో అమలుకు డిటిఏ అనుమతించలేదు. జి.ఓ. సవరణను మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ సెక్రటేరియట్‌లో ఫైలు నడుస్తుంది. డిఏ సొంత వనరుల నుండి తీసుకోవాలనే డిఏ జీ.ఓ.లోని నిబంధనకు సవరణ ఉత్తర్వులు యిప్పించాము.

♦ మున్సిపల్ ఉపాధ్యాయుల రాష్ట్ర సదస్సు 03.10.2010 నెల్లూరులో నిర్వహించాము. మున్సిపల్ శాఖమంత్రి ఆనం రాంనారాయణరెడ్డి

ముఖ్య అతిథిగా పాల్గొని సమస్యల పరిష్కారానికి హామీ యిచ్చారు. కొనసాగింపుగా చేసిన ప్రాతినిధ్యాల వలన కొన్ని సమస్యలు పరిష్కారం అయ్యాయి.

♦ మున్సిపల్ ఉన్నత పాఠశాలలకు 92 ప్రధానోపాధ్యాయుల పోస్టులు 935 స్కూల్ అసిస్టెంట్ పోస్టులు అనేక ప్రాతినిధ్యాలు చేసి పాఠశాల విద్యాశాఖ నుండి మున్సిపల్ పాఠశాలలకు కేటాయిస్తూ ఉత్తర్వులు 60, తేది. 25.10.2010 యిప్పించాము.

♦ ఏ.పి.జి.ఎల్.ఐ. పథకాన్ని ఎయిడెడ్ మున్సిపల్ సిబ్బందికి వర్తింపచేయాలని ఏ.పి.జి.ఎల్.ఐ. మరియు ఆర్థికశాఖ అధికారుల అత్యున్నత సమావేశంలో (20.11.2010) నాడు మన సంఘం తరపున ఐ. వెంకటేశ్వర రావు పాల్గొని ఈ పథకాన్ని మున్సిపల్, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు వర్తింప చేయాలని గట్టిగా డిమాండ్ చేయడం జరిగింది. ఏ.పి.జి.ఎల్.ఐ డైరెక్టర్ డి. రవీంద్రనాథ్ మరియు ఆర్థికశాఖ అధికారులు ఆ రోజు యిచ్చిన హామీ మేరకు ఈ పథకాన్ని మున్సిపల్ ఉపాధ్యాయులకు వర్తింప చేస్తూ ఉత్తర్వులు వెలువడ్డాయి.

♦ మున్సిపల్ కార్పోరేషన్ సర్వీస్ రూల్స్ ఏపిపిఎస్‌సికి పంపారు. మున్సిపల్ సర్వీస్ రూల్స్ వివరణ కోరుతూ సిడిఎంఏకి పంపారు.

♦ మున్సిపల్ ఉపాధ్యాయుల మెడికల్ రీయింబర్సుమెంటు సిడిఎంఎకు వచ్చిన ప్రతిపాదనలు డిఎంఇ స్క్రూటినీ అనంతరం మంజూరు ఉత్తర్వులు యిస్తున్నారు. ఉద్యోగులందరితోపాటు హెల్త్‌కార్డులు యివ్వాలనే మన డిమాండును ప్రభుత్వ అధికారులు అంగీకరించారు.

♦ ప్రధానంగా మున్సిపల్ ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఉత్తర్వుల కోసం సంఘం తరపున, పిడిఎఫ్ ఎమ్మెల్సీలతో కలిసి మంత్రులతోను, విద్యాశాఖ, మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్, ఆర్థిక శాఖతోను అనేక ప్రాతినిధ్యాలు చేశాము. పరిష్కారానికి చివరి దశలో ఉందని భావిస్తున్నాం. ఆర్థికశాఖ అనుమతితో ఉత్తర్వులు రావలసి ఉంది.

♦ 01.04.2009 ముందు అరియర్లు చెల్లింపుకు ఆదేశాలు యిప్పించాము. పిఎఫ్ సౌకర్యం వర్తింపు ఫైలు ఆర్థిక శాఖ నుండి క్లియరెన్సు రావలసి ఉంది. విజయవాడ, విశాఖ కార్పొరేషన్ల ఉపాధ్యాయుల జీతాలు 010 పద్దుకింద చెల్లించాలనే డిమాండు పరిష్కారం కావలసి ఉంది.

♦ ఎన్ని పోరాటాలు చేసినా వెంటాడి ప్రాతినిధ్యాలు చేస్తున్నప్పటికీ అధికారుల అవగాహన లోపంతో ఫైళ్ళు తిరిగిన చోటనే తిరుగుతున్నాయి. ఉత్తర్వులు రాకపోవడంలో మున్సిపల్ ఉపాధ్యాయుల్లో అసంతృప్తి నెలకొంది. ముఖ్యంగా నోషనల్ ఇంక్రిమెంట్లు, ప్రీ ఆడిట్, పిఎఫ్, సర్వీసు రూల్స్ సమస్యలు పరిష్కారం కావలసి ఉంది.

## గిరిజన సంక్షేమ పాఠశాలల, ఉపాధ్యాయుల సమస్యలపై కృషి

**బదిలీలు-ప్రమోషన్లకు కృషి :** గిరిజన పాఠశాలలు-ఉపాధ్యాయుల సమస్యలపై సర్వీసు రూల్స్ వచ్చిన తర్వాతనే బదిలీలు, ప్రమోషన్లు యివ్వాలనే కొన్ని సంఘాల వైఖరి వలన కొన్ని జిల్లాలలో బదిలీలు, ప్రమోషన్లు జరగలేదు. సర్వీసు రూల్స్‌తో ముడి పెట్టకుండా మొదట పై క్యాడర్‌లో బదిలీలు తర్వాత ప్రమోషన్లు యిచ్చే పద్ధతి అమలు చేయించాము. ఎప్పుడు ఖాళీలు ఏర్పడితే అప్పుడు యిచ్చుకోవచ్చని ఆదేశాలు యిప్పించాము.

**గిరిజన సంక్షేమ పాఠశాలలకు 2151 పోస్టులు మంజూరుకు కృషి** గత 8 సంవత్సరాలుగా అప్‌గ్రేడెడ్ గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలలకు అదనపు పోస్టులు మంజూరు చేయాలని యుటిఎఫ్‌తోపాటు గిరిజన సంఘాలు చేసిన పోరాటాల ప్రాతినిధ్యాల ఫలితంగా జి.ఓ.నం.276, తేది. 09.08.2010న 2151 పోస్టులు మంజూరు ఉత్తర్వులు వచ్చాయి. ప్రధానోపాధ్యాయులు 190, గణితం 213, ఇంగ్లీషు 330, ఫిజిక్సు 330, బయోసైన్సు 8, సోషల్ 179, తెలుగు 162, హిందీ 178, వ్యాయామం 330, గ్రేడ్-2 భాషాపండితులు 231. కోర్టు కేసుల కారణంగా పోస్టులకు ప్రమోషన్లు ఇవ్వడంలో ఆలస్యం జరుగుతుంది.

**30.08.2010 నాడు ఈ పోస్టుల భర్తీకి ఐటిడిఏ కేంద్రాల ఎదుట ధర్నా** నూతనంగా మంజూరైన 2151 పోస్టులు, పాఠశాలల వారీగా కేటాయించి అర్హులైన ఉపాధ్యాయులకు పదోన్నతులు కల్పించాలని, 30 శాతం డైరెక్టు రిక్రూట్‌మెంట్ పోస్టుల భర్తీకి స్పెషల్ డిఎస్‌సి నిర్వహించాలని, సర్వీసు రూల్స్ విడుదల చేయాలని, పర్యవేక్షణాధికారుల పోస్టులకు ప్రమోషన్ అవకాశం కల్పించాలని తదితర సమస్యలు పరిష్కారం కోరుతూ ధర్నాలకు పిలుపునిచ్చాము. నున్నిపెంట 130, రంపచోడవరం 100, భద్రాచలం 80, ఏటూరునాగారం 80, ఉట్నూరు 40, పార్వతీపురం 70, సీతంపేట 80 పాల్గొన్నారు. పాడేరు, కోటరాంచంద్రపురంలో కార్యక్రమాలు జరగలేదు.

**2011 జనవరి 10న గిరిజన సంక్షేమ కమీషనర్ కార్యాలయం వద్ద రాష్ట్ర ధర్నాకు** నోటీసు యిచ్చాము. అయితే గిరిజన సంక్షేమ కమీషనర్ మన సంఘం డిమాండ్‌పై వ్రాతపూర్వక హామీ యివ్వడంతో ధర్నా వాయిదా వేశాము.

**గిరిజన సంక్షేమ ఆశ్రమ ఉన్నత పాఠశాలల డిపార్ట్‌మెంటల్ సర్వీసు రూల్స్ జి.ఓ.నం. 23, తేది. 01.04.2011న విడుదలైనాయి.**

జిల్లా యూనిట్‌గా స్కూల్ అసిస్టెంట్ తత్సమాన కేడర్ల నుండి ప్రమోషన్లు యివ్వాల్సివుంది.

గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలల వ్యవస్థ ప్రారంభమై 30 సంవత్సరాలు గడిచాయి. 1992 ఆగస్టు 11,12 తేదీలలో రంపచోడవరంలో జరిగిన రాష్ట్ర సదస్సులో ఈ సర్వీసు రూల్స్‌పై ఉద్యమానికి శ్రీకారం చుట్టాము. 20 ఏళ్ళు పోరాటాల ఫలితంగా ఈ రూల్స్ వెలువడ్డాయి. ఏకీకృత సర్వీసు రూల్స్ ఎదురైన ఆటంకాల వలన డిపార్ట్‌మెంటల్ సర్వీసు రూల్స్ రూపొందించాలని గత రెండేళ్ళుగా మనం చేసిన కృషి ఫలించింది.

స్కూల్ అసిస్టెంట్ క్యాడర్ పోస్టులకు సంబంధించిన సబార్డినేట్ సర్వీస్ రూల్స్‌ను ఎపిపిఎస్‌సి పరిశీలనకోసం పంపారు. త్వరలో ఈ రూల్స్ కూడ విడుదలయ్యే అవకాశం ఉంది.

## ఎయిడెడ్ ఉపాధ్యాయుల సమస్యలపై మన కృషి

ఎయిడెడ్ ఉపాధ్యాయులు 37/2005 యాక్టు రద్దు, పిఎఫ్ సౌకర్యం, మెడికల్ రీయింబర్స్‌మెంట్ వర్తింపు, నోషనల్ ఇంక్రిమెంట్స్, ప్రమోషన్లు, నియామకాలు చేయాలని నిరంతరం వెంటాడినా ఫలితం లేదు. పిడిఎఫ్ తరపున ఎమ్మెల్సీలు శాసనమండలిలో మంచి కృషి చేశారు. బడ్జెట్ సమావేశాల సందర్భంగా శాసనమండలిలో పిడిఎఫ్ ఎమ్మెల్సీలు ఎయిడెడ్ సమస్యలపై ప్రత్యేకంగా కేంద్రీకరించి కృషి చేశారు. ప్రశ్నోత్తరాలు, ప్రత్యేక ప్రస్తావన, స్వల్ప వ్యవధి చర్చ, అవకాశం వచ్చిన ప్రతి సందర్భంలో ప్రభుత్వాన్ని నిలదీశారు. కార్యక్రమాలు స్తంభింప చేశారు. ఫైళ్ళు నిరంతరం కొర్రీలతో నడుస్తున్నాయి. ఎయిడెడ్

ఉద్యోగుల కుటుంబాలకు కారుణ్య నియామకాలు చేయుటకు ఉత్తర్వులు సాధించుకోవడం ఒక విజయం.

**31.08.2009న చలో అసెంబ్లీ 593 మందితో** జరిగింది. వర్షాన్ని సైతం లెక్క చేయకుండా ధర్నా అనంతరం చలో అసెంబ్లీలో పాల్గొన్నారు. సిపిఎం ఎమ్మెల్యే. జూలకంటి రంగారెడ్డి ఎయిడెడ్ సమస్యలపై ముఖ్యమంత్రికి వినతిపత్రం యిచ్చారు. 08.01.2011న చుక్కారామయ్య, ఎన్. నారాయణ యాక్టు 37 రద్దుకు ప్రాతినిధ్యాలు చేశారు.

**2010 మార్చి 10న చలో అసెంబ్లీ** పిలుపుచ్చి ఇందిరాపార్కు వద్ద 311 మందితో ధర్నా జరిపాము. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు, జెఏసి నాయకులు ఆక్టా నాయకులు సిపిఎం శాసనసభ / మండలి సభాపక్ష నేతలు పాల్గొన్నారు. కొనసాగింపుగా మార్చి 18 నుండి 23 వరకు 5 రోజులు రిలే నిరాహార దీక్షలు జరిపాము.

బడ్జెట్ సమావేశాల సందర్భంగా పిడిఎఫ్ ఎమ్మెల్సీలు శాసనమండలి వెల్‌లో బైఠాయించి నిరసన తెలిపారు. చైర్మన్ చక్రపాణి సీరియస్‌గా స్పందించి సమస్య పరిష్కారానికి మంత్రి, అధికారులు చొరవ చూపాలని ఆదేశించారు.

**12.07.2010 చలో అసెంబ్లీ మరియు ధర్నా** ఎయిడెడ్, బాషాపండితుల సమస్యలు పరిష్కారానికి 12వ తేదీన చలో అసెంబ్లీ నిర్వహించి కొనసాగింపుగా 13వ తేదీన ధర్నా చేశాము. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు శాసనమండలిలో చర్చకు పట్టుపట్టగా సిఎంతో మాట్లాడి చర్చలకు తేదీ నిర్ణయించాలని చైర్మన్ చక్రపాణి విద్యాశాఖమంత్రిని ఆదేశించారు. 12వ తేదీన 347 మంది 13వ తేదీన 150 మంది పాల్గొన్నారు. ఎయిడెడ్ ఉపాధ్యాయులు ఎక్కువగా ఉన్న జిల్లాల నుండి నామమాత్రంగానే పాల్గొనడం అసంతృప్తి కలిగిస్తుంది.

**2011 మార్చి** శాసనమండలి సమావేశాలలో మరోసారి పిడిఎఫ్ ఎమ్మెల్సీలు తీవ్ర నిరసన వ్యక్తం చేశారు. దీనితో ఎయిడెడ్ 37/2005పై సానుకూలంగా నిర్ణయం తీసుకొంటామని మంత్రి హామీ యిచ్చారు. 15.04.2011 జరిగిన విద్యాశాఖ, ఆర్థిక శాఖ అధికారుల సమావేశం యాక్టుపై సానుకూల నిర్ణయం తీసుకొన్నప్పటికి ఆర్థిక శాఖ అభ్యంతరాలు యధావిధిగా పెడుతున్నారు. ఏమైనా ముఖ్యమంత్రి రాజకీయ నిర్ణయం తీసుకొంటేనే పరిష్కారమయ్యే అవకాశం వుంది.

## అప్రెంటిస్ వ్యవస్థ రద్దుకై పోరాటం

అప్రెంటిస్ వ్యవస్థ రద్దు చేయాలని కోరుతూ మన సంఘం మరియు పిడిఎఫ్ తరపున పీఆర్‌సీకి నివేదించాము. ఆ మేరకు పీఆర్‌సీ ఉపాధ్యాయుల నియామకాలు రెగ్యులర్ ప్రాతిపదికన చేయాలని సిఫారసు చేసింది. దీని కోసం ఈ కాలంలో అనేక ప్రాతినిధ్యాలు ఆందోళన పోరాటాలు నిర్వహించాము. జెఏసీ డిమాండ్స్‌లో చేర్పించాము.

**అప్రెంటిస్ విధానం రద్దు కోరుతూ 06.08.2010 రాష్ట్ర ధర్నా** అప్రెంటిస్ విధానం తక్షణం రద్దు చేయాలని కోరుతూ జరిగిన ధర్నాలో ఎమ్మెల్సీలు కె. నాగేశ్వర్, కె.ఎస్. లక్ష్మణరావు, జెఏసి సెక్రటరీ జనరల్ కె. స్వామిగౌడ్, యుటియఫ్ రాష్ట్ర నాయకులుతో పాటు సుమారు 1000 మంది పాల్గొన్నారు. అనంతరం చుక్కా రామయ్య నేతృత్వంలో ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఎస్.వి.ప్రసాద్‌ను కలిసి మెమోరాండం యిచ్చాము. ఎమ్మెల్సీ లక్ష్మణరావు నేతృత్వంలో యుటియఫ్ ప్రతినిధి బృందం విద్యాశాఖ కార్యదర్శి,డైరెక్టర్‌తో చర్చలు జరిపాము.

**2010 సెప్టెంబరు 5న ఉపాధ్యాయుల దినోత్సవం** నాడు అప్రెంటిస్ విధానం రద్దు చేయాలి, డిఎస్‌సి 2008 వారికి టైం స్కేలు చెల్లించాలని **డిమాండ్స్ దే** పాటించి నిరసన తెలిపాము. రవీంద్రభారతిలో జరిగిన నిరసన కార్యక్రమంలో మన సంఘం రాష్ట్ర నాయకులు, హైదరాబాద్ జిల్లా నాయకులు పాల్గొని నిరసన తెలియజేశారు. ఈ సందర్భంగా రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ వేదికపైకి వెళ్ళి విద్యాశాఖామంత్రులు డి. మాణిక్యవరప్రసాద్, డి. శ్రీధర్‌బాబులకు అప్రెంటిస్ విధానం రద్దు చేయాలని మెమోరాండం సమర్పించారు. చాలా జిల్లాల్లో ఈ డిమాండ్స్ దే పాటించి నిరసన తెలియజేశారు.

**జనవరి 9,10 తేదీలలో** సంక్రాంతి సెలవుల్లో 2008 డిఎస్‌సి ఉపాధ్యాయులకు ఆర్‌విఎం శిక్షణా తరగతుల్లో మధ్యాహ్న భోజన విరామ సమయంలో 230 కేంద్రాలలో 30 వేలమంది ఉత్సాహంగా పాల్గొని నిరసన తెలిపారు.

**2011 జనవరి 23న** అప్రెంటిస్ వ్యవస్థ రద్దు కోరుతూ జెఏసీ ఒప్పందంలో పట్టుపట్టి చేర్పించడం జరిగింది.

**2011 ఫిబ్రవరిలో** ప్రభుత్వం నిర్వహిస్తున్న రచ్చబండ కార్యక్రమాల్లో అప్రెంటిస్ వ్యవస్థ రద్దు పరచి పూర్తి జీతాలు చెల్లించాలని ముఖ్యమంత్రి, మంత్రులకు మెమోరాండాలిచ్చే కార్యక్రమాలు చేశాము. ఫిబ్రవరి 7న గుంటూరు జిల్లా నిజాంపట్నంలో జరిగిన రచ్చబండ కార్యక్రమాల్లో ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి వినతిపత్రం సమర్పించారు. కొన్ని జిల్లాల్లో మంత్రులకు మెమోరాండాలు సమర్పించడం జరిగింది.

**2011 మార్చి 28,29** తేదీలలో జిల్లా, డివిజన్ కేంద్రాలలో జరిగిన ప్రదర్శనలలో 155 కేంద్రాలలో 15 వేలమంది పాల్గొన్నారు.

**08.04.2011 తేదీన అప్రెంటిస్ రద్దు** కోరుతూ ఇందిరాపార్కు వద్ద రాష్ట్ర ధర్నా 2834 మందితో జరిగింది. అదే రోజు ఎమ్మెల్సీలు కె.ఎస్. లక్ష్మణరావు, వై. శ్రీనివాసులురెడ్డి, రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ మాధ్యమిక విద్యాశాఖమంత్రి కె. పార్థసారధిని కలిసి చర్చించారు. ఏప్రిల్ 15న ఆర్థికశాఖ అధికారులతో సమావేశం ఏర్పాటుచేసి చూస్తామని హామీ యిచ్చారు.

**17.04.2011 స్పాట్ కేంద్రాలలో పికెటింగ్** ఏప్రిల్ 15నాడు విద్యాశాఖమంత్రి హామీ మేరకు అప్రెంటిస్ రద్దుపై సానుకూల నిర్ణయం రాకపోవడంతో స్పాట్ కేంద్రాలలో పికెటింగ్ కార్యక్రమం జయప్రదం అయ్యింది.

## 2008 డిఎస్‌సి ఉపాధ్యాయుల నియామకాల కోసం పోరాటం

2008 డిఎస్‌సి ఉపాధ్యాయుల నియామకాలలో కోర్టు కేసులు, క్షేత్ర స్థాయిలో సరిపడా వేకెన్సీలు లేవనే పేరుతో ప్రభుత్వం నియామకాలను అలస్యం చేస్తూ వచ్చింది. నియామకాల కొరకు అనేక ఉద్యమాలు జరిగాయి. డిఎస్‌సి పోరాట కమిటీ, డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో జరిగిన అన్ని పోరాటాలలో పాల్గొని మద్దతు తెలపడం జరిగింది. యుటియఫ్ రాష్ట్ర కార్యాలయం నుండి ఈ పోరాటాలు నడిచాయి. వేకేన్సీలు లేని 1149 స్కూల్ అసిస్టెంట్లు, భాషాపండితుల, పిఇటి పోస్టుల భర్తీకి జరిగిన పోరాటాలతోబాటు ఎస్‌జిటి నియామకాల కొరకు జరిగిన అన్ని పోరాటాలలో పాల్గొన్నాము. మంత్రులు అధికారులతో ప్రాతినిధ్యాలు చేశాము.

**11.06.2010 డిఇఓ కార్యాలయాల ముట్టడి కార్యక్రమం** యుటియఫ్ ఆధ్వర్యంలో నోటిఫికేషన్ ప్రకారం పోస్టులన్నీ భర్తీ చేయాలని డిఇఓ కార్యాలయాల ముట్టడి చేశాము.

**28.07.2010 డివైఎఫ్ఐ, డిఎస్‌సి పోరాట కమిటీ ఆధ్వర్యంలో** వేలాదిమందితో జరిగిన నిరవధిక ధర్నాలో పాల్గొని మద్దతు తెలియజేశాము. మన సంఘం తరపున 2 వేలాదిమందికి రాత్రిపూట భోజన ఏర్పాట్లు చేశాము. రాష్ట్ర నాయకులు, ఎమ్మెల్సీలు పాల్గొన్నారు. **18.10.2010 జిల్లా కేంద్రాలలో** ఎస్‌జిటి నియామకాలు వెంటనే చేపట్టాలని ర్యాలీలు నిర్వహించాము.

2010 అక్టోబరులో 70:30 నిష్పత్తిలో ఎస్‌జిటి పోస్టులు నియామకాలు చేయాలని ప్రభుత్వానికి సూచన చేశాము. ఎట్టకేలకు అక్టోబరులో నియామకాలు జరిగాయి. 2008 డిఎస్‌సి నియామకాల కోసం మనం చేసిన పోరాటాలు, సంఘీభావం మన సంఘం పట్ల వారిలో అభిమానం వ్యక్తమైంది. నియామకాల సందర్భంలో వీరికి ఆహ్వానం పలుకుతూ మన సంఘం చేసిన కరపత్రానికి మంచి ఆదరణ లభించింది.

## స్పాట్ వ్యాల్యుయేషన్ రేట్లు పెంపుదలకు పోరాటం

**22.04.2009** స్పాట్ వ్యాల్యుయేషన్ రేట్లు పెంచాలని డిమాండ్ చేస్తూ భోజన విరామ సమయంలో ప్రదర్శనలకు పిలుపునిచ్చాము. **2010 ఏప్రిల్లో** స్పాట్ రేట్లు పెంచాలని భోజన విరామ సమయంలో 2వ తేదీనుంచి నిరసన తెలిజేయాలని 15వ తేదీనుంచి స్పాట్ విధులు బహిష్కరించాలని పిలుపునిచ్చారు. మన సంఘం పిలుపు తర్వాత జాక్టోలో కదలిక వచ్చి పోరాటానికి పిలుపునిచ్చారు. **మన పోరాటం ద్వారా ఏడేళ్ళ తర్వాత 50 శాతం రేట్లు పెంచుకోవటం మంచి విజయం.**

## 2010 డిసెంబరు 16న చలో అసెంబ్లీ

ఉపాధ్యాయుల ముఖ్యమైన సమస్యలు పరిష్కరించాలని చలో అసెంబ్లీ 637 నిర్వహించాము. ఆ రోజు సాయంత్రం విద్యాశాఖమంత్రి చర్చలకు ఆహ్వానించారు. మెమోరాండంలోని 10 సమస్యలపై సమగ్రంగా చర్చించారు. అప్రెంటిస్ వ్యవస్థ రద్దు, ఎయిడెడ్ భాషాపండితుల యాక్టు రద్దు, ఎయిడెడ్, మున్సిపల్, గిరిజన ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు తదితర సమస్యలు ముఖ్యమంత్రి దృష్టికి తీసుకువెళ్ళామని చెప్పారు. ఆఫీసు బేరర్లు ఈ చర్చలలో పాల్గొన్నారు.

## ఈ కాలంలో ముందుకొచ్చిన అనేక సమస్యలపై ఆందోళన - పోరాటాలు - ప్రాతినిధ్యాలు

**బదిలీలు - ప్రమోషన్లు**

మన సంఘం చొరవ ఫలితంగా సాధించుకొన్న అడ్‌హాక్ రూల్స్‌తో జనవరి / ఫిబ్రవరిలో ప్రమోషన్ల ప్రక్రియ పూర్తి అయిన తర్వాత వేసవిలో బదిలీలు మిగిలిన ప్రమోషన్లు అమలుకు అనేక ప్రాతినిధ్యాలు చేశాము. ఆన్‌లైన్ కౌన్సిలింగ్ పద్ధతిలో బదిలీలు చేసే విషయంపై పెద్ద చర్చ జరిగింది. కాలయాపన జరుగుతున్న నేపథ్యంలో జూన్ నెలలో షెడ్యూల్ ప్రకటించాలని ధర్నా కార్యక్రమానికి పిలుపునిచ్చాము. ప్రభుత్వం జూన్ 29 నుండి బదిలీల ప్రక్రియ ప్రారంభిస్తూ షెడ్యూల్ ప్రకటించింది. ఎన్ని ఆటంకాలు ఎదురైనా షెడ్యూల్ అమలు చేయించుకోవాలని ప్రయత్నాలు చేశాము. జి.ఓ.లకు, మార్గదర్శకాలకు అవసరమైన సవరణలు యిప్పించాము. ఆయా జిల్లాలలో ప్రత్యేక సమస్యలపై వివరణ ఉత్తర్వులు యిప్పించాము. కౌన్సిలింగ్‌లో ఎదురైన సమస్యలు పరిష్కారానికి నిరంతర ప్రాతినిధ్యాలు చేసి క్లారిఫికేషన్స్ యిప్పించాము. స్పెషల్ టీచర్లు, స్పెషల్ విద్యావాలంటీర్ల సర్వీస్ లెక్కింపు, వేర్వేరు కేటగిరీలలో పనిచేసే వారికి 2 కేటగిరీల సర్వీసు పాయింట్ల లెక్కింపు, నల్లగొండ భార్యా భర్తల ప్రాధాన్యతకు సంబంధించిన సమస్యలపైన, అనంతపురం జిల్లాలో 2005 కౌన్సిలింగ్‌లో జరిగిన అక్రమాలు సరిచేయుటకు, ప్రకాశం జిల్లాలో 2005 బదిలీలలో నో వేకెన్సీ వారికి ఈ కౌన్సిలింగ్‌లో మొదటి ప్రాధాన్యత యిప్పించుట, తూర్పుగోదావరి జిల్లా 610 భార్యా భర్తలను కౌన్సిలింగ్‌కు అనుమతించుటకు, ఏజెన్సీ ప్రాంత జిల్లాలలో 2005 బదిలీలలో ఏజెన్సీ నుండి మైదాన ప్రాంతాలకు బదిలీలు కోరుకొన్న వారిని రిలీవింగు చేయుటకు, ఎం.ఏ. ఎడ్యుకేషన్ ప్రమోషన్లకు అనుమతించుటకు, స్కూల్ అసిస్టెంట్ బాషా పండితులు, ఫిజికల్ డైరెక్టర్లు 2000 పోస్టులకు ప్రమోషన్లు యిప్పించేదానికి కృషి చేశాము.

అప్‌గ్రేడేషన్ వలన, పోస్టులు సర్‌ప్లస్ చేయడం వలన అనివార్యంగా సర్దుబాటు చేయబడుతున్న ఎస్‌జిటి, పండిత, పిఇటీలకు అదనపు పాయింట్లు యివ్వాలని మనం చేసిన ప్రాతినిధ్యాలు ఫలించక పోవడంతో **జులై 24 డైరెక్టరేట్ ముట్టడికి** పిలుపునివ్వగా ప్రభుత్వం స్పందించి 5 పాయింట్లు యిచ్చింది. సర్దుబాటు ఎస్‌జిటిలకు మొదటి ప్రాధాన్యత యివ్వాలనే ట్రిబ్యునల్ ఆదేశాలతో కౌన్సిలింగ్ ప్రక్రియ నిలిచిపోయింది. ప్రభుత్వం హైకోర్టులో వెకేట్ పిటిషన్ వేయాలని కోరాము. కౌన్సిలింగ్ ప్రక్రియ కొనసాగించాలని అడిషనల్ అడ్వకేట్ జనరల్ ఎ. సత్యప్రసాద్ మంచి వాదన విన్పించారు. కౌన్సిలింగ్ ప్రక్రియ కొనసాగింపుకు హైకోర్టు ఉత్తర్వులు యివ్వడంతో ఎస్‌జిటిల కౌన్సిలింగ్ సుఖాంతంగా ముగిసింది. మొత్తం మీద 1,50,000 మంది బదిలీల ద్వారా 50,000 మంది ప్రమోషన్ల ద్వారా ప్రయోజనం పొందారు. రికార్డు స్థాయిలో బదిలీలు-ప్రమోషన్లు సాధించుకోవడంలో మన సంఘం కృషి ప్రత్యేకంగా నిలుస్తుంది.

**అంతర్‌జిల్లా బదిలీలు**

– గత 7 సంవత్సరాల తర్వాత అంతర్‌జిల్లా బదిలీలు తీవ్ర సమస్యగా ముందుకొచ్చాయి. మొదటి నుండి వీరి బదిలీల కోసం మంచి కృషి చేశాము. జిఏడి అధికారుల ఆటంకాలతో ఎవరికీ బదిలీలు జరిగే అవకాశం లేదని అభ్యంతరాలు చెప్పారు. **2009 అక్టోబర్ 12న అంతర్‌జిల్లా బదిలీలు** వెంటనే చేయాలని డిమాండ్ చేస్తూ **డైరెక్టరేట్ ముట్టడి** కార్యక్రమం సుమారు 120 మందితో జరిగింది. ఎమ్మెల్సీలు రామయ్య, నాగేశ్వర్‌లు హాజరయ్యారు. 80 మందిని అరెస్టు చేశారు. కొనసాగింపుగా **13వ తేదీన డైరెక్టరేట్ వద్ద జరిగిన ధర్నాలో** 40 మంది పాల్గొన్నారు. అందరికి బదిలీలు చేయాలని పలుమార్లు చలో డైరెక్టరేట్, చలో సెక్రటేరియట్, ధర్నాలు, నిరవధిక నిరాహారదీక్షలకు మన సంఘం పట్ల అభిమానం వ్యక్తం చేశారు. భార్యాభర్తల బదిలీలలో ప్రతిష్టంభన ఏర్పడింది. వీరి బదిలీకి పాఠశాల విద్యాడైరెక్టర్ పూనం మాలకొండయ్య లేఖ, మానవ హక్కుల కమీషన్ ఆదేశాలు, మన సంఘం మరియు బాధిత ఉపాధ్యాయులు వత్తిడి ఫలితంగా హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలకు మినహా మిగిలిన వారికి బదిలీ ఉత్తర్వులు వెలువడ్డాయి. మొత్తం మీద 7 సం॥ల తర్వాత దాదాపు 5 వేలమందికి అంతర్‌జిల్లా బదిలీలు చేయడంలో కీలక పాత్ర పోషించాము. వీరందరిలో మన సంఘం పట్ల అభిమానం వ్యక్తమైంది.

**రాజీవ్ విద్యామిషన్** ఆధ్వర్యంలో అక్టోబర్ 19 నుంచి జరగాల్సిన అభ్యసనాభివృద్ధి కార్యక్రమం (లెప్) శిక్షణా తరగతులు వాయిదా వేయాలని కోరినప్పటికి స్పందించకపోవటంతో బహిష్కరణ

పిలుపునిచ్చాయి. దీనితో అధికారులు స్పందించి అక్టోబర్ 20న ఉపాధ్యాయ సంఘాలతో సమావేశం ఏర్పాటు చేశారు. మూడు రోజులకు తగ్గించాలని గట్టిగా పట్టుబట్టినా శిక్షణను నాలుగు రోజులకు కుదించాలనే నిర్ణయం జరిగింది.

**జాయింట్ స్టాఫ్ కౌన్సిల్ సమావేశం 29.09.2010న** సి బ్లాక్ కాన్ఫరెన్స్ హాలులో ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఎస్.వి. ప్రసాద్ అధ్యక్షతన జరిగింది. మొత్తం 137 ఎజండా అంశాలలో 30 అంశాలపై చర్చ జరిగింది. పదవీ విరమణ వయసు 60 సం॥లు పెంచాలని, కంట్రిబ్యూటరీ పెన్షన్ పథకాన్ని వెనక్కి తీసుకోవాలని ఉద్యోగుల నుండి ఇప్పటికే మినహాయించిన సొమ్ము వ్యక్తిగత ఖాతాలకు జమ చేయాలని, ప్రభుత్వ వాటా 10% సొమ్ము జమ చేయాలని, ఉపాధ్యాయుల దొడ్డిదారీ బదిలీలు చేయరాదని, అప్రెంటిస్ వ్యవస్థ రద్దు చేయాలని, మహిళలకు చైల్డ్ కేర్ లీవ్ ఇవ్వాలని, 610 జి.ఓ.అమలు ద్వారా బదిలీ అయిన ఉపాధ్యాయులకు టిటిఏలు చెల్లించాలని గట్టిగా డిమాండ్ చేశారు. సమావేశాలు సక్రమంగా జరగడం లేదని, చర్చలకే పరిమితమైనవిగా ఉంటున్నాయని, నిర్ణయాలు అమలు జరగడం లేదని మన సంఘం తరపున అసంతృప్తి వ్యక్తం చేశాము.

## ప్రాతినిధ్యాలు

రాష్ట్ర కార్యాలయాలు పాఠశాల విద్య, మున్సిపల్, గిరిజనసంక్షేమ, ట్రెజరీ, సెన్సెస్ డైరెక్టరేట్లలోనూ, సెక్రటేరియట్‌లోను విధానపరమైన, వ్యక్తిగత సమస్యలపైన, జిల్లాల నుంచి వచ్చే వివిధ సమస్యలపై క్లారిఫికేషన్ ఇప్పించుటకు సుమారు 350 లేఖలు పెట్టి ప్రాతినిధ్యాలు చేశాము. వీటిలో చాలా సమస్యలు పరిష్కారానికి కృషి చేశాము. కొన్నింటిపై ప్రాతినిధ్యాలు చేసినప్పటికి నిరంతరం వెంటాడకపోవడం వలన పెండింగ్‌లో ఉంటున్నాయి. మెడికల్ రీయింబర్స్‌మెంట్ క్లెమ్స్ పరిష్కారం కావడానికి దీర్ఘకాలం పడుతుంది.డిఎస్‌సి, డిఎంఇ కార్యాలయాల్లో జరుగుతున్న జాప్యంపై సంఘం తరపున, పీడిఎఫ్ ఎమ్మెల్సీల తరపున అనేకసార్లు అధికారుల దృష్టికి తీసుకువెళ్ళినా పరిస్థితిలో పెద్దగా మార్పులేదు. 610 ద్వారా బదిలీయైన ఉపాధ్యాయుల టిటిఏ బిల్లులు చెల్లింపుకు ఎన్ని ప్రాతినిధ్యాలు చేసి వెంటాడినా పరిష్కారం కాలేదు.

## దినోత్సవాలు

ప్రతి సంవత్సరం మే దినోత్సవం నాడు, ఆగస్టు 10న యుటియఫ్ పతాకావిష్కరణలు, ఆగస్టు 12న ఎస్‌టిఎఫ్‌ఐ పతాకావిష్కరణ, ఆగస్టు 15, జనవరి 26న జాతీయ పతాకాలు రాష్ట్ర కార్యాలయంలో ఆవిష్కరించి సమావేశాలు నిర్వహించడం జరుగుతున్నది.

**జాతీయ విద్యా దినోత్సవం** సందర్భంగా 11.11.2009 రౌండ్‌టేబుల్ సమావేశం, ఆర్ఎంఎస్ఏ పథకంపై 04.12.2009న వర్కుషాపు రాష్ట్ర కార్యాలయంలో నిర్వహించాము. సిబిఎస్ఇ సిలబస్‌పై 25.11.2009న డైరెక్టరేట్‌లోను, 09.12.2009న సెక్రటేరియట్‌లోను ఉపాధ్యాయ సంఘాలతో జరిగిన సమావేశంలో మన సంఘం అభిప్రాయాలు తెలియజేశాము.

**గుంటూరు విద్యాసదస్సు 14.06.2009న** గుంటూరు జిల్లా శాఖ ఆధ్వర్యంలో గుంటూరులో జరిగింది. పాఠశాల విద్యారంగం ప్రస్తుత పరిస్థితిపై అవగాహన పత్రాన్ని మాధ్యమిక విద్యాశాఖమంత్రి శ్రీ డి. మాణిక్యవరప్రసాదరావు గారికి సమర్పించాము. బదిలీల షెడ్యూల్ ప్రకటించాలని కోరాము. ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు, ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు, కె. వెంకటరావు, ఎం.ఎ.కె.దత్, గుంటూరు జిల్లా ఆఫీస్ బేరర్లు, 400 మంది కార్యకర్తలు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## కంప్యూటర్ టీచర్ల రాష్ట్ర సదస్సు

**06.03.2010** యుటియఫ్ రాష్ట్ర కార్యాలయంలో యుటియఫ్, రాష్ట్ర ప్రభుత్వ కాంట్రాక్టు ఎంప్లాయిస్ ఫెడరేషన్, స్వేచ్ఛ ఫౌండేషన్‌లు సంయుక్తంగా "కంప్యూటర్ విద్య' రాష్ట్ర సదస్సు ఎ.వి. నాగేశ్వర రావు అధ్యక్షతన జరిగింది. ఎమ్మెల్సీ కె. నాగేశ్వర్, స్వేచ్ఛ చైర్మన్ వై. కిరణ్‌చంద్ర, ఎన్.నారాయణ,సిహెచ్. రవి సందేశాలు యిచ్చారు. 20 జిల్లాల నుండి 200 మంది పాల్గొన్నారు. 20 మంది సభ్యులతో రాష్ట్ర కన్వీనింగ్ కమిటీని ఎన్నుకొన్నారు. తూర్పుగోదావరి, హైదరాబాద్,రంగారెడ్డి, ఖమ్మం, గుంటూరు, నల్గొండ, కడప, విజయనగరం జిల్లాల్లో ఈ సదస్సులు జరిగాయి.

## రాష్ట్ర మహిళా సదస్సు

అంతర్జాతీయ మహిళా శతదినోత్సవం సందర్భంగా రాష్ట్ర మహిళా సదస్సు **08.03.2010న** శ్రీమతి ఎం. సంయుక్త అధ్యక్షతన హైదరాబాద్‌లో ఏవిఎస్ మీటింగ్ హాలులో జరిగింది. పాఠశాల విద్యా కమీషనర్ శ్రీమతి పూనం మాలకొండయ్య ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. సిఐటియు ఉపాధ్యక్షురాలు శ్రీమతి ఎస్. పుణ్యవతి, ఎమ్మెల్సీ డా॥ కె. నాగేశ్వర్, ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు సందేశాలిచ్చారు. కె. విజయగౌరి తీర్మానాలు ప్రవేశ పెట్టారు. 300 మంది హాజరైనారు.

## రాష్ట్ర విద్యా సదస్సు

**2010 ఆగస్టు 8వ తేదీన** రాష్ట్ర విద్యాసదస్సు విజయవాడ మాంటిస్సోరి కళాశాలలో జరిగింది. కేరళ విద్యాశాఖమంత్రి ఎం.ఎ.బేబి, రాజ్యసభ సభ్యులు సీతారాం ఏచూరి పాల్గొని ప్రసంగించారు. కేంద్ర ప్రభుత్వ సంస్కరణలు విద్యారంగాన్ని దెబ్బ తీస్తున్నాయన్నారు. విద్యాహక్కు చట్టం గొప్ప విజయమే గాని, నిధుల కేటాయింపు లేకపోవడం, 0-6, 14-18 సం॥ల వారిని చేర్చకపోవడం వంటి లోపాలు ఉన్నాయని వారిని కూడ విద్యాహక్కు చట్టం పరిధిలోకి తీసుకురావాలన్నారు. ప్రసంగ పాఠం పత్రంలో పలు విషయాలు పొందుపర్చారు. ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం స్థానంలో ప్రభుత్వ భాగస్వామ్యాన్నే తమ రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్నట్లు చెప్పారు. 'నాణ్యమైన విద్య అందించడం ద్వారానే నాణ్యమైన జీవితం ఇవ్వగలమని' చెప్తూ ముగించారు. సీతారం ఏచూరి మాట్లాడుతూ విద్యారంగంపై యూపిఏ-2 ప్రభుత్వం తెచ్చే నాలుగు బిల్లులు ప్రమాదకరమని చెబుతూ విద్యారంగంపై తాము పార్లమెంటులో చేస్తున్న కృషిని వివరించారు. ఎమ్మెల్సీలు డి. రామిరెడ్డి, కె.ఎస్. లక్ష్మణరావు, రాష్ట్ర నాయకులు, దగ్గర జిల్లాల నుంచి ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ఆతిథ్యమిచ్చిన కృష్ణా జిల్లా శాఖకు ధన్యవాదాలు.

## మున్సిపల్ ఉపాధ్యాయుల రాష్ట్ర సదస్సు

**2010 అక్టోబర్ 3న** మున్సిపల్ ఉపాధ్యాయుల రాష్ట్ర సదస్సు నెల్లూరు డివిఆర్ కళ్యాణమండపంలో జరిగింది. ముఖ్య అతిథిగా మున్సిపల్ పరిపాలనశాఖా మాత్యులు శ్రీ ఆనం రాంనారాయణరెడ్డి హాజరైనారు. మున్సిపల్ పాఠశాలల పరిస్థితిపైన, ఉపాధ్యాయుల సమస్యలపైన పెట్టిన తీర్మానాన్ని సదస్సుకు హాజరైన ప్రతినిధులు చర్చించి ఆమోదించారు. ఎమ్మెల్సీ వి. బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ మన సంఘం చేసిన పోరాటాలు పిడిఎఫ్ తరపున చేసిన ప్రాతినిధ్యాలు ఫలితంగా 8 సం॥ల తర్వాత 2008 డిఎస్‌సి పోస్టుల భర్తీ జరిగిందన్నారు. తీర్మానంలో అంశాలపై మంత్రి స్పందిస్తూ సమస్యల పరిష్కారానికై వెంటనే చర్యలు తీసుకుంటామని హామీ యిచ్చారు. 13 జిల్లాల నుంచి 500 మంది ప్రతినిధులు ఈ సదస్సులో పాల్గొన్నారు. ఆతిథ్యమిచ్చిన నెల్లూరు జిల్లా శాఖకు ధన్యవాదాలు.

**ప్రధానోపాధ్యాయుల రాష్ట్ర సదస్సు** 23.01.2011న హైదరాబాద్‌లో ఏవిఎస్ మీటింగ్ హాలులో రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు అధ్యక్షతన జరిగింది. అడ్‌హాక్ రూల్స్‌తో ప్రధాన ఉపాధ్యాయులకు జిల్లా, ఉప విద్యాశాఖాధికారి పోస్టులకు పదోన్నతులు కల్పించాలని, డిఇఓ, డిప్యూటీ డైరెక్టర్ పోస్టుల పదోన్నతులకు స్థానిక సంస్థల నుండి వచ్చే వారిని మినహాయించాలనే నిబంధన తొలగించాలని, బోధనేతర సిబ్బందిని సమకూర్చాలని తీర్మానాలు ఆమోదించారు.

## 9వ పీఆర్‌సీ - మన కృషి

సి.ఎస్. రావు నేతృత్వంలో ఏర్పడిన 9వ వేతన సంఘం 27 రకాల ప్రశ్నావళి రూపొందించి దాని ఆధారంగా మన సంఘం అభిప్రాయాలను, నూతన వేతనాలను, అలవెన్సులు, రిటైర్మెంట్ బెనిఫిట్ వగైరా వివరాలు పంపమని కోరింది.

పీఆర్‌సీ విషయాలు చర్చించి ప్రతిపాదనలు తయారు చేయుటకు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వరరావు, ఎన్. రమణయ్యశాస్త్రి, కె. వెంకట్రావు, సిహెచ్. రవి, ఎ. నర్సిరెడ్డి, ఎం.ఎ.కె.దత్, డి. రామిరెడ్డిలతో కూడిన కమిటి పలుమార్లు సమావేశమైంది. మన సంఘం ప్రతిపాదనలు 07.12.2008న పీఆర్‌సీకి సమర్పించి చర్చించాము. ఎమ్మెల్సీల తరపున విడిగా ప్రతిపాదనలు సమర్పించారు. తదుపరి పలుమార్లు యుటియఫ్, జెఏసి తరపున జరిగిన చర్చల్లో పాల్గొని మన అభిప్రాయాలు చెప్పాము. పీఆర్‌సీ రిపోర్టు డిసెంబరు 11న అసెంబ్లీకి సమర్పించడం జరిగింది. ఫిట్‌మెంట్ 27 శాతం తీవ్ర అసంతృప్తి కలిగించింది.

మన సంఘం ప్రతిపాదించిన అంశాలు పీఆర్‌సీ పరిగణనలోనికి తీసుకోవాలని, గత పీఆర్‌సీలలో జరిగిన నష్టాన్ని నివారించాలని కోరాము. సీనియర్, జూనియర్ వ్యత్యాసం సవరణను స్టెప్‌అప్ సౌకర్యం యివ్వాలని, ప్రీపోన్‌మెంట్ సౌకర్యం కల్పించాలని, ఎఫ్ఆర్ 22బి వర్తింపు, ప్రసూతి సెలవు పెంచాలని, అంత్యక్రియల ఖర్చులు రెట్టింపు చేయాలని, స్పెషల్ పే లు పెంచాలని, పెన్షన్ రాయితీలు వంటి విషయంలో మన ప్రతిపాదనలకు ఫలితం వచ్చింది. ముఖ్యంగా ఉపాధ్యాయుల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించి ఉపాధ్యాయుల వేతనాలు షెడ్యూల్-2లో పేర్కొని ప్రారంభ వేతనాలు రెండు, మూడు పై స్టేజిలలో ఉంచడం వలన ఆయా కేడర్ల జూనియర్లకు, కొత్తగా చేరే వారికి మంచి ప్రయోజనం కలిగింది. ఉపాధ్యాయ నియామకాలలో అప్రెంటిస్ వ్యవస్థ రద్దు చేయాలని, ఈ సర్వీసును పెన్షన్‌కు అనుమతించాలని, ఎయిడెడ్ వ్యవస్థను రక్షించాలని సిఫారసు చేయడం హర్షణీయం.

ఫిట్‌మెంట్ కనీసం 40 శాతం సాధించాలని, జులై 2009 నుండి ఆర్థిక లాభం పట్టుపట్టాలని, సీనియర్లు ప్రయోజనార్థం ప్రతి మూడు సంవత్సరాలకు వెయిటేజి యివ్వాలని, అలవెన్సులు రెట్టింపు చేయాలని, ఇంటి అద్దె పెంపు, మెడికల్ రీయింబర్స్‌మెంట్ 3 లక్షలు పెంచి ఇన్సూరెన్స్ ప్రీమియం లేకుండా అమలు చేయాలనే డిమాండ్లపై గట్టిగా పట్టుపట్టాలని జేఏసికి చెప్పాము. జెఏసి ఎమ్మెల్సీల మధ్య వర్తిత్వంతో 39 శాతం ఫిట్‌మెంట్ 2/10 నుండి ఆర్థిక లాభం సాధించడం జరిగింది.

అప్రెంటిస్ సర్వీసు పెన్షన్‌కు లెక్కించాలనే సిఫారసులకు అనుగుణంగా వచ్చిన 178 జి.ఓ.తో రెండు సంవత్సరాల సర్వీస్ పెన్షన్ లెక్కింపుకు వచ్చింది. 2002 అక్టోబర్ డిఎస్‌సి వారికి పాత పెన్షన్ వచ్చింది. స్పెషల్ విద్యావాలంటీర్లకు కూడా ఈ సదుపాయం వర్తింపు కోసం కృషి జరుగుతుంది. అప్రెంటిస్ రద్దు కోసం ఫైలు నడుస్తున్నది.

జెఏసి ఒప్పందానికి అనుగుణంగా గ్రాట్యూటీ 1 లక్షకు పెంపు, ఇంటి అద్దె 2 శాతం పెంపుదల, మెడికల్ రీయింబర్స్‌మెంట్ 10% కోత నిలుపుదల చేస్తూ ఉత్తర్వులు వెలువడ్డాయి. పీఆర్‌సీ సిఫారసుల మేరకు మరికొన్ని ఉత్తర్వులు వచ్చాయి. **మొత్తం మీద 9వ పీఆర్‌సీ రాష్ట్ర పీఆర్‌సీల చరిత్రలో ఎన్నడగిన పీఆర్‌సీగా ఉంటుంది.**

## ఐక్య ఉద్యమాలు

**జెఏసి కార్యక్రమాలు** ఈ కాలంలో జరిగిన జెఏసి సమావేశాలు, నిర్ణయాలు, పోరాటాలలో రాష్ట్ర జెఏసితో నిత్య సంబంధాలు కొనసాగించాము. చర్చలు, నిర్ణయాలలో చురుగ్గా పాల్గొనడం జరిగింది. జిల్లాలలో కూడా గతంకంటే చురుగ్గా జెఏసి కార్యక్రమాలలో మన సంఘం తరపున పాల్గొనడం జరిగింది.

**మే 28 జెఏసి సెక్రటేరియట్**, 29న కార్యవర్గ సమావేశాలు జరిగాయి. జెఏసి నిర్ణయాల మేరకు 11.06.2009న సికింద్రాబాద్ హరిహర కళాభవన్‌లో ముఖ్యమంత్రిగారికి అభినందన సభ జరిగింది. ఎన్. నారాయణ స్వాగతోపన్యాసం చేయగా గోపాలరెడ్డి, స్వామిగౌడ్ కొన్ని ముఖ్య సమస్యలు సిఎం ముందు ప్రస్తావించారు. సంక్షేమ కార్యక్రమాలకు ఒక రోజు మూల వేతనం విరాళంగా ప్రకటించడం జరిగింది. నాణ్యమైన పీఆర్‌సీ ఇస్తామని, హెల్త్ కార్డులు ప్రవేశ పెడతామని, ఇళ్ల స్థలాలు పెన్షనర్లతో సహా అందరికి యిస్తామని ప్రకటించారు.

**జెఏసి ఆధ్వర్యంలో 2009 ఆగస్టు 27** నాడు జిల్లా కలెక్టరేట్ ఎదుట భోజన విరామ సమయంలో నల్లబ్యాడ్జీలతో నిరసన కార్యక్రమం చేయాలని పిలుపునివ్వడం జరిగింది. హైదరాబాద్‌లో ఎన్. నారాయణ, అనంతపురంలో ఐ. వెంకటేశ్వర రావు పాల్గొన్నారు. అధిక ధరలు తగ్గించాలని, ఖాళీ పోస్టులు భర్తీ చేయాలని, పీఆర్‌సీ రిపోర్టు తెప్పించి అమలు చేయాలని, 2/1994 యాక్టు రద్దు చేయాలనే తదితర ప్రధాన డిమాండ్లపై ఈ కార్యక్రమం జరిగింది.

**పీఆర్‌సీ కమీషనర్‌తో జెఏసి చర్చలు 2009 మే 30,31** 9వ వేతన సంఘం కమీషనర్ సిఎస్. రావు బృందంతో జెఏసి నాయకత్వంతో జరిగిన చర్చలలో మన సంఘం నుండి ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వరరావు,

సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, సిహెచ్. రవి, ఎం. సంయుక్త పాల్గొన్నారు. 3వ కేటగిరీ ఉపాధ్యాయులకు గత రెండు పీఆర్‌సీలలో జరిగిన అన్యాయం సవరించాలని, ఎస్‌సిఎ అలవెన్సు, ప్రసూతి సెలవు, మహిళలకు ఎడ్యుకేషన్ లీవు, స్పెషల్ అలవెన్సులు ఇతర అంశాలపై మరోసారి వివరించడం జరిగింది. కేంద్ర ప్రభుత్వ 6వ వేతన నివేదికలో రాష్ట్ర ఉద్యోగులకు ఉపయోగపడే అంశాలు ప్రతిపాదించాలని కోరడం జరిగింది.

**రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు హెల్త్ కార్డులు** అమలు చేయటం గురించి జెఏసి మరియు పీఆర్‌సీ, ఇతర అధికారులతో 02.09.2009న సెక్రటేరియట్ సమావేశం జరిగింది. ప్రీమియం చెల్లింపు లేకుండా హెల్త్ కార్డులు ఇవ్వాలని జెఏసి నిర్ణయంగా చెప్పడం జరిగింది.

**వై.ఎస్.ఆర్. సంతాప సభ** రాష్ట్ర జెఏసి ఆధ్వర్యంలో 04.09.2009 హైదరాబాద్ రవీంద్రభారతిలో దివంగత నేత వై.ఎస్.ఆర్. సంతాప సభ జరిగింది. ముఖ్యమంత్రి కె. రోశయ్య ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

**పీఆర్‌సీ** ఇతర డిమాండ్ల సాధన కోసం రెండు దశల పోరాట కార్యక్రమం జరిగింది. 22.12.2009 తాలూకా, జిల్లా రాష్ట్ర స్థాయిలో రోజంతా ధర్నాలు జరిగాయి. 06.01.2010 సామూహిక సెలవు పెట్టి మూడు అంచెలలో ర్యాలీలు జరిగాయి. ఈ పోరాటాలలో జిల్లాలలో మన సంఘం తరపున గతంకంటే మెరుగ్గా పాల్గొనడం జరిగింది.

**22.12.2010న రాష్ట్ర కేంద్రంలోనూ** జిల్లా తాలూకా కేంద్రాలలో జరిగిన ధర్నాల్లో మన సంఘం తరపున పెద్ద సంఖ్యలో పాల్గొన్నాము.

**జెఏసి - పీఆర్‌సీ** 9 పే రివిజన్ ప్రతిపాదనలు తయారీలోను, పీఆర్‌సీ కమీషనర్‌తో మరియు రిపోర్టు ప్రభుత్వానికి సమర్పించిన తర్వాత అమలుకు సంబంధించి ఆఫీసర్స్ కమిటీతోను, ముఖ్యమంత్రితోను జరిగిన చర్చలలో చురుగ్గా పాల్గొన్నాము. పీఆర్‌సి సిఫారసులలో ఉపాధ్యాయులకు సంబంధించిన సానుకూల అంశాలను హర్షించాము. సీనియర్లకు జరిగిన నష్టం నివారించాలని, ప్రతి మూడు సంవత్సరాల సర్వీసుకు వెయిటేజి యివ్వాలని, అలవెన్సులు నూరు శాతం రెట్టింపు చేయాలని, గ్రామీణ ప్రాంతాల ఇంటి అద్దె 15 శాతం పెంచాలని, ఇన్సూరెన్స్ ప్రీమియంతో సంబంధంలేని హెల్త్‌కార్డు పథకం అమలు చేయాలని, గత పీఆర్‌సి కమ్యూటేషన్ విలువ యథాతథంగా కొనసాగించాలని, స్పెషల్ విద్యావాలంటీర్లకు పెన్షన్ వర్తింపు చేయాలని, ఎయిడెడ్ యాక్ట్ రద్దు వంటి ముఖ్య సమస్యలు ఆఫీసర్స్ కమిటీతో జరిగిన చర్చలలో ప్రస్తావించడం జరిగింది. అదే విధంగా జెఏసి చార్టర్ ఆఫ్ డిమాండ్స్‌లో పెట్టించడం జరిగింది. ముఖ్యమంత్రితో చర్చలు జరుగుతున్న సందర్భంలో 40% కంటే తగ్గరాదని ఆర్థిక లాభం 7/09 నుండి రాబట్టేదానికి నిలబడాలని మన అభిప్రాయంగా చెప్పాము. జెఏసి కోరికమేరకు ఎమ్మెల్సీలు సిఎంతో చర్చించడం జరిగింది. జెఏసి మరియు ఎమ్మెల్సీలు చేసిన చివరి ప్రయత్నంలో భాగంగా 39% ఫిట్‌మెంట్ సాధించడం జరిగింది.

**జెఏసీ మౌన ప్రదర్శనలు 14.07.2010న** నోటికి నల్లగుడ్డ కట్టుకొని రాంనగర్ చౌరస్తా నుండి సుందరయ్య పార్క్ వరకు ర్యాలీ జరిగింది. "ఉద్యోగులు మౌనం పాటిస్తే ప్రభుత్వానికి అరిష్టమని" మంత్రివర్గ ఉపసంఘం నోరు తెరచి జెఏసీతో చర్చలు జరపాలని యుటియఫ్ తరపున ప్లేకార్డ్స్ ప్రదర్శించాము. రాష్ట్ర నాయకులతోపాటు హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల కార్యకర్తలు పాల్గొన్నారు.

**2010 సెప్టెంబర్ 1 నుండి 15 వరకు జెఏసి బస్సు యాత్రలు** సెప్టెంబర్ 25 చలో హైదరాబాద్ లక్షలాదిమందితో జరిపేదానికి సన్నద్ధంగా 1 నుండి 15 వరకు జరిగిన బస్‌యాత్రలో మన సంఘం తరపున కార్యకర్తలు, ఉపాధ్యాయులు ఆయా జిల్లాలలో పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. కోస్తా రాయలసీమ జిల్లాల యాత్రలో ఐ. వెంకటేశ్వర రావు, తెలంగాణ జిల్లాల్లో జరిగిన యాత్రలో ఎన్. నారాయణ పాల్గొన్నారు.

**2010 అక్టోబరు 8 నుండి 16 తేది వరకు ఇందిరాపార్క్‌వద్ద నిరాహారదీక్షలు** ఈ సందర్భంగా 10వ తేదీన మన సంఘం, పబ్లిక్ సెక్టార్ ఎంప్లాయిస్, ఇరిగేషన్ సంఘాలు దీక్షలలో పాల్గొన్నాయి. 16వ తేదీన ప్రత్యేకంగా వెయ్యిమందికిపైగా మహిళలు దీక్షలలో పాల్గొన్నారు. మన సంఘం నుండి 100మంది పాల్గొని మన ప్రత్యేకతను ప్రదర్శించాము.

**23.11.2010 జెఏసి చలో హైదరాబాద్** లక్షలాదిమందితో జరిగింది. యుటియఫ్ కార్యాలయం నుండి ర్యాలీగా వేలాదిమందితో వెళ్ళాము. 6941 మంది పాల్గొన్నారు. ఎటుచూసినా యుటియఫ్ జెండాలు కార్యకర్తలతో సంఘం ప్రత్యేకత, క్రమశిక్షణా ప్రస్ఫుటమైంది. వక్తలందరూ ప్రభుత్వ దుర్మార్గాన్ని తీవ్రంగా నిరసించి భవిష్యత్ కార్యచరణకు పిలుపునిచ్చారు.

**2011 జనవరి 19,20,21 తేదీలలో** జెఏసీ పిలుపు మేరకు "పెన్,చాక్,టూల్ డౌన్" కార్యక్రమాలు అమలు జరిగాయి. భోజన విరామ సమయంలో నిరసన ప్రదర్శనలు చేశాము. జెఏసి నాయకత్వాన్ని చర్చలకు పిల్చి సమస్యలు పరిష్కరించాలని హెచ్చరించడం జరిగింది.

**23.01.2011 ప్రభుత్వంతో జెఏసీ ఒప్పందం** ఈ కాలంలో జెఏసీ తరపున చేసిన సుదీర్ఘ పోరాట ఫలితంగా 23.01.2011న జరిగిన ఒప్పందం మంచి విజయం. గ్రామీణ ప్రాంతాల ఇంటి అద్దె 10 నుండి12%, పట్టణ ప్రాంతాల ఇంటి అద్దె 12.5 నుండి 14.5% పెంపు, ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమ్ ఫ్రీక్వెన్సీని 6/12/18/24 సంవత్సరాలకు మార్చడం, ఎస్‌సి,ఎస్‌టి అన్‌ట్రైన్డ్ మరియు స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు అలాగే అప్రెంటిస్ వ్యవస్థ రద్దుకు ఒప్పించి అగ్రిమెంట్‌లో చేర్పించడం, గ్రాట్యూటీ లక్ష పెంపు, హెల్త్‌కార్డులకు అంగీకారం, మహిళల హిస్టెరెక్టమీ అపరేషన్‌కు 45 రోజుల ప్రత్యేక సెలవు సాధించడం మంచి విజయాలు. ఖాళీ పోస్టుల భర్తీ, కాంట్రాక్ట్ ఉద్యోగుల రెగ్యులరైజేషన్‌పై స్పష్టమైన హామీ ఇవ్వలేదు. జెఏసీ ఒప్పందం మంచి ఫలితాలు-పరిమితులు పేరుతో కరపత్రం వేసి పంచాము.

**2010 సెప్టెంబర్ 7 అఖిల భారత సమ్మె** కేంద్ర కార్మిక సంఘాలు ఇచ్చిన పిలుపుమేరకు యుపిఏ-2 సర్కారు అనుసరిస్తున్న ప్రజావ్యతిరేక విధానాలపై జరిగిన అఖిలభారత సమ్మెలో మన సంఘం తరపున చైతన్యవంతంగా పాల్గొన్నాము. ధరల పెరుగుదల అరికట్టాలని, కార్మిక చట్టాలు సక్రమంగా అమలు చేయాలని ఇతర డిమాండ్లపై జరిగిన ఈ సమ్మెలో రాష్ట్ర కేంద్రంలోను, జిల్లా కేంద్రాలలో జరిగిన నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు.

**ప్రపంచ ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య(డబ్ల్యుఎఫ్‌టియు)** 17వ మహాసభ 2010 డిసెంబర్ 26,27,28 తేదీలలో బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలో జరిగింది. 220 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. ఎస్‌టిఎఫ్ఐ తరపున 14 మంది పాల్గొన్నారు. మన సంఘం నుండి సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, ఎన్. నారాయణ పాల్గొన్నారు.

**అఖిలభారత రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల సమాఖ్య** స్వర్ణోత్సవ మహాసభలు అక్టోబరు 5,6,7 తేదీలు విజయవాడలో జరిగాయి. మహాసభ ప్రారంభ సమావేశంలో మన సంఘం తరపున సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, ఎన్. నారాయణ హాజరై సందేశం ఇచ్చారు.

## అఖిల భారత ఉపాధ్యాయ ఉద్యమం (ఎస్‌టిఎఫ్ఐ)

**ఎస్‌టిఎఫ్ఐ సమావేశాలు** 2009 జులై 25,26 తేదీలలో ఎస్‌టిఎఫ్ఐ సెక్రటేరియట్, కార్యవర్గ సమావేశాలు ఢిల్లీలో కేరళ భవన్ నందు జరిగాయి. ఈ సమావేశాలకు ఐ. వెంకటేశ్వర రావు, సిహెచ్. రవి హాజరయ్యారు. ఈ సందర్భంగా 25వ తేదీన కేంద్ర మానవ వనరుల శాఖామంత్రి కపిల్ సిబాల్‌కు విద్యాహక్కు బిల్లు, విద్యారంగ సంస్కరణలు, మధ్యాహ్న భోజన పథకం ఇతర సమస్యలపై ప్రతినిధి వర్గం మెమోరాండమ్ సమర్పించి చర్చించడం జరిగింది. కేరళలో అంతర్జాతీయ ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా అక్టోబర్ 3,4 తేదీలలో సమావేశాలు, 5వ తేదీన జాతీయ సెమినార్ నిర్వహించాలని, ఎస్‌టిఎఫ్ఐ కేంద్ర కార్యాలయాన్ని ఢిల్లీలో ఏర్పాటు చేసేదానికి నిధులు సమీకరించాలని పిలుపు యివ్వడం జరిగింది.

**ఎస్‌టిఎఫ్ఐ** సెక్రటేరియట్, కార్యవర్గం, కౌన్సిల్ సమావేశాలు కేరళ తిరువనంతపురంలో 2009 అక్టోబర్ 4,5 తేదీల్లో జరిగాయి. 5వ తేదీ సాయంత్రం విద్యా సదస్సు జరిగింది. ఈ సందర్భంగా కేరళ విద్యాశాఖామంత్రి ఎం.ఏ.బేబిగారిని యుటియఫ్ ప్రతినిధి వర్గం కలుసుకోవడం జరిగింది. కేరళ ఐటి స్కూల్స్, డైరెక్టరేట్‌ను, కొన్ని పాఠశాలలను సందర్శించటం జరిగింది. ఎస్‌టిఎఫ్ఐ సెక్రటేరియట్ సమావేశం 13.11.2009న ఢిల్లీలో జరిగింది. భవన నిధి కోటాగా మన సంఘం మొదటి వాయిదాగా 5 లక్షలు చెల్లించాము.

**ఎస్‌టిఎఫ్ఐ నిరసన వారం** విద్యారంగ సమస్యల పరిష్కారం కోరుతూ భారత పాఠశాలల ఉపాధ్యాయ సమాఖ్య డిసెంబరు 2 నుండి 8 వరకు నిరసన వారంగా నిర్వహించాలని నిర్ణయించింది. విద్యాహక్కు బిల్లులోని లోపాలు సవరించాలని 18 సంవత్సరాలలోపు బాలబాలికలందరికీ ఉచిత నిర్బంధ విద్య అందించాలని, ప్రాథమిక పాఠశాలల్లో ప్రతి తరగతికి ఒక టీచరు నియమించాలని, బియ్యం ప్రాథమిక విద్యార్థులకు 150, ఉన్నత పాఠశాలల విద్యార్థులకు 200 గ్రాములు కేటాయించాలని, విధాన పరిషత్ ఎన్నికల్లో ప్రాథమిక ఉపాధ్యాయులకు ఓటు హక్కు కల్పించాలని పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యం పేరిట విద్యారంగ ప్రైవేటీకరణ ప్రయత్నాలు విరమించాలని తదితర సమస్యలపై మండల కేంద్రాలలో ర్యాలీలు నిర్వహించాలని పిలుపు ఇచ్చాము. జిల్లాలలో ఈ కార్యక్రమం నామమాత్రంగానే జరిగింది.

**జాతీయ విద్యాసదస్సు 13.08.2010** ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించాలని కేంద్రీకరణ, ప్రైవేటీకరణ, వ్యాపారీకరణ నిలువరించాలని ప్రధాన నినాదాలతో జాతీయ ఉద్యమంగా 15 సంఘాలతో ఏర్పడింది. ఈ సంఘాల ఆధ్వర్యంలో 13.08.2010న న్యూఢిల్లీలోని మౌలంకర్ హాలునందు జాతీయ విద్యా సదస్సు జరిగింది. యుపిఏ-2 ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యా వ్యతిరేక విధానాలను సదస్సు నిరసించింది. ఈ సదస్సులో మన సంఘం నుండి 30మంది పాల్గొన్నాము. విద్యారంగానికి సంబంధించి 14 డిమాండ్లతో తీర్మానం రూపొందించి 2010 డిసెంబర్ 2న ఢిల్లీలో ప్రదర్శన నిర్వహించాలని తీర్మానించింది.

**డిసెంబర్ 2 "చలో పార్లమెంట్"** విద్యారంగాన్ని రక్షించాలి, అభివృద్ధి చేయాలని, కేంద్ర ప్రభుత్వ విద్యా వినాశకర విధానాలను ప్రతిఘటించే లక్ష్యంతో ఢిల్లీలో పెద్ద ర్యాలీ, పార్లమెంటు సమీపంలో బహిరంగసభ జరిగింది. ఎస్‌టిఎఫ్ఐ తదితర 15 జాతీయ ఉపాధ్యాయ, విద్యార్థి, యువజన సంఘాల ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో వేలాదిమంది పాల్గొన్నారు. యుటియఫ్ నుండి ఉపాధ్యాయులు కుటుంబ సభ్యులతో సహా మొత్తం 381మంది పాల్గొన్నారు. పశ్చిమగోదావరి జిల్లా నుండి 124, ఖమ్మం జిల్లా నుండి 108, నల్గొండ జిల్లా నుండి 43, మహబూబ్‌నగర్ జిల్లా నుండి 35, వరంగల్ జిల్లా నుండి 22, మెదక్ జిల్లా నుండి 20, తూర్పుగోదావరి జిల్లా నుండి 25, రాష్ట్ర కేంద్రం నుండి 3, విశాఖపట్నం నుండి 1 పాల్గొన్నారు. వారందరికీ యుటియఫ్ రాష్ట్ర కమిటీ తరపున ప్రత్యేక అభినందనలు తెలుపుతున్నాము. పాల్గొన్న వారు 7 జిల్లాల నుండే అయినా మంచి ప్రభావం కల్గించారు. దేశ రాజధానిలో యుటియఫ్ ప్రత్యేకతను నిలబెట్టారు. ఇంత ప్రాధాన్యత కల్గిన "చలో ఢిల్లీ" కార్యక్రమాన్ని చాలా జిల్లా శాఖలు నిర్లక్ష్యం చేయటం చాలా అన్యాయం.

## ముఖ్యమైన సందర్భాలలో యుటియఫ్ వైఖరి

1. పాఠశాల విద్యను రెండు ముక్కలుగా విభజన చేస్తే మంత్రులు, అధికారుల కోసమే తప్ప విద్యారంగానికి ఉపయోగం లేదని, పైగా అనేక నష్టాలు ఎదురౌతాయని ప్రభుత్వ చర్యను వ్యతిరేకించాము.
2. ఉద్యోగులు నిర్వహించే ఆందోళన పోరాట కార్యక్రమాలపై క్రమశిక్షణ చర్యలు ప్రకటిస్తూ విడుదల చేసిన 177 జి.ఓ.ను 13.04.2011 రద్దు చేయాలని డిమాండ్ చేశాం, నిరసన ప్రదర్శనలు చేశాం.
3. 10వ తరగతి పరీక్ష కేంద్రాలలో ఉన్నత పాఠశాలలకు సెలవులు ప్రకటించడాన్ని వ్యతిరేకించాము. క్లాసులకు నష్టం కలుగరాదని మధ్యాహ్న భోజనం లేకుండా చేయడం సరికాదని చెప్పాము.
4. ఉపాధ్యాయ నియామకాల కోసం ఉపాధ్యాయుల అర్హత పరీక్ష (టిఇటి) నిర్వహించాలని జాతీయ ఉపాధ్యాయ శిక్షణా మండలి (ఎన్‌సిటిఇ) ఆదేశాలు యివ్వడాన్ని వ్యతిరేకించాము.
5. ప్రవర్తనా నియమావళి పేరుతో జాతీయ ఉపాధ్యాయ మండలి రూపొందించిన 'కోడ్ ఆఫ్ నేషనల్ ఎథిక్స్ ఫర్ స్కూల్ టీచర్సు' పైన మన సంఘం అభ్యంతరం తెలుపుతూ సూచనలు చేశాము.
6. అడ్‌హాక్ రూల్స్‌తో ఎంఇఓ పోస్టులు భర్తీ చేయాలని, ఎంఇఓ పోస్టులను టెన్యూర్ పోస్టులుగా పరిగణించి సీనియర్ స్కూల్ అసిస్టెంట్స్‌ను ఎంఇఓలుగా నియమించాలని ప్రతిపాదించాము.
7. డిఎస్‌సి 2008 ఎస్‌జిటి పోస్టుల భర్తీ విషయంలో బిఇడి, డిఇడి వివాదంలో 70:30 శాతంలో భర్తీ చేయడమే పరిష్కారమని చెప్పాము. దీని కారణంగా బిఇడి అభ్యర్థులలో ఉద్యోగాలు కోల్పోయే వారికి న్యాయం చేయాలని డిమాండ్ చేశాము.
8. ఉద్యోగుల ఆరోగ్య భీమా పథకం వర్తింపు చేయడంలో ప్రీమియం చెల్లింపు, మొత్తం కుటుంబానికి సంవత్సరానికి 2 లక్షల సీలింగ్, ప్రైవేట్ ఎల్‌ఐసితో ఒప్పందం వంటి ప్రభుత్వ ప్రతిపాదనలకు అభ్యంతరం తెలియజేశాము.
9. కపిల్ సిబాల్ 100 రోజుల విద్యా ప్రణాళికలో పదో తరగతి పరీక్షా బోర్డులను ఎత్తివేయాలనే కేంద్రమంత్రి సూచనకు అభ్యంతరం తెలియజేశాము. పదో తరగతి సర్టిఫికెట్ వృత్తి విద్యా కోర్సులలో చేరడానికి క్రింద స్థాయి ఉద్యోగాలకు ప్రామాణికంగా ఉపయోగపడుతుందని చెప్పాము.
10. కౌన్సిలింగ్ విధానానికి తూట్లు పొడుస్తూ సెక్రటేరియట్ నుండి చేసే ఉపాధ్యాయుల దొడ్డిదారి బదిలీలు నిలుపుదల చేయాలని డిమాండ్ చేశాము. ఈ విధమైన బదిలీలు నిలుపుదల చేయాలని పిడిఎఫ్ ఎమ్మెల్సీలు గతంలో ఒకసారి, 05.05.2011 తేదీన మరోసారి ముఖ్యమంత్రికి ప్రాతినిధ్యం చేశారు.

## ప్రోగ్రెసివ్ డెమోక్రటిక్ ఫ్రంట్ (పిడిఎఫ్)

మన ఉద్యమ ప్రతిష్టకు, విస్తృతికి పిడిఎఫ్ ఒక దర్పణం. నేడు శాసనమండలిలో ముగ్గురు టీచర్ల ఎమ్మెల్సీలు, అయిదుగురు పట్టభద్రుల ఎమ్మెల్సీలు మనకున్నారు. మొత్తం 16 మందిలో 8 మంది అంటే సగం మనమన్నమాట. శాసన మండలిలో 19 జిల్లాలకు మన ప్రాతినిధ్యం వుంది.

మన ఎమ్మెల్సీలు ప్రధానంగా విద్యారంగంలో అపార అనుభవం గలవారు. ఉద్యమ నిర్మాణంలోనూ రాటుదేలిన వారు. నీతి నిజాయితీలకు నిలువుటద్దంలాంటివారు. వీరెవరూ స్వంత డబ్బు ఖర్చు పెట్టిగానీ, ఎన్నికల్లో సీటు కోసం ఓటు కోసం కాసులు వెదజల్లిన వారు గానీ కాదు. కేవలం మన ఉద్యమ బలంతో, కార్యకర్తల కఠోర శ్రమతో, ఉపాధ్యాయుల ఉద్యోగుల ప్రేమాభిమానాలతో గెలిచిన వారు. ఉపాధ్యాయ ఉద్యమం ఇతర రంగాల ఉద్యోగ వర్గాల్ని, అసంఘటితంగా వున్న పట్టభద్రుల్ని, మధ్యతరగతి మేధావుల్ని కూడా కూడగట్టి ప్రత్యామ్నాయ రాజకీయాల్ని, రాజకీయ సంస్కృతిని ముందుకు తెచ్చి లక్షలాదిమంది ఓటర్లుగాగల నియోజకవర్గాల నుంచి ఎన్నికల్లో గెలవడం చరిత్రలోనే అపూర్వం. ఇది మన సంఘానికి మాత్రమే దక్కిన గౌరవం.

మన ఎమ్మెల్సీల్లో ఇద్దరికి రెండేళ్ళకే పదవీ కాలం ముగిసింది. ఆయినా వారిద్దరు, మరింత మెజారిటీలతో మళ్ళీ గెలిచారు. మరి ముగ్గురికి నాలుగేళ్ళకు పదవీ కాలం ముగిందీ. ఈ మూడు స్థానాల్లోనూ అఖండ మెజార్టీలతో మళ్ళీ మన అభ్యర్థులు గెలిచారు. పిడిఎఫ్ సభా నాయకుడిగా అత్యంత ఆదర్శంగా వ్యవహరించిన శ్రీ రామిరెడ్డి గారు మన ఉద్యమ నిర్మాత. వారు శాసనమండలికి వీడ్కోలు పలికారు. ఇందులోనూ ఒక ఆదర్శాన్ని చూపించారు.

ప్రాథమిక టీచర్లకు ఉపాధ్యాయ శాసనమండలి ఎన్నికల్లో ఓటు హక్కు వుండాలని మనం చిరకాలంగా కోరుతున్నాం. కానీ పట్టభద్రుల శాసనమండలి ఎన్నికల్లో మనం పాల్గొనడం ద్వారా దాన్ని పరోక్షంగా సాధించుకొన్నట్లయింది.

శాసనమండలి ఎన్నికల్లో పాల్గొనడం, గెలవడం ద్వారా మన ప్రతిష్ట పెరగడంతో పాటు మనమొక రాజకీయ కర్తవ్యం కూడా నిర్వహించిన వారమయ్యాం. ప్రపంచ బ్యాంకు విధానాలను, సరళీకరణ పాలసీలకు ఉద్యోగ ఉపాధ్యాయ వ్యతిరేక ధోరణులకు, ప్రభుత్వ వ్యవస్థల నిర్మూలనకు కంకణం కట్టుకొన్న కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల వైఖరుల్ని వామపక్ష ప్రజాస్వామ్య ఉద్యమాలు గత రెండున్నర దశాబ్దాలుగా తీవ్రంగా ప్రతిఘటిస్తూ వస్తున్నాయి. ప్రత్యామ్నాయ విధానాల్ని ముందుకు తెస్తూ వచ్చాయి. ఈ ఎన్నికల్లో మన అభ్యర్థులు గెలుపు ఈ ఉద్యమానికి రాజకీయ విజయంగా పరిగణించాల్సి వుంటుంది. అలాగే ఎన్నికలంటే ధన ప్రవాహాలకీ, కులమత ప్రాంతీయ దురభిమానాల్ని రెచ్చగొట్టే చర్యలకు విసిగి విరక్తిచెంది రాజకీయాలకు దూరమవుతున్న మధ్య తరగతి వర్గాన్ని ప్రత్యామ్నాయ రాజకీయాలవైపు మళ్ళించగల్గడం కూడా ఈ ఎన్నికల ప్రత్యేకత. అత్యంత సామాన్యులు కోట్లకు పడగలెత్తిన వారిని ఓడించడం ప్రస్తుత సామాజిక సందర్భంలో ఒక ఆశారేఖ.

**పిడిఎఫ్ ఎమ్మెల్సీల కృషి** ఈ నాలుగేళ్ళలో మన ఎమ్మెల్సీలు విద్యారంగంలో వస్తున్న ప్రతి ప్రజావ్యతిరేక ధోరణినీ ప్రతిఘటించారు. సిబిఎస్ఇ సిలబస్ కావచ్చు. అప్రెంటిస్ విధానం కావచ్చు. ఇంటర్మీడియేట్ విద్య కావచ్చు. అడ్‌హాక్ పద్ధతిన ప్రమోషన్లు కావచ్చు. ఇలా ప్రతి సందర్భంలోనూ జోక్యం చేసుకొన్నారు. ఉపాధ్యాయుల సమ్మెలోనైనా, పే రివిజన్ కమిటీ సిఫార్సుల్లోనైనా మన ఎమ్మెల్సీల ప్రమేయం అద్భుతమైంది. ప్రాథమిక విద్యారంగం, పాలిటెక్నిక్ విద్య, హైస్కూళ్ళు అన్నింటినీ యూనివర్సిటీలు మన ఎమ్మెల్సీలు అధ్యయనం చేశారు. ఆయా అధ్యాపకులకు అండగా నిలబడ్డారు. అవసరమైన చోట స్వయంగా ఆర్గనైజ్ చేశారు. ఉద్యమాలు నిర్మించి పోరాటాలకు ప్రత్యక్ష నాయకత్వం వహించారు. ప్రధానంగా ఎయిడెడ్ విద్యా సంస్థల పట్ల నేడు ప్రభుత్వం సానుకూల దృక్పథం ప్రదర్శిస్తోందంటే దీనికి మన ఎమ్మెల్సీల కృషేకారణం. శాసనమండలిలో సమర్థవంతంగా ఒకవైపు మేధావులుగా గుర్తింపు పొందుతూనే ఉద్యమాలకు బాసటగా నిలబడ్డారు. ప్రతిదాన్ని ప్రస్తావించనవసరం లేదుగానీ మనం సాధించిన ప్రతి విషయంలోనూ మన ఎమ్మెల్సీల పాత్ర ఎంతైనా వుంది.

మన ఎమ్మెల్సీల చొరవతో ఉన్నత విద్యారంగం, గురుకుల పాఠశాలలు, పాలిటెక్నిక్‌లు కూడా ఉద్యమబాట పట్టాయి. సంఘటిత పడ్డాయి. విస్తృత ఐక్యత సాధించాయి. ఫలితంగా నేడు మొత్తం విద్యారంగంలోనే ఒక విశాల ఐక్యత అధ్యాపకుల మధ్య ఏర్పడింది.

కాంట్రాక్టు అధ్యాపకుల ఉద్యమం నేడు ఉన్నత విద్యారంగంలో ఇంత విస్తృతమయ్యేందుకు మన ఎమ్మెల్సీలే చోదకులంటే అతిశయోక్తి కాదు. ఈ కాలంలో అనేక రంగాల ఉద్యోగులతో, ఉద్యోగ సంఘాలతో మనకు మంచి స్నేహం ఏర్పడింది. పట్టభద్రుల ఎమ్మెల్సీ ఎన్నికల్లో మరింత బలపడింది. మన ఎమ్మెల్సీలు విద్యారంగానికే పరిమితమైన వారు కాదు. లక్షలాది కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్‌ల ఉద్యోగులతోపాటు, ఎల్ఐసి, బ్యాంకులు, వివిధ కార్యాలయాల సంస్థల ఉద్యోగులకు కూడా తోడుగా నిలబడ్డంతో రాష్ట్రంలో ఇప్పుడొక బలీయమైన మధ్యతరగతి ఉద్యమానికి పునాది ఏర్పడింది. ఇది ప్రధానంగా మన ఎమ్మెల్సీల కృషి ఫలితం.

అలాగే మన ఎమ్మెల్సీలెవరూ ఉద్యమాలకు ప్రత్యామ్నాయాలుగా, అతీతులుగా భావించే వారు కాదు. ఉద్యమాలకు సహకారులుగా, అంతర్భాగాలుగా మాత్రమే వ్యవహరిస్తున్న వారు. ఇది ఇతర ఎమ్మెల్సీలతో పోలిస్తే చాలా భిన్నమైన ప్రవృత్తి, పైరవీలకు, పాలక వర్గ రాజకీయాలకు, పాదాభివందనాలకు మన ఎమ్మెల్సీలు ఎంత దూరంలో వుంటారో అందరికీ తెలుసు. ఉద్యమాలనుండి రావడం వల్లనే వీరికీ లక్షణాలు అబ్బాయి. తమ అలెవెన్సుల్ని సంఘాలకు లెక్క చెప్పడం, కోట్లాది విలువచేసే ఇంటి స్థలాల్ని తృణప్రాయంగా త్యజించడం, నిరాడంబరంగా జీవించడం కూడ ప్రజాస్వామ్య ఉద్యమాలనుంచే వారికి సంక్రమించాయి.

భవిష్యత్తులో మన ఉద్యమ విస్తృతికి మన ఎమ్మెల్సీల సహకారం ఎక్కువగా తీసుకోవాలి. చిన్న చిన్న పనుల్లో సతమతమవడం వల్ల లభించే ఫలితమేమీ వుండదు. ప్రభుత్వ పాఠశాలలు బలహీనంగా వున్నాయి. వీటిని బలోపేతం చేయడంలో, ప్రత్నామ్నాయాల్ని చూడడంలో మన ఎమ్మెల్సీలు ముందుండాలి.

సమిష్టిగా హైదరాబాదులో మరింత కేంద్రీకరించడం ద్వారా, మన సంఘంతో కలిసి ప్రాతినిధ్యాయులు చెయ్యడం ద్వారా మన ముద్ర స్పష్టంగా పడేలా వీరి కృషి వుండాలి. సన్మానాలకు, సత్కారాలకు వీలున్నంత దూరంగా వుంచి మన స్వంత నాయకులుగా, ఉద్యమ కార్యకర్తలుగా వీరిని మనం స్వంతం చేసుకోవాలి

చరిత్ర మనకిచ్చిన అవకాశాన్ని అణువణువూ ఉపయోగించుకొని విశాలమైన ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికోద్యమానికి బలమైన పునాది వేసేందుకు వీరి ప్రాతినిధ్యాల్ని ఉపయోగించుకోవాలి.

విద్య, ఆరోగ్యం, పర్యావరణంలాంటి విస్తృత సామాజికావసరాలైన రంగాల్లో మేధావుల పాత్రనూ, ఉద్యమ నాయకుల పాత్రనూ మన ఎమ్మెల్సీలు సమర్ధవంతంగా పోషించాలి. ఇంకా మనకు దూరంగా వెలుపలా ఎన్నో వర్గాలున్నాయి. ఎన్నో రంగాలున్నాయి. వీరిని మన దగ్గరికి తెచ్చుకోవడంలో మన ఎమ్మెల్సీలు ఒక చారిత్రక పాత్ర పోషించాలి.

మనం కూడా 8మంది ఎమ్మెల్సీలున్నారుగదా అన్న భ్రమల్లో కొట్టుకొని పోకుండా జాగ్రత్తపడాలి.

### పిడిఎఫ్ ఎమ్మెల్సీలు సాధించిన విజయాల్లో కొన్ని....

1. కృష్ణా, గోదావరి బేసిన్‌లో లభించిన గ్యాస్ రిలయన్స్ వారు మొత్తం దోచుకోరాదని ఆంధ్రప్రదేశ్‌కు తగిన వాటా రావాలని పెద్దఎత్తున ప్రచారం. సిఎం ను కలవడం, శాసన మండలిలో ఏకగ్రీవ తీర్మానం.
2. నల్లమల అడవుల్లోని చెంచుల దయనీయ స్థితిపై పరిశీలన, శాసనమండలిలో ప్రస్తావన ప్రతి కుటుంబానికి రూ. 500/- విలువైన ఆహారపు కిట్ పంపిణీ సాధన.
3. ఎయిడెడ్ విద్యా సంస్థలపై నిరంతర పోరాటం, ప్రభుత్వ వైఖరిలో మార్పు తెప్పించి ఆక్టు 37 సవరణ, జి.ఓ. 35 రద్దు తదితరాల సాధనలో ముందడుగు.
4. అసంఘటితరంగ కార్మికుల స్థితిగతులపై సిఐటియుతో కలిసి పరిశీలన కనీస వేతనాల జి.ఓ. ఎం.ఎస్.నం.3 సాధనకు కృషి.
5. గ్రేటర్, విశాఖల్లో 8 కి.మీ.లోపు ఉద్యోగ ఉపాధ్యాయులకు 20 శాతం హెచ్ఆర్ఏ సాధన.
6. ఉన్నత విద్యా రంగంలోని అన్ని సంఘాల్ని ఒక తాటి మీదకు తేవడం "ఉన్నత విద్యా పరిరక్షణా సమితి' ఏర్పాటు.
7. ఉన్నత విద్యా రంగంలోని కాంట్రాక్టు లెక్చరర్ల హక్కులపై పోరాటం-మినిమం స్కేలు సాధన-బలమైన సంఘ నిర్మాణం.
8. గురుకుల పాఠశాలలకు ఆర్ఎంఎస్ఏ వర్తింపజేయడం-గురుకుల సిఆర్‌టి రెగ్యులరైజేషన్, వేతనాల పెంపు, గురుకుల సంఘాల పోరాటాలకు మద్దతు.
9. విద్యాహక్కు చట్టం అమలుపై సిఎంతో భేటీ, రూల్సు తయారీలో కీలకపాత్ర.
10. సిబిఎస్ఇ సిలబసు తొలగింపుకై పోరాటం, సాధన.
11. ఆర్ఎంఎస్ఏ పథకం అమలులో క్రియాశీల జోక్యం, ప్రాధాన్యతా క్రమాన్ని నిర్దేశించడం.
12. సక్సెస్ స్కూల్సు, స్కూల్ అసిస్టెంట్లకు అడ్‌హాక్ పద్ధతిపై ప్రమోషన్స్‌కు ఒత్తిడి సాధన.
13. 2008లో 13 రోజుల ఉపాధ్యాయుల సమ్మె సందర్భంగా విస్తృతంగా జిల్లాల పర్యటన-చర్చలకు సిఎంను ఒప్పించడం - పైరవీల్ని ప్రతిఘటించడం.
14. శాసనమండలిలో ప్రతి ఏటా విద్యారంగంపై లఘుచర్చ.
15. డిఎస్‌సి 2008 నియామకాల్లో జోక్యం, కోర్టు తీర్పుకు లోబడి 70:30 ప్రాతిపదికన నియామకాల సాధన.
16. ప్రతి మాసం మొదటి వారంలో ఉపాధ్యాయుల ప్రమోషన్లు.

### మహిళా విభాగం

2009 ఫిబ్రవరిలో జరిగిన రాష్ట్ర 11వ మహాసభల్లో ఎం. సంయుక్త కన్వీనరుగా, డిఎల్. ప్రసన్నకుమారి కో-కన్వీనర్‌గా 9మంది సభ్యులతో మహిళా విభాగం ఏర్పాటైంది. చాలా జిల్లాల్లో మహిళా కమిటీలు ఏర్పడి పనిచేస్తున్నాయి. 2009లో అంతర్జాతీయ మహిళా దినోత్సవం 2010లో శత వసంత ప్రారంభోత్సవాలు, 2011లో శత వసంత ముగింపు ఉత్సవాలు రాష్ట్ర వ్యాప్తంగా ఘనంగా జరిపారు. వెల్లువెత్తిన ఉత్సాహంతో నిధి వసూళ్ళు, వివిధ అంశాల్లో పోటీలు నిర్వహించడం, మహిళా ఉన్నతాధికారులను, మహిళా సంఘం, వర్కింగ్ ఉమన్ నాయకులను ఆహ్వానించి సదస్సులు జరిపారు. ఖమ్మం, నల్లగొండ, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ప్రకాశం, గుంటూరు, ఆదిలాబాదు, హైదరాబాదు, రంగారెడ్డి, కృష్ణ, మహబూబ్‌నగర్, విజయనగరం జిల్లాలో కమిటీలు టీం స్పిరిట్‌తో పనిచేస్తున్నాయి. నెల్లూరు, చిత్తూరు, శ్రీకాకుళం, విశాఖ, మెదక్, నిజామాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో మహిళల కదలిక తక్కువగా ఉంది. కమిటీలు వెయ్యలేదు. వేసినా బాగా పనిచేయడం లేదు.

నిబంధనావళి మార్పుతో జిల్లా ప్రధాన బాధ్యులు ఐదుగురికి తోడు సహాధ్యక్షురాలిగా మహిళకు అవకాశం కల్పించడం మహిళా కార్యకర్తలకు ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది. అన్ని స్థాయిల్లో మహిళలను ఎన్నుకున్నారు.

2010లో మార్చి 8న హైదరాబాదులో రాష్ట్రస్థాయి సదస్సు జరిగింది. పాఠశాల విద్యా డైరెక్టరు శ్రీమతి పూనం మాలకొండయ్య ముఖ్య అతిథిగా వచ్చారు. మూడువందలమంది హాజరైనారు. మహిళా ఉపాధ్యాయుల శిక్షణా తరగతులను హైదరాబాదులో నిర్వహించాము. అకడమిక్ సెల్ కన్వీనరు ఎం.ఏ.కె.దత్, రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ, శ్రామిక మహిళా రాష్ట్ర కన్వీనరు కె. ధనలక్ష్మి, కార్యదర్శులు కె. విజయగౌరి, ఏ. నర్సిరెడ్డి, సిహెచ్. రవి, ఎం.సంయుక్త, డా॥ బాలాంబ వివిధ అంశాలపై తరగతులు బోధించారు. ఐ. వెంకటేశ్వర రావు క్లాసులను ప్రారంభించారు. ఈ సందర్భంగా మహిళలతో యుటిఎఫ్ కార్యాలయం నుండి ఇందిరాపార్కు వరకు ర్యాలీ నిర్వహించి మహిళా ఉపాధ్యాయ, ఉద్యోగులకు 2 సం॥ చైల్డ్ కేర్ లీవు, అత్తమామలను డిపెండెంట్సుగా గుర్తింపు, పాఠశాలల్లో మౌలిక వసతులు ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ఈ తరగతులకు వివిధ జిల్లాల నుండి 81 మంది టీచర్లు హాజరయినారు. నెల్లూరు, కరీంనగర్, చిత్తూరు, విశాఖ, శ్రీకాకుళం 5 జిల్లాల నుండి హాజరు లేదు.

జిల్లా స్థాయిలోనూ మహిళా విభాగాలు జిల్లా శాఖల సహకారంతో శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నారు. తూర్పు,పశ్చిమగోదావరి, ఖమ్మం, ప్రకాశం జిల్లాలు రెగ్యులర్‌గా నడుపుతున్నాయి. వివిధ స్థాయిల్లో ఎదుగుతున్న మహిళా కార్యకర్తలు క్యాంపెయిన్లలోనూ, ఆందోళనా-పోరాటాల్లోనూ ముందంజలో ఉంటున్నారు.

2011 మార్చి 8 అంతర్జాతీయ దినోత్సవాన్ని రాష్ట్ర వ్యాప్తంగా వివిధ స్థాయిల్లో జరిపారు. ఆరు నియోజకవర్గాల్లో ఎమ్మెల్సీ ఎన్నికలు

జరుగుతున్న కారణంగా, రాష్ట్ర జిల్లాల నాయకత్వం అంతా ఎన్నికల పనిలో ఉండడంతో రాష్ట్ర, కేంద్రం హైదరాబాదులో రాష్ట్ర స్థాయిలో మహిళా దినోత్సవం జరపలేకపోయాము. యుటియఫ్, ఐద్వా, వర్కింగ్ ఉమన్ ఉమ్మడిగా సదస్సులు సమావేశాలు నిర్వహించాలని రాష్ట్ర కమిటిలు పిలుపునిచ్చాయి. ఈ మేరకు హైదరాబాదు, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, గుంటూరు, కృష్ణ, విజయనగరం, ఖమ్మం, నల్గొండ, ప్రకాశం, వరంగల్ జిల్లాల్లో సమావేశాలు జరిగాయి. ఆహారధాన్యాల ధరలు తగ్గించాలని, మహిళలకు రక్షణ కల్పించాలని, మహిళా రిజర్వేషన్ బిల్లు పార్లమెంటులో ప్రవేశ పెట్టాలని, కేంద్ర ప్రభుత్వ మహిళా ఉద్యోగులతో సమానంగా 2 సం॥ల చైల్డ్ కేర్ లీవు మంజూరు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ సదస్సుల్లో తీర్మానాలు చేశారు.

2011 మార్చిలో జరిగిన ఎమ్మెల్సీ ఎన్నికల ప్రచారంలో మహిళా కార్యకర్తలు బాగా పాల్గొన్నారు. మంచి అనుభవం, చొరవ పెరిగాయని వారు తెలిపారు. పీఆర్‌సీ కొరకు జరిగిన ఉద్యమాల్లోనూ, అప్రెంటిస్ ఉద్యమంలోనూ బాగా పాల్గొన్నారు. అప్రెంటిస్ రద్దు చేయాలని కోరుతూ 2010 ఏప్రిల్ 8న జరిగిన రాష్ట్ర ధర్నాలో గుంటూరు, నల్లగొండ జిల్లాల నుండి ముస్లిం మహిళా టీచర్లు 10 మంది వరకు పాల్గొన్నారు. మంచి పరిణామం.

భవిష్యత్తులో మండల / డివిజను, జిల్లా స్థాయిలో స్టడీ సర్కిల్స్ నడపాలని అభ్యుదయ సాహిత్యాన్ని, ప్రజా ఉద్యమాల నేపథ్యాలను అనుభవాలను-సామాజిక సమస్యలను అధ్యయనం చేయడం ద్వారా మహిళా కార్యకర్తల స్థాయి పెరుగుతుందని యుటియఫ్ రాష్ట్ర మహిళా విభాగం భావిస్తున్నది.

## ఎమ్మెల్సీ ఎన్నికలు సమీక్ష

శాసనమండలిలోని 3 ఉపాధ్యాయ, 3 పట్టభద్రుల నియోజక వర్గాలకు ఎన్నికలు జరిగాయి. ఈ ఆరు నియోజకవర్గాల్లోనూ యుటియఫ్ బలపర్చిన అభ్యర్థులు పోటీ చేశారు. వీటిలో ఒక టీచర్స్, 3 గ్రాడ్యుయేట్స్ నియోజకవర్గాల్లో మన అభ్యర్థులు గెలిచారు.

1. ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు నియోజకవర్గంలో ఉపాధ్యాయ, పట్టభద్రుల స్థానాల రెండింటినీ నిలబెట్టుకొన్నాము. టీచర్ ఎమ్మెల్సీగా వి.బాలసుబ్రహ్మణ్యం మొదటి కౌంట్‌లో 2814 ఓట్ల మెజార్టీతో గెలవటం విశేషం. పట్టభద్రుల ఎమ్మెల్సీగా వై. శ్రీనివాసులురెడ్డి 10,566 ఓట్లు మెజార్టీతో గెలిచారు.
2. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం పట్టభద్రుల నియోజకవర్గంలో ఎం.వి.ఎస్. శర్మ రెండోసారి 19700 ఓట్ల మెజార్టీతో గెలిచారు.
3. కడప, అనంతపురం, కర్నూలు నియోజకవర్గంలో గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీగా డాక్టర్ గేయానంద్ 11వ కౌంట్‌లో 12970 ఓట్ల మెజార్టీతో గెలిచారు. టీచర్ ఎమ్మెల్సీగా పోటీ చేసిన బీరం సుబ్బారెడ్డికి మొదటి కౌంట్‌లో 1630 ఓట్లు, 6వ కౌంట్‌లో 1973 ఓట్లు వచ్చి ఎలిమినేట్ కావటం జరిగింది. పశ్చిమరాయలసీమ నియోజకవర్గం పరిధిలో మన సంఘ నిర్మాణం తగినంత బలంగా లేకపోవటం వలన గెలవలేకపోయాం.
4. మహబూబ్‌నగర్, రంగారెడ్డి, హైదరాబాద్ ఉపాధ్యాయ నియోజకవర్గంలో మనం బలపర్చిన అభ్యర్థి పాతూరి సుధాకర్‌రెడ్డి చివరిదాకా పోరాడి కేవలం 381 ఓట్లతో ఓడిపోవటం జరిగింది. ఈ నియోజకవర్గంలోని ప్రత్యేక పరిస్థితి వలన కొన్ని పరిమితుల్లో అయినా అవకాశం వున్న మేరకు మన సంఘం కృషి చేసింది.
5. ఈ ఎన్నికల్లో పరస్పర సహకారానికి ఎస్‌టియుతో జరిపిన చర్చలు ఫలించలేదు. తూర్పురాయలసీమలో మనకి పోటీగా వారి అభ్యర్థుల్ని ప్రకటించారు. అందువలన పశ్చిమరాయలసీమలో అనివార్యంగా మనం పోటీ చేయాల్సి వచ్చింది. ఫలితంగా మనం గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీని అదనంగా గెలుచుకొన్నాం. ఎస్‌టియు వారు తూర్పురాయల సీమలోని 2 సీట్లను నిలబెట్టుకోవడంతో పాటు పశ్చిమరాయల సీమలో ఉన్న ఒక్క టీచర్ ఎమ్మెల్సీని కోల్పోయారు. వారి వైఖరి వలన అక్కడ పీఆర్‌టియు అభ్యర్థి గెలిచారు.
7. కడప, అనంతపురం,కర్నూలు ఉపాధ్యాయ నియోజకవర్గంలో మన సంఘం నిర్మాణ పరిస్థితిని బట్టి ఎన్నికలకు రాష్ట్ర కమిటీ గణనీయమైన సహాయం చేసింది. రాష్ట్ర కేంద్రం బాధ్యులు ముగ్గురు జిల్లాకొకరు ఇన్‌చార్జ్‌లుగా పనిచేశారు. నలుగురు రాష్ట్ర కార్యదర్శులు మరియు ఖమ్మం, గుంటూరు, తూర్పుగోదావరి, పశ్చిమగోదారి, నల్లగొండ, కృష్ణ, మెదక్, నిజామాబాద్, వరంగల్ జిల్లాల నుండి మొత్తం 174 మంది కార్యకర్తలు పనిచేశారు. పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది. ఆ జిల్లాల్లో కార్యకర్తల కొరతను తీర్చేవిధంగా బయటి జిల్లాల వారు సహాయాన్ని సమకూర్చటం జరిగింది. సెన్సెస్ తదితర కొన్ని ఆటంకాలు ఎదురైనా ఆయా జిల్లాల కార్యకర్తలు ఎన్నికల పనికి తోడ్పాటునందించారు.
8. రాష్ట్ర ప్రధానకార్యదర్శి చిత్తూరు జిల్లాలో కేంద్రీకరించి పనిచేశారు. తూర్పుగోదావరి జిల్లా కార్యకర్తలు 17మంది చిత్తూరు జిల్లాలో కృషి చేశారు. ప్రకాశం, నెల్లూరు మరియు ఉత్తరాంధ్ర జిల్లా కమిటీలు స్వయపోషకంగా పనిచేశాయి. పశ్చిమగోదావరి నుండి నలుగురు కార్యకర్తలు ఉత్తరాంధ్ర నియోజకవర్గంలో పనిచేశారు.
9. పిడిఎఫ్ మన ఎమ్మెల్సీలు రామిరెడ్డిగారు తూర్పు, పశ్చిమరాయల సీమ నియోజకవర్గాల్లో పర్యటించి మన అభ్యర్థుల విజయానికి కృషి చేశారు. రామయ్యగారు తూర్పు,పశ్చిమరాయలసీమ, హైదరాబాద్ జిల్లాల్లో పర్యటించారు. జార్జివిక్టర్‌గారు పశ్చిమ రాయలసీమ నియోజకవర్గాల్లో పర్యటించారు. లక్ష్మణరావుగారు అనంతపురం, ఒంగోలులో పర్యటించారు. నాగేశ్వర్‌గారు ఉత్త రాంధ్రాలో కొన్ని సదస్సులో పాల్గొన్నారు. డా॥ పాలగుమ్మి సాయినాథ్‌గారు కొన్ని సదస్సుల్లో ప్రసంగించారు.
10. సిఐటియు, జెవివి, ఎస్‌ఎఫ్ఐ తదితర అనేక సంఘాలు మనతోపాటు ఈ ఎన్నికల్లో ఎంతో కృషి చేశాయి. ఆయా సంఘాల రాష్ట్ర నాయకులు కొన్ని జిల్లాల్లో కేంద్రీకరించి పనిచేశారు. బూత్ కమిటీ సభ్యులుగా, పోలింగ్ ఏజెంట్లుగా పెద్ద ఎత్తున సహకరించారు.

11. ఈ ఎన్నికల ప్రచారంలో మనం పై చేయిగా కృషి చేశాం. ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంలో యుటియఫ్, పీడీఎఫ్ ఎమ్మెల్సీల కృషిని, ప్రత్యేకతను వివరించటం జరిగింది. ప్రభుత్వ తప్పుడు విధానాలను, కొన్ని సంఘాల దిగజారుడు చర్యలను ఎండగట్టాము. కొందరు అభ్యర్థుల ప్రలోభాలను అడ్డుకొనే ప్రయత్నం చేశాము.

12. ఈ ఎన్నికల పనిలో సెలవులు పెట్టి నెలలు, రోజుల తరబడి అహర్నిశలూ కృషి చేసిన కార్యకర్తలు, సభ్యులను రాష్ట్ర మహాసభ ప్రత్యేకంగా అభినందిస్తున్నది.

### ఎస్‌టిఎఫ్ఐ - యుటియఫ్ భవన నిధి

ఎస్‌టిఎఫ్ఐకి ఢిల్లీలో కార్యాలయం ఏర్పాటుకు రాష్ట్ర కోటా 11 లక్షలు అమరజీవి అప్పారివెంకటస్వామి స్మారకోపన్యాసం కోసం 10 లక్షలు, రాష్ట్ర కార్యాలయం విస్తరణ కోసం కలిపి మొత్తం 50 లక్షలు వసూలు చేయాలని 30.08.2009 కార్యవర్గ సమావేశంలో నిర్ణయించి 56 లక్షల కోటా తీసుకున్నాము. 60 శాతం వసూలైంది. తూర్పుగోదావరి, కృష్ణ, ఖమ్మం, మహబూబ్‌నగర్, నల్గొండ, హైదరాబాద్, రంగారెడ్డి, మెదక్, నిజామాబాద్ జిల్లాలు నిర్ణయించిన కోటా మేరకు చెల్లించాయి. మిగిలిన జిల్లాలు కూడా వసూళ్ళపై కేంద్రీకరించి కోటాలు పూర్తి చేయాలి. రాష్ట్ర కేంద్రానికి వచ్చిన మొత్తంలో ఎస్‌టిఎఫ్ఐకు 11 లక్షలు చెల్లించాము. ఏవిఎస్ స్మారకోపన్యాసం కొరకు 10 లక్షలు ఫిక్సిడ్ డిపాజిట్ చేశాము. మిగిలిన మొత్తం వస్తే తప్ప రాష్ట్ర కార్యాలయం విస్తరణ సాధ్యం కాదు.

### అనుభవాలు

1. 11వ రాష్ట్ర మహాసభ తర్వాత గడిచిన 27 నెలల కాలంలో అవిశ్రాంతంగా ఆందోళన పోరాటాలు చేశాము.

   స్వతంత్రకార్యాచరణ 29, ఐక్య పోరాటాలు 9, అఖిలభారత ఉద్యమాలు 3, సదస్సులు 6 నిర్వహించాము.

   352 పత్రికా ప్రకటనలు, 61 సర్క్యులర్లు, తరచుగా ప్రెస్‌మీట్స్ పెట్టాము. 30 రకాల కరపత్రాలు వేశాము. వివిధ సమస్యలపై 350 ప్రాతినిధ్యపు లేఖలు పెట్టాము.

ప్రభుత్వం నిర్వహించిన సమావేశాలు, చర్చలు అన్నింటా పాల్గొని మన సంఘం వాదనలు విన్పించాము.

2. ఈ మహాసభల కాలం 27 నెలల్లో సాధించిన విజయాలు సంతృప్తికరంగా ఉన్నాయి. ఎయిడెడ్ మేనేజ్‌మెంట్ మినహా కొన్ని ప్రధాన సమస్యలు ఈ కాలంలో పరిష్కారమయ్యాయి. ఐక్య ఉద్యమాలు బలహీనపడినా రాజీలేని పోరాటసంస్థగా నిలబడి పనిచేశాము. ఉపాధ్యాయులకు మెరుగైన పే స్కేల్స్, నోషనల్ ఇంక్రిమెంట్లు, పెన్షన్ తదితర విజయాలు సాధించాము.

3. ఎయిడెడ్, మున్సిపల్, బాషాపండితుల సమస్యలపై ఎన్ని పోరాటాలు, ప్రాతినిధ్యాయుల చేసినా ఆశించిన ఫలితాలు రాకపోవడంతో ఆ ఉపాధ్యాయుల్లో అసంతృప్తి నెలకొంది. ఎయిడెడ్ విద్యా సంస్థలపై ప్రపంచబ్యాంకుతో పాలకుల ఒప్పందాల వలన, ఉన్నతాధికారుల వైఖరి వలన సమస్యలు పరిష్కారం కావడం లేదు.

4. కొన్ని జిల్లాలలో సంఘ నిర్మాణ విషయాలలో అశ్రద్ధ, నిర్లక్ష్యం కొనసాగుతూనే ఉంది. క్యాంపెయిన్లు సీరియస్‌గాను, సకాలంలోనూ జరగడం లేదు. పునాది శాఖల నిర్మాణం బలహీనంగా ఉంది. మండల పట్టణ శాఖలు సమావేశాలు సక్రమంగా జరగడం లేదు. కొన్ని జిల్లాలలో ఆడిట్ కమిటీలు పనిలో లేవు. నిబంధనావళి ప్రకారం కోశాధికారి బాధ్యతలు నిర్వహించడం లేదు. సమిష్టి పని విధానం కొరవడుతున్నది.

5. ఎమ్మెల్సీ ఎన్నికల్లో మూడింటిని తిరిగి నిలబెట్టుకొన్నాము. మంచి మెజార్టీ సాధించాము. అదనంగా కడప గ్రాడ్యుయేట్ స్థానం గెలుచుకొని అపూర్వ విజయం సాధించాము. హైదరాబాద్ టీచర్సు స్థానాన్ని మరింత శ్రద్ధ పెడితే గెలిచేవాళ్ళం. కడప టీచరు నియోజకవర్గంలో గెలుపు కోసం ప్రత్యర్థుల అవినీతికర పద్ధతులను అడ్డుకున్నాం. ప్రలోభాల ప్రభావం ఫలితంపై కనిపించింది.

6. ఉద్యమ శిక్షణా తరగతులు 2010 వేసవి / దసరా, సంక్రాంతి సెలవుల్లో జరపలేక పోయాము. జిల్లాలలోని తగిన రీతిలో శిక్షణా తరగతులు నిర్వహించలేకపోయాము. సెలవుల్లో విద్యాశాఖ శిక్షణా తరగతులు, జనాభా లెక్కలు ఒక ఆటంకమయినా శ్రద్ధ పెట్టలేకపోయాం.

7. జెఏసి పోరాటాలలో రాష్ట్రంలోను, జిల్లాలలోను మరింత చురుకుగా పాల్గొన్నాము. జెఏసి నిర్ణయాలలోను, ప్రభుత్వ చర్చలలోను చొరవగా పాల్గొన్నాము. జెఏసిలో మన ప్రతిష్ట పెరిగింది.

8. పోరాట సందర్భంగా సమీకరణ కోటాలకు అనుగుణంగా ఉండుటకు కృషి చేయాలి. కరపత్రాల పంపకం సక్రమంగా చేయాలి. పోరాటాల సందర్భంగా స్థానికంగా ప్రెస్ కవరేజికి ప్రాధాన్యత యివ్వాలి. సమీకరణ మన ఉద్యమ బలాన్ని ప్రతిబింబించే విధంగా ఉండాలి.

**కామ్రేడ్స్ !**

గడిచిన 27 నెలల కాలం నివేదికలను పరిశీలించి సమీక్షించండి. మన పనిలో లోపాలు విమర్శ, ఆత్మవిమర్శ చేసుకుందాం. నిర్మాణాత్మక సూచనలలో ఈ నివేదికలను పరిపుష్టం చేయండి.

ఉద్యమాభివందనములతో....

(ఐ. వెంకటేశ్వరరావు)
ప్రధానకార్యదర్శి



కర్నూలు నగరంలో ఓ కూడలిలో అలంకరణ దృశ్యం



యుటిఎఫ్ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న యుటిఎఫ్ సీనియర్ నాయకులు ఎం.ఎ.కె. దత్తు




అమరవీరుల స్థూపం వద్ద నివాళులు అర్పిస్తున్న రాష్ట్ర నాయకులు



ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న యుటిఎఫ్ సీనియర్ నాయకులు డి. రామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ



ప్రారంభసభకు అధ్యక్షత వహించిన ఎన్. నారాయణ



స్వాగతోపన్యాసం ఇస్తున్న ఆహ్వానసంఘం చైర్మన్ జి. పుల్లయ్య



ప్రారంభసభలో సందేశమిస్తున్న జెఎసి నాయకులు, చైర్మన్ వి. గోపాల్‌రెడ్డి, కో చైర్మన్ జనార్ధన్ రెడ్డి



ఎస్‌టిఎఫ్ఐ నాయకులు కన్నన్ (తమిళనాడు) సందేశం




భూపాలన్ (తమిళనాడు) సందేశం



సాంస్కృతిక కార్యక్రమాలను ప్రారంభిస్తున్న తెలకపల్లి రవి

## ఐక్యఉపాధ్యాయ కథలు - కవితలు పోటీల విజేతలకు బహుమతులు



గోపినాథ్ (నెల్లూరు)



మండల స్వామి (నల్లగొండ)



సంపటం దుర్గా ప్రసాద్ (ఖమ్మం)

## ప్రతినిధుల సభ దృశ్యాలు



ప్రతినిధుల సభలో ఎన్. నారాయణ అధ్యక్షోపన్యాసం



కార్యకలాపాల నివేదికను ప్రతిపాదిస్తున్న ఐ. వెంకటేశ్వరరావు



ఎం. సంయుక్త ఆర్థిక నివేదిక


సిహెచ్. రవి ఐక్యఉపాధ్యాయ నివేదిక



ఎమ్మెల్సీ వై. శ్రీనివాసులు రెడ్డి సందేశం



ఎమ్మెల్సీ గేయానంద్ సందేశం

### ప్రజాసంఘాల నాయుకుల సందేశాలు





రైతు సంఘం ఎస్..రామారావు, అంగన్‌వాడి వర్కర్స్ లలితమ్మ కాంట్రాక్ట్ వర్కర్స్ కార్యదర్శి ఎ.వి. నాగేశ్వరరావు, స్వేచ్ఛ చైర్మన్ వై. కిరణ్‌చంద్ర


ఎస్ఎఫ్ఐ నూర్ మహ్మద్


డివైఎఫ్ఐ కె.వి.నారాయణ

### తీర్మానాలు ప్రతిపాదన


జెవివి రఘుబాబు


సిఐటియు అబ్బాస్


సుభాస్‌చంద్రబోస్


తాండవ కృష్ణ


వెంకట్రావు


నర్సిరెడ్డి


మాణిక్‌రెడ్డి



బి. నాగేశ్వరరావు, బి. నర్సింహారెడ్డి



రాష్ట్ర కమిటీ ఎన్నిక నిర్వహిస్తున్న ఎంఎకె. దత్తు, చిట్టిబాబు


కర్నూలు జిల్లా శాఖకు అభినందన

## యుటియఫ్ 12వ మహాసభలో ఎన్నికైన రాష్ట్ర ఆఫీస్ బేరర్లు


సిహెచ్.సుభాష్‌చంద్రబోస్ గౌ॥ అధ్యక్షులు


ఎన్.నారాయణ అధ్యక్షులు


పి.బాబురెడ్డి సహాధ్యక్షులు


ఎం.సంయుక్త సహాధ్యక్షులు


ఐ.వెంకటేశ్వరరావు ప్రధాన కార్యదర్శి


పి.మాణిక్‌రెడ్డి కోశాధికారి


బి.నాగేశ్వరరావు


సి.కె.నాగేంద్ర బాబు


ఎన్.కిష్టయ్య


కె.విజయగౌరి


సిహెచ్.రవి


ఎ.నర్సిరెడ్డి


కెఎస్ఎస్ ప్రసాద్


ఎన్.తాండవకృష్ణ


బి.నరసింహారావు


ఎన్.సోమచంద్రారెడ్డి


ఎం.వెంకటేశ్వరరెడ్డి


ఎస్.సాబ్జీ


టి.లక్ష్మారెడ్డి రాష్ట్ర కార్యదర్శి

## ఆడిట్ కమిటీ


సి.హెచ్.వి.రాజన్‌బాబ్ కన్వీనర్


వి.మాలకొండారెడ్డి


ఎ.శ్రీనివాస్


బి.వి.రమణమూర్తి


బి.మాణిక్యంశెట్టి

## ఐక్యఉపాధ్యాయ సంపాదకవర్గం


సిహెచ్.రవి


ఎం.సంయుక్త


కె.వెంకట్రావు


ఎన్.పురుషోత్తంరావు


టి.ఎస్.ఎన్.మల్లేశ్వరరావు


డా॥ఎ.విద్యాదేవి

## నివేదికలపై చర్చలో పాల్గొన్న ప్రతినిధులు


భాస్కరరావు
శ్రీకాకుళం


గిరిధర్
శ్రీకాకుళం


రాము
విజయనగరం


మురళీధర్
విజయనగరం


రాజేంద్రప్రసాద్ వర్మ
విశాఖపట్నం


సత్తిరాజు
తూ॥గో॥


ప్రభాకరవర్మ
తూ॥గో॥


జి.చిట్టిబాబు
తూ॥గో॥జిల్లా


ఎస్.సాబ్జీ
ప॥గో॥


కనకదుర్గ
ప॥గో॥


సంజీవరెడ్డి
కృష్ణా


ఉమామహేశ్వరరావు
కృష్ణా


హనుమంతరావు
గుంటూరు


మల్లేశ్వరరావు
గుంటూరు


పద్మావతి
గుంటూరు


రమణారెడ్డి
ప్రకాశం


శ్రీనివాసరావు
ప్రకాశం


వెంకటేశ్వరరెడ్డి
ప్రకాశం


పరంధామయ్య
నెల్లూరు


సోమచంద్రారెడ్డి
చిత్తూరు


లక్ష్మీరాజా
కడప


ఎస్.ఎం.జిలాన్
అనంతపురం


నరసింహుడు
కర్నూలు


విక్రమ్
ఖమ్మం


రంజిత్‌కుమార్
వరంగల్


భూంరెడ్డి
కరీంనగర్


స్వామిరెడ్డి
ఆదిలాబాద్


వెంకటప్ప
మహబూబ్‌నగర్


హేమలత
మహబూబ్‌నగర్


రాములు
నల్లగొండ


సామేశ్వర్లు
నిజామాబాద్


సత్యనారాయణ
మెదక్


ఆంజనేయులు
రంగారెడ్డి


దేవదాస్
హైదరాబాద్

## పతాక యాత్రల దృశ్యాలు




కాకినాడలో పతాక యాత్ర ప్రారంభం




ప॥గో॥ జిల్లా ఏలూరులో పతాక యాత్రలకు స్వాగతం



నల్లగొండలో పతాకయాత్ర ప్రారంభం



హైదరాబాద్‌లో పతాక యాత్ర ప్రారంభం




మహబూబ్‌నగర్‌లో పతాక యాత్రలకు స్వాగతం



కర్నూలులో పతాకయాత్రలకు ఆహ్వాన సంఘం స్వాగతం



ఎగ్జిబిషన్



ప్రతినిధుల నమోదు దృశ్యం



సేల్స్ కౌంటర్




మహిళా విభాగం



భోజనాల కౌంటర్స్



భోజనశాల వద్ద కోలాహలం



ఎం.ఎల్.సి. కె.ఎస్.లక్ష్మణరావుకు జ్ఞాపిక బహుకరణ



ఎం.ఎల్.సి. ప్రొ॥ కె.నాగేశ్వర్‌కు జ్ఞాపిక బహుకరణ



మహాసభ ప్రతినిధులు

## అప్రంటీస్ రద్దు కోసం జిల్లా కలెక్టరేట్ల ముట్టడి దృశ్యాలు



కాకినాడ



నల్లగొండ




ఖమ్మం



కర్నూలు




పశ్చిమ గోదావరి



కరీంనగర్



కృష్ణా




మహబూబ్‌నగర్




ప్రకాశం జిల్లా డి.ఇ.ఓ. కార్యాలయం వద్ద యుటియఫ్ నిరాహారదీక్షలు

## అక్రమబద్ధీకరణకు వ్యతిరేకంగా డి.ఇ.ఓ. కార్యాలయాల ముట్టడి




కాకినాడ (తూ॥గో॥)




ఖమ్మం




కర్నూలు



కృష్ణా




కడప



అనంతపురం

# అప్రెంటీస్ రద్దు ఇతర సమస్యల పరిష్కారం కోసం ఎస్ఎస్‌సి స్పాట్ కేంద్రాల పికెటింగ్ దృశ్యాలు



నల్లగొండ



ఒంగోలు (ప్రకాశం జిల్లా)




బి.హెచ్.ఇ.ఎల్. రామచంద్రాపురం (మెదక్)




హైదరాబాద్



గుంటూరు



కృష్ణా



ఖమ్మం




పశ్చిమగోదావరి



నిజామాబాద్ డి.ఇ.ఓ. ఆఫీసు ముట్టడి



అమలాపురం ఆర్.డి.ఓ. కార్యాలయం ముట్టడి




రంపచోడవరం ఐటిడిఎ ఎదుట ధర్నా




అనంతపురం స్పెషల్ వి.వి.ల విజయోత్సవం




కడప జిల్లా మహాసభలో సహాధ్యక్షులు బాబురెడ్డి




ఎం.నగర్ అంబేద్కర్ జయంతి సభలో ఎన్.నారాయణ



ఒంగోలు యుటియఫ్ కార్యాలయంలో అంబేద్కర్ జయంతి దృశ్యం

# సంక్షేమ పథంలో ఆంధ్రప్రదేశ్





## ప్రజాసంక్షేమం, పాలనలో పారదర్శకత...



ఏ రాష్ట్రంలో అమలు కాని ఎన్నో అభివృద్ధి, సంక్షేమ పథకాలు మన రాష్ట్రంలో అమలు కావడం గర్వకారణం. ఇందిరమ్మ ఇళ్ళ నిర్మాణ వ్యయం పెంచడంతో పాటు అభివృద్ధి, సంక్షేమ ఫలాలను చేరవలసిన వారికి చేరేలా విశేషంగా కృషి జరుగుతుంది. పాలనలో సమర్థత, పనుల్లో వేగం, నిర్ణయాల్లో పారదర్శకత ప్రధాన లక్ష్యాలుగా అన్ని రంగాలు, అన్ని ప్రాంతాలు సమతులాభివృద్ధి సాధించేలా ప్రభుత్వం కృషి చేస్తోంది.

### ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణ వ్యయం పెంపు

- గ్రామీణ ప్రాంతాలలో ప్రస్తుతం ఇస్తున్న యూనిట్ ధరను 31,200 రూపాయల నుంచి 45 వేలకు పెంపు.
- పట్టణ ప్రాంతాలలో ఇస్తున్న మొత్తాన్ని 43 వేల రూపాయలను 55 వేలకు పెంపు.
- ఎస్సీ, ఎస్టీలకు గ్రామీణ ప్రాంతాలలో రూ.20 వేల చొప్పున, పట్టణ ప్రాంతాలలో రూ.30 వేల చొప్పున అదనపు రుణసౌకర్యం.
- గ్రామీణ ప్రాంతాలలో వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం కోసం లబ్ధిదారులందరికీ అదనంగా 3,050 రూపాయల మంజూరు.
- ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం వల్ల 13.83 లక్షల మందికి ప్రయోజనం.

### ధాన్యం సేకరణ

- భారత ఆహార సంస్థ, పౌరసరఫరాల సంస్థతో పాటు మహిళా స్వయం సహాయక బృందాల ఆధ్వర్యంలో 1248 ధాన్యం కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు.
- రైతుకు కనీస మద్దతుధర ఇవ్వడానికి చర్యలు.

### భారీగా పోస్టుల భర్తీ

- హైదరాబాద్, విశాఖ, విజయవాడ నగరపాలక సంస్థలు మినహా మిగిలిన అన్ని మున్సిపాలిటీలలో 2014నాటికి మూడు దశల్లో 4048 పోస్టుల భర్తీ.

### మరో పదేళ్లు బి.సి. రిజర్వేషన్లు

- స్థానిక సంస్థల ఎన్నికల్లో బి.సి.ల రిజర్వేషన్‌ను మరో పదేళ్లపాటు పొడిగింపు.
- రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో, విద్యలో బి.సి.లకు రిజర్వేషన్లు మరో పదేళ్లు పొడిగింపు, వయోపరిమితి 5 సంవత్సరాలు సడలింపు.
- బిసిలలోని అన్ని కేటగిరిలకు రిజర్వేషన్లు వర్తింపు.
- జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం కింద 10 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తేవాలని నిర్ణయం.
- ఎస్.సి., ఎస్.టి.లకు చెందిన 10 లక్షల ఎకరాల సాగునీటి కోసం జలప్రభ కొత్త కార్యక్రమానికి శ్రీకారం, రెండు దశల్లో జలప్రభ కోసం రూ.1600 కోట్ల వ్యయం.
- అనాథలు, వృద్ధులకోసం తెలంగాణ, రాయలసీమ, కోస్తా ప్రాంతాల్లో ఒక్కొక్కటి చొప్పున అనురాగ నిలయాలు ఏర్పాటుకు సి.ఎం. సూచన.

**స్థానిక ఎన్నికల్లో మహిళలకు 50 శాతం రిజర్వేషన్లు.**









జారీ చేసినవారు : సమాచార, పౌరసంబంధాల శాఖ

# ఐక్య ఉపాధ్యాయ పత్రిక నివేదిక
## (2009 మార్చి నుండి 2011 ఏప్రిల్ వరకు)

ప్రజాస్వామ్యానికి పత్రికలు, మీడియా 4వ స్థంభం (ఫోర్త్ ఎస్టేట్) అంటారు. అయితే వాటిల్లో అత్యధికం ఈ రోజు పెట్టుబడి దారుల చేతులో కేంద్రీకృతమై పోయాయి. అవి తమ యజమాన్యాల వర్గ ప్రయోజనాలు, వారి కుటుంబ ప్రయోజనాల రక్షణ కోసం ప్రాకులాడటమే తప్ప ప్రజలు, సమాజం పట్ల ఏ మాత్రం బాధ్యతగా వ్యవహరించటం లేదు. ప్రజ ప్రయోజనాల కోసం నిలబడిన బహుకొద్ది పత్రికలు ఆర్థిక ఇబ్బందులతో సతమతమౌతూనే పెట్టుబడిదారీ విషపుత్రికల పోటీని తట్టుకొని ఎదురీదుతున్నాయి. అటువంటి సమాజహితం కోరే పత్రికల కోవకు చెందినదే మన సంఘం అధికారవాణి ఐక్య ఉపాధ్యాయ.

అమరజీవులు చెన్నుపాటి ఆశయాల సాధన కోసం అప్పారి మార్గదర్శకత్వంలో మైనేని సంపాదకత్వంలో 1975 జనవరిలో మన పత్రిక ప్రారంభమైంది. తొలినాళ్ళలోనే ఎమర్జెన్సీ ఆంక్షలను తట్టుకొని ధైర్యంగా నిలిచింది. అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ లక్ష్యాలుగా, ఉపాధ్యాయుల వృత్తికి, ప్రవృత్తికి సంబంధించిన ఆకాంక్షలకనుగుణంగా నిత్యనూతనత్వాన్ని సంతరించుకుంటూ అత్యధిక పాఠకాదరణ పొందింది. **ఐక్య ఉపాధ్యాయ పత్రిక** రాష్ట్రంలో అత్యధిక సర్క్యులేషన్ కలిగిన విద్యా విషయక మాసపత్రికగా గుర్తింపు పొంది అద్వితీయంగా వెలుగొందుతున్నది.

మన పత్రిక కేవలం ఉపాధ్యాయుల సర్వీస్ సమస్యలకు, ఆర్థిక అంశాలకు మాత్రమే పరిమితంగావడం లేదు. పాఠకులలో శాస్త్రీయ దృక్పథాన్ని, సామాజిక అవగాహనను పెంపొందిచేందుకు, ఉద్యమ చైతన్యాన్ని రగిలించేందుకు దోహదపడుతున్నది. వర్తమాన విద్యారంగంతోబాటు సామాజిక, ఆర్థిక రంగాలలో వస్తున్న పరిణామాలను నిశితంగా పరిశీలించి విశ్లేషిస్తూ ప్రమాదకర పరిణామాలపై పాఠకులను మేలుకొలిపి ప్రతిఘటించేందుకు అవసరమైన ఉద్యమ చైతన్యాన్ని అందిస్తున్నది.

2009 ఫిబ్రవరి 21,22,23 తేదీలలో నల్లగొండలో నిర్వహించిన 11వ మహాసభలలో ఎన్నికైన నూతన కార్యవర్గం మొదటి సమావేశం ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులుగా సిహెచ్. రవిని, సంపాదకులుగా ఎం. సంయుక్త, కె. వెంకట్రావు, ఎన్. పురుషోత్తమ రావు, ఎ. రమాదేవిలను నామినేట్ చేసింది. ఈ సంపాదకవర్గం ఆధ్వర్యంలో గత 26 నెలల కాలంలో 25 పత్రికలు వెలువడినవి. ఆ సంచికలలోని శీర్షికలు, పత్రిక నిర్వహణా తీరును క్లుప్తంగా సమీక్షించుకుందాము.

**ముఖచిత్రాలు :** ఐక్య ఉపాధ్యాయ పత్రిక ముఖచిత్రాలను ప్రతినెల వైవిధ్యభరితంగా తీసుకువచ్చేందుకు ప్రయత్నించాము. కార్టూన్లు, ఇలస్ట్రేషన్స్, ఉద్యమ ఫోటోలు, గ్రాఫిక్ డిజైన్‌లతో వర్తమాన పరిస్థితులకు అనుగుణంగా పాఠకుల దృష్టిని ఆకట్టుకునే విధంగా రూపొందించాము. కొన్ని సందర్భాలలో లోపలి పేజీల్లో గల ముఖ్యమైన వ్యాసాలను కవర్ పేజీపై చూపించడం ద్వారా పాఠకులలో ఆసక్తిని రేకెత్తించే ప్రయత్నం చేశాము.

హక్కుల రక్షణకు ఓటుహక్కని కార్టూన్ ద్వారా సాధారణ ఎన్నికలలో ఉపాధ్యాయుల కర్తవ్యాన్ని గుర్తుచేశాము. శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా ఆ మహాకవి చిత్రాన్ని, విదేశీ యూనివర్సిటీల ప్రవేశానికి అనుమతించిన కేంద్ర ప్రభుత్వ విధానంపై వ్యంగ్య చిత్రం, విద్యాహక్కు బిల్లు ఆమోదంపై హర్షం ప్రకటిస్తూ అర్థవంతమైన ఇలస్ట్రేషన్, కర్నూలు వరద బాధితులకు సహాయం దృశ్యాలు, శత వసంతాల మహిళా దినోత్సవం సందర్భంగా చిత్రం, రవీంద్రనాథ్ ఠాగూర్ 150వ జయంతి సందర్భంగా విశ్వకవి ఫోటోను ప్రచురించాము. అప్రెంటిస్ నోషనల్ ఇంక్రిమెంట్లు సాధనలో విజయం సాధించిన సందర్భంగా అప్రెంటీస్ విధానంపై సాగిన పోరాటం దృశ్యాలు, సాధించిన విజయాల సచిత్ర వివరణ, విజయవాడలో ఎస్‌టిఎఫ్ఐ సదస్సు, సెప్టెంబర్ 7 సార్వత్రిక సమ్మె దృశ్యాలు, అంతర్జాతీయ ఉపాధ్యాయ దినోత్సవం పోస్టర్, ఢిల్లీలో విద్యారక్షణ ర్యాలీకి సన్నాహక చిత్రం, ఇందిరాపార్క్‌వద్ద జెఏసి మహా ప్రభంజనం దృశ్యం, ఎమ్మెల్సీ అభ్యర్థుల ఫోటోలు, మహిళా దినోత్సవం పోస్టర్, టీమిండియా, పిడిఎఫ్ ఎమ్మెల్సీల విజయంపై అభినందనలు వంటి చిత్రాలను సందర్భానుసారంగా ప్రచురించాము.

**సంపాదకీయాలు :** విద్యారంగంలో సంస్కరణలు, ఉపాధ్యాయ సమస్యలు, సమకాలీన సామాజిక, ఆర్థిక అంశాలపై సందేశాత్మకంగా, పాఠకులకు కర్తవ్యాన్ని నిర్దేశించే సంపాదకీయాలను వ్రాశాము. శ్రీశ్రీ రెండక్షరాల స్ఫూర్తి- చైతన్య దీప్తి, విద్యారంగాన్ని విస్మరించిన కేంద్ర బడ్జెట్, ప్రాథమిక హక్కుగా విద్య, ఆరోగ్య బీమా అంటే ఇలాగా!, విద్యా సంస్కరణలతో ఉపాధ్యాయులకు సంబంధం లేదా?, మెరుగైన పిఆర్‌సి కోసం ఉద్యమించాలి. ఉపాధ్యాయుల "ఔన్నత్యాన్ని నిలబెడదాం", మహిళా దినోత్సవ ప్రస్థానంలో నూరు వసంతాలు, మెగాదగా, అప్రెంటిస్ విధానంపై అంతిమ పోరాటం, దండనలేని బోధనకై ఉద్యమిద్దాం, ప్రవర్తనా నియమావళిపై విస్తృత చర్చ జరగాలి, నిజాయితీ పరులను ఎమ్మెల్సీలుగా ఎన్నుకుందాం, ఐక్య ఉద్యమ విజయం, ఆదర్శనేత అప్పారికి జోహార్లు, చలో కర్నూలు వంటివి సంపాదకీయాలలో ముఖ్యమైనవి.

వర్తమాన విద్య, సామాజిక, ఆర్థిక రంగాలకు సంబంధించిన అంశాలపై **వ్యాస కర్తలు :** చుక్కారామయ్య, వి. బాలసుబ్రహ్మణ్యం, ఎం.వి.ఎస్. శర్మ, ప్రొ॥కె. నాగేశ్వర్, డి. రామిరెడ్డి, డా॥ వై. రాధాకృష్ణమూర్తి, జంధ్యాల బి.జి.తిలక్, వి. కృష్ణయ్య, హ్యూగోచావెజ్, ఎం.ఎ.బేబి, వి. శ్రీనివాసరావు, ప్రభాత్ పట్నాయక్, ఎన్. నారాయణ, సుకోమల్‌సేన్, సిహెచ్. రవి, ఎం. సంయుక్త, కె. విజయగౌరి, కందాడై శ్రీనివాసులు, పోట్లూరి వెంకటేశ్వర రావు, జి.సి. మధుసూదనరావు, తెలకపల్లి రవి, చుండి పద్మావతి, జి.వి. నాగమల్లేశ్వరరావు, ఎం.ఎ.కె.దత్తు, అందె సత్యం, ఎ. నర్సిరెడ్డి, ఐ. వెంకటేశ్వర రావు, ఎం. నిర్మల్‌కుమార్, పి.వి. కృష్ణారావు, గుడిపూడి విజయారావు, వై. కిరణ్‌చంద్ర, ఎం. పరమేశ్వర్, భువన్ & మేధాంశ్, జి. భిక్షపతి, వి. శివదాసన్, ఎస్. పుణ్యవతి, కె. జోజయ్య, పి. వెంకటేశ్వర రావు, పాతూరి వెంకటేశ్వర రావు, జి. గోపాలకృష్ణ, యమునా సన్నీ, చింతపల్లి శ్రీనివాసరావు, కె.ఎల్. కాంతారావు, ఆర్. విక్రమ్‌రెడ్డి, పి. ప్రేమ్‌కుమార్, సిహెచ్. దుర్గాభవాని, ఎం. కోటేశ్వర రావు, ఆర్. శివనాగేశ్వర రావు, ఎం. తారానాథ్ తదితర ప్రముఖులు, విద్యావేత్తలు, పిడిఎఫ్ ఎమ్మెల్సీలు, యుటియఫ్ నాయకులు, ఔత్సాహిక రచయితలు వ్రాసిన వ్యాసాలు, అనువాదవ్యాసాలను సందర్భానుసారంగా ప్రచురించి అవసరమైన సమాచారాన్ని, విజ్ఞానాన్ని పాఠకులకు అందించే ప్రయత్నం చేశాము.

**శ్రీశ్రీకి నూరేళ్ళ నివాళి :** మహాకవి శ్రీశ్రీ శతజయంతిని పురస్కరించుకొని 2009 మే నెల నుండి ప్రతి నెల మహాకవి శ్రీశ్రీకి నూరేళ్ళ నివాళి పేరుతో తెలకపల్లి రవి, ఎం. నరహరి, బి. వెంకటేశ్వరరావు, డా॥ వి. శరత్‌బాబు, కె. రమణయ్య, ఎం. లక్ష్మీమైథిలి, సంపటం సుబ్రహ్మణ్యం, జూటూరు కృష్ణవేణి, కె. వెంకటయ్య, జి. మల్యాద్రి, పి. వెంకటేశ్వరరావులు రచించిన వ్యాసాలు, గేయాలను సంవత్సరం పాటు ప్రచురించి శతాబ్దపు కవికి నివాళులర్పించాము.

**పీఆర్‌సీ :** ఉపాధ్యాయులు ఆసక్తిగా ఎదురు చూసిన పీఆర్‌సీపై వార్తలు, వ్యాసాలు, పట్టికలు అవసరమైనంత మేరకు ఎప్పటికప్పుడు ప్రచురించాము. 2010 జనవరి నుండి పీఆర్‌సీపై మన పత్రికలో ఇచ్చిన సమాచారం అత్యధికంగా పాఠకాదరణ పొందినది. అప్పటి నుండే పత్రిక అందలేదనే పిర్యాదులూ అధికమయ్యాయంటే అతిశయోక్తి కాదు. ఈ శీర్షికకు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, సిహెచ్. రవి, కె.ఎస్.ఎస్. ప్రసాద్, టి.ఎస్.ఎన్. మల్లేశ్వర్‌రావు, కె. పరంధామయ్య, ఎం. మాధవరావులు తమ రచనలు పంపి సహకరించారు.

**నియమనిబంధనలు :** ప్రభుత్వ ఉత్తర్వులపై వివరణ, కరువు భత్యం లెక్కింపు, సర్వీసు నియమాలు, ఆదాయం పన్ను నిబంధనలను ఏపిజిఎల్ఐ నిబంధనలను అందరికీ అర్థమయ్యే విధంగా ఈ శీర్షిక ద్వారా పాఠకులకు అందించే ప్రయత్నం చేశాము. సిహెచ్. రవి, కె. వెంకట్రావు, ఎన్. కుమారరాజా, టి.ఎస్. సంపత్‌కుమార్, టి.ఎస్.ఎన్. మల్లేశ్వరరావు, పి. హనుమంతరావు, కె.ఎస్.ఎస్. ప్రసాద్ తదితరులు ఈ శీర్షికకు రచనలు పంపించారు.

**ప్రశ్నోత్తరాలు :** ఇటీవలి కాలంలో పాఠకుల భాగస్వామ్యం అత్యధికంగా వుంటున్న శీర్షిక ప్రశ్నోత్తరాలు. 2009 జులై వరకు కె. వెంకట్రావు తరువాత సిహెచ్. రవి ఈ శీర్షికను నిర్వహిస్తున్నారు. సర్వీసు విషయాలలో సందేహాలపై చందాదారుల లేఖలకు సమాధానాలు ఇస్తున్నాము. నెలకు సగటున 50 లేఖలు వస్తున్నాయి. కానీ పత్రికలో 2 పేజీలలో 14,15 ప్రశ్నలకు మించి సమాధానాలు ఇవ్వలేని పరిస్థితి. అందుకే జనరల్ స్వభావం కలిగిన ప్రశ్నలను ఎంచుకొని ప్రాధాన్యతా క్రమంలో జవాబులిస్తున్నాము. మిగిలిన వాటికి వ్యక్తిగతంగా సమాధానాలు పంపుతున్నాము. ఇ-మెయిల్, ఎస్ఎంఎస్ ద్వారా అడిగిన ప్రశ్నలకు కూడా వెంటనే సమాధానాలు ఇస్తున్నాము.

**ఉద్యమవార్తలు:** రాష్ట్ర వ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో సంఘం నిర్వహించిన కార్యక్రమాలను ఐక్య ఉపాధ్యాయకు అందిన మేరకు ప్రచురించాము. సభలు, సమావేశాలు, ఆందోళనా, పోరాట కార్యక్రమాల రిపోర్టులను పత్రికకు పంపించడంలో పలు జిల్లా శాఖలు సరైన శ్రద్ధ కనపర్చడం లేదు. కనీసం మండలశాఖల ఎన్నికల వివరాలు కూడా అన్ని జిల్లాల నుండి రాలేదంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. రాష్ట్ర వ్యాప్త పిలుపులుగాని, స్థానిక కార్యక్రమాలుగాని నిర్వహించిన వెంటనే ఐక్య ఉపాధ్యాయకు పంపించే విధంగా తగిన యంత్రాంగాన్ని ఏర్పాటు చేసుకోవాలని పదేపదే చెప్పినా కొన్ని జిల్లాశాఖలు స్పందించడం లేదు. తూర్పుగోదావరి, ఖమ్మం, నల్లగొండ, గుంటూరు, కడప, అనంతపురం, మహబూబ్‌నగర్ ఆదిలాబాద్, కృష్ణా, విజయనగరం, రంగారెడ్డి జిల్లాల నుండి మాత్రమే రెగ్యులర్‌గా వార్తలు అందుతున్నాయి.

**ప్రభుత్వ ఉత్తర్వులు:** రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసే ముఖ్యమైన జి.ఓ.లు, మెమోలు, ప్రోసీడింగ్స్‌ను అవసరమైన మేరకు పేజీల లభ్యతను బట్టి ఏ నెలకానెల ప్రచురించే ప్రయత్నం చేశాము. అవసరమైన వాటికి తెలుగులో సంక్షిప్త వివరణ కూడా ప్రచురించాము.

**చర్చావేదిక :** నూతన పాఠ్య పుస్తకాలపై సమీక్ష, లెప్ శిక్షణ, గ్రేడింగ్ విధానం, అసర్ రిపోర్టు "దండన లేని బోధన సాధ్యం కాదా?" తదితర అంశాలపై సమాచారం అందించి పాఠకుల స్పందనను ఆహ్వానించి చర్చావేదికలో ప్రచురించాము.

డా॥ పి.ఎస్. ప్రకాశరావు, ఎన్.ఆర్.జె. వసుంధర, పి. రామనాథం, పారేపల్లి సత్యనారాయణ, పి. ప్రేమ్‌కుమార్, కె. సుధారాణి, జి. నరసింహాచార్యులు, ఎస్.డి. రవిప్రతాప్, జి. హనుమంతరావు, ఎం. ప్రేంకుమార్, పి. డేవిడ్‌పాల్, దానం శివప్రసాద్, వి. ప్రతాప్, జాడి మురళిలు ఈ చర్చావేదికలో పాల్గొన్నారు.

**పాఠకుల అభిప్రాయాలు :** పత్రికలోని రచనలు, శీర్షికలపైన అభిప్రాయాలను ఆహ్వానించగా పరిమిత సంఖ్యలో లేఖలు వచ్చాయి. మంకుశ్రీను, ఎం. నిర్మల్‌కుమార్, మద్దూరిపోలారావు, గ్రంధి శివప్రసాద్, ఎం. ఇమ్మానుయేల్ కృపాకరం, కె. అప్పారావు, ఒ.ఎస్.ఎన్. మూర్తి, బి. మల్లిఖార్జునరావు, రాగంకనక భాస్కరరావు, పారేపల్లి సత్యనారాయణ, ఎం. ప్రేమకుమార్, పి. సంజీవయ్య, సాదెగణపతిరావులు ఈ శీర్షికలో పాల్గొన్నారు.

**కథలు-కవితలు :** సామాజిక స్పృహ, అభ్యుదయ విలువలు కలిగిన కథలు, వ్యంగ్య రచనలు, గేయాలు, కవితలు ప్రచురించాము. ఔత్సాహిక రచయితలను ప్రోత్సహించే ప్రయత్నం చేశాము.

కె.శ్రీవిద్య, కె. కళ, బి. శీనయ్య, ఎ. విద్యాదేవి, జి. కృష్ణవేణి, బి. ఇందిర, బి. నరసింహారావు, ఉప్పులూరి ధనలక్ష్మి, సి.వి. కృష్ణయ్య, పెసరు లింగారెడ్డి, కె. వెంకటయ్య, పి. పాండురంగారావు, శాంతి వైద్య, ఎం. లక్ష్మీ మైథిలి, జి. లక్ష్మి, కర్రా కార్తికేయశర్మ, ఎస్.కె. మహబూబ్‌కమల్, అమ్మిన శ్రీనివాసరాజు, పి. గోపీనాథ్, వై. అనురాధ, మంకుశ్రీను, కోట్ల వెంకటేశ్వర రెడ్డి, సిహెచ్. రమేష్, మండలస్వామి, పాతూరి వెంకటేశ్వరరావు తదితరుల కవితలు, బి. నరసింహారావు, ఈరంకి ప్రమీలారాణి, చిరుమన వెంకటరమణ, రుక్మిణి, డి. శివప్రసాదరావు, ఎం.వి.వి.ఎన్. సౌమ్య, శిరంశెట్టి కాంతారావు, పెండెం జగదీశ్వర్, ఎ.వి.ఎన్.హెచ్.ఎస్. శర్మ, పి. గోపినాథ్, పి. రామలింగస్వామిల కథలు ప్రచురించాము.

**కథలు-కవితలు పోటీ ఫలితాలు :** కర్నూలులో నిర్వహిస్తున్న రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని 2010 సెప్టెంబర్-అక్టోబర్‌లో ఔత్సాహిక కవులు, రచయితలను ప్రోత్సహించాలని, పాఠకులకు మంచి సాహిత్యాన్ని అందించాలనే లక్ష్యంతో ఐక్య ఉపాధ్యాయ కథలు-కవితలు పోటీ-2010ని నిర్వహించాము. కథలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులను వరుసగా రు. 5000/-, 4000/-, 3000/-గాను, కన్సోలేషన్ బహుమతిగా రు. 1000/-, కవితలకు రు. 1000/-, 750/-, 500/-లుగాను, కన్సోలేషన్ బహుమతిగా రు. 300/-గా నిర్ణయించాము. రచయితలు, కవుల నుండి మంచి స్పందనే లభించింది. మొత్తం 165 కవితలు, 65 కథలు వచ్చాయి. రచనల స్థాయి ఆశించిన మేరకు లేకున్నప్పటికీ, ముగ్గురు న్యాయనిర్ణేతలు వివిధ కోణాల్లో పరిశీలించి వచ్చిన వాటిలో ఉత్తమమైన వాటిని బహుమతులకు మరికొన్నింటిని సాధారణ ప్రచురణకు ఎంపిక చేశారు.

న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన సాహితీ స్రవంతి బాధ్యులు తెలకపల్లి రవి, ఎం. నరహరి, వొర్రప్రసాద్‌లకు ధన్యవాదములు. పోటీలో పాల్గొన్న రచయిత/త్రులకు, కవులు / కవయిత్రులకు అభినందనలు.

**ప్రత్యేక వార్తలు :** రాష్ట్ర సంఘం నిర్వహించిన కార్యక్రమాలు, ప్రకటనలు, ప్రాతినిధ్యాలపై వివరణ వంటి అంశాలను ప్రత్యేక వార్తలుగా ప్రచురించాము.

**ఇంటర్వ్యూలు :** ప్రముఖులతో జరిపిన సంభాషణలను ఇంటర్వ్యూ రూపంలో ప్రచురించాము.

**కంప్యూటర్ విద్య :** ఫ్రీసాఫ్ట్‌వేర్ ఉద్యమాన్ని పరిచయం చేసి ప్రాచుర్యం కల్పించేందుకు, ఉపాధ్యాయులకు కంప్యూటర్ విద్యపై ఆసక్తిని కలిగించి పాఠ్య బోధనలో వినియోగించుకునేందుకు ఉపయోపడే విధంగా స్వేచ్ఛ సంస్థ సహకారంతో ఈ శీర్షికను నిర్వహించాము.

**ఎమ్మెల్సీ ఎన్నికలు :** 2011 మార్చిలో నిర్వహించిన 3 ఉపాధ్యాయ, 3 గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ ఎన్నికలలో సంఘం బలపరచిన అభ్యర్థుల గెలుపుకోసం ఐక్య ఉపాధ్యాయ తనవంతు కృషి చేసింది. నవంబర్ నుండి ఎన్నికల వార్తలు ప్రచురించడంతో పాటు 2000 కాపీలు అదనంగా ముద్రించి ఎన్నికల జిల్లాలకు పంపించాము.

**ఐక్య ఉపాధ్యాయపై సమీక్ష :** పత్రిక నాణ్యతను మెరుగు పరిచేందుకు, పత్రికారంగంలో నిపుణులైన ప్రముఖులకు మన పత్రికను పంపించి అభిప్రాయాలు తీసుకుంటున్నాము.

భాష, అచ్చు తప్పులు సరిచేసుకోవాలని, ఆదాయం కోసం అడ్వర్‌టైజ్‌మెంట్లు సేకరించుకోవాలని, పత్రిక చదవడం ద్వారా పాఠకులకు తాము కూడా ఆ సంఘంలో పని చేయాలనే ఉత్సుకతను రేకెత్తించేలా పత్రిక ఉండాలని తదితర పలు విలువైన సూచనలు చేశారు.

**రచయితల కార్యశాల :** ఐక్య ఉపాధ్యాయ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో రచయితల రాష్ట్ర స్థాయి కార్యశాల నిర్వహించాము. సంపాదక వర్గ సభ్యురాలు ఎం. సంయుక్త అధ్యక్షతన వహించిన ఈ కార్యశాలను యుటియఫ్ అధ్యక్షులు ఎన్. నారాయణ ప్రారంభించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, ప్రముఖ పాత్రికేయ తెలకపల్లి రవి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

**సర్క్యులేషన్ :** మన పత్రికపట్ల పాఠకులలో సానుకూల స్పందన లభిస్తున్నది. కానీ పత్రిక సర్క్యులేషన్ మాత్రం ఆ స్థాయిలో పెరగటం లేదు. 2009 ఆగస్టునాటికి వార్షిక చందాలు బాగా తగ్గిపోయి పత్రిక నష్టాల్లోకి పోతున్నదని ఆందోళన చెందాము. 2009 సెప్టెంబర్‌లో "స్పెషల్ డ్రైవ్" క్యాంపెయిన్ నిర్వహించాలని పిలుపునిచ్చాము. క్యాంపెయిన్‌కు ఉపయోగించేందుకు లక్ష కరపత్రాలను, రశీదు పుస్తకాలను ముద్రించి పంపించాము కాని పలు అవాంతరాల కారణంగా క్యాంపెయిన్ సాఫీగా సాగలేదు. కొన్ని జిల్లాల్లో కొందరు కార్యకర్తలు ప్రత్యేకంగా కేంద్రీకరించి చందాలు చేర్పించగలిగారు. అన్ని జిల్లాశాఖలు ఆ మేరకు కేంద్రీకరించలేదు. 2009 సంవత్సరానికి 28500 చందాలు చేర్పించాలని లక్ష్యంగా నిర్ణయించుకుంటే కేవలం 11729 పత్రికలు మాత్రమే చేర్పించగలిగాము.

**2010 సం॥లో కార్యకర్తల కృషి ఫలితంగా** ఆగస్టు నాటికి అత్యధికంగా 22266 వరకు సర్క్యులేషన్ పెరిగింది. వెంటనే రెన్యువల్స్ చేయించకపోవడం వల్ల నవంబర్ నాటికి ఒక్కసారిగా చందాల సంఖ్య 17883కి పడిపోయింది. తరువాత 12 జిల్లాల్లో కార్యకర్తలంతా ఎమ్మెల్సీ ఎన్నికల పనిలో తలమునకలై పత్రిక చందాల చేర్పింపు, రెన్యువల్స్‌పై దృష్టి పెట్టకపోవడంతో 2011 ఫిబ్రవరి నాటికి చందాల సంఖ్య 17023కి తగ్గిపోయినవి.

ప్రస్తుతం కార్యకర్తలు కొంత కేంద్రీకరించి చందాలు చేర్పిస్తున్న ఫలితంగా సర్క్యులేషన్ క్రమంగా పుంజుకుంటున్నది. 2011 ఏప్రిల్ 30 నాటికి కార్యాలయానికి అందిన చందాల ప్రకారం సర్క్యులేషన్ (వార్షిక చందాలు 10854, దశాబ్ది చందాలు 6680, జీవిత చందాలు 541, కాంప్లిమెంటరీలు-350) మొత్తం 18425గా వున్నది. 2011 ఏప్రిల్ చివరి రెండు మూడు రోజులలో రాష్ట్ర వ్యాప్తంగా ఎస్‌బిఐలో ఆన్‌లైన్ ఆక్కౌంట్‌లో జమచేసిన చందాలు (సుమారు రు. 4 లక్షలు) చిరునామాలు అందని కారణంగా సర్క్యులేషన్లో కలవలేదు.

సగటున ప్రతి ఐదుగురు యుటియఫ్ సభ్యులలో కనీసం ఒకరిని ఐక్య ఉపాధ్యాయ చందాదారులుగా చేర్పించాలని గత మహాసభలో లక్ష్యాన్ని నిర్ణయించుకున్నాము. కాగా నెల్లూరు జిల్లా 3060 చందాలతో 2.7 :1 నిష్పత్తితో అగ్రస్థానంలో ఉండగా, ఖమ్మం (3.9 :1), వరంగల్ (4.9:1), కరీంనగర్ (4.6:1), మహబూబ్‌నగర్ (4.6:1), నల్లగొండ (5.4:1), హైదరాబాద్ (3.2:1), తూర్పుగోదావరి (5.3 :1) జిల్లాలు ఆ లక్ష్యాన్ని చేరుకున్నాయి. పశ్చిమగోదావరి (6:1) లక్ష్యానికి చేరువలో ఉన్నది. సగటున 6.3 మంది సభ్యులకు ఒక పత్రిక చొప్పున చందాదారులున్నారు. మొత్తం ఉపాధ్యాయులతో పోలిస్తే 15 మందికి ఒక పత్రిక చొప్పున మన చందాలున్నాయి. జిల్లాల వారీగా సర్క్యులేషన్ వివరాలు పట్టికలో ఉన్నాయి పరిశీలించండి.

**దశాబ్ది చందాలు :** 2006లో రు.500/-చందాతో దశాబ్దిచందా పథకాన్ని ప్రారంభించాము. పెరిగిన ముద్రణా వ్యయం దృష్ట్యా 2010 ఏప్రిల్ నుండి చందాను రు. 600/-కు పెంచాము. 2011 ఏప్రిల్ 30 నాటికి 6680 చందాలు చేరాయి. 1149 చందాలతో పశ్చిమగోదావరి ప్రథమ స్థానంలో, 1075 పత్రికలతో తూర్పుగోదావరి ద్వితీయ స్థానంలోనూ, 1023 పత్రికలతో ఖమ్మం జిల్లా తృతయ స్థానంలోనూ ఉన్నాయి. మొత్తం దశాబ్ది చందాలలో 50% ఈ మూడు జిల్లాలలోనే ఉన్నాయి. జిల్లాల వారీ చందా వివరాలు పట్టికలో ఇవ్వబడినాయి.

**మిస్సింగ్స్ :** చందాదారులకు పత్రిక చేరడం లేదనే ఫిర్యాదులు 2010 జనవరి నుండి అధికమయ్యాయి. పోస్టల్ డిపార్ట్‌మెంట్ నిర్లక్ష్యమే మిస్సింగ్‌కు ప్రధానకారణంగా కనిపిస్తోంది. హైదరాబాద్‌లో పోస్టల్ సూపరింటెండెంట్‌కు ఫిర్యాదు చేశాము. లోపమంతా జిల్లా కేంద్రం లేదా ఆ క్రింది స్థాయిల్లోను జరుగుతుండవచ్చునన్నారు. క్రిందికి సమాచారం తెలియజేస్తామన్నారు కానీ ఫలితం కనిపించలేదు. చందాదారులెవరైనా పత్రిక రాలేదని ఫోన్, ఎస్ఎంఎస్ లేదా పోస్ట్ కార్డ్ (ఉత్తరం) ద్వారా సమాచారం ఇచ్చిన వెంటనే రు.2/- పోస్టేజితో పత్రికను మరల పోస్ట్ చేస్తున్నాము. ఇది అదనపు భారమే ఐనప్పటికీ చందాదారులకు అసౌకర్యం కలుగకూడదని భావిస్తున్నాము మిస్సింగ్ ఫిర్యాదులను పూర్తిస్థాయిలో అరికట్టడంలో వైఫల్యాన్ని అంగీకరిస్తున్నాము.

**ఆర్థిక పరిస్థితి :** 2009 ఫిబ్రవరి నుండి 2011 ఏప్రిల్ వరకు గడిచిన 27 నెలల కాలంలో పత్రిక నిర్వహణ ఖర్చు రు. 31,86,527/-లు. సగటున నెలకు రు. 1,18,020/-లు ఐనది. దశాబ్ది చందాల ఎఫ్‌డి రు. 8,25,000/-లు మినహాయించి మొత్తం ఆదాయం రు.30,54,320/-లు. సగటున నెలకు రు. 1,13,123/-లుగా ఉన్నది. సగటున నెలకు రు. 5,000/-లు లోటు ఉంటున్నది. న్యూస్ ప్రింట్ రేట్లు, సిబ్బంది వేతనాలు, పోస్టల్ సర్వీసింగ్ & హ్యాండ్లింగ్ చార్జీలు అధికంగా పెరిగినందున పత్రికపై ఆర్థిక భారం అధికమౌతున్నది. పత్రిక ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుచుకోవడం కోసం యాడ్స్, విరాళాల సేకరణ, చందాల సంఖ్య పెంచుకోవడంపై దృష్టి పెట్టాలి. చందా రేటును కూడా అనివార్యంగా పెంచవలసిన అవసరం ఉన్నది.

**చందారేట్ల పెంపు :** పత్రిక నిర్వహణా ఖర్చులు ఇబ్బడిముబ్బడిగా పెరిగినందున, సర్క్యులేషన్ ఆ స్థాయిలో పెరగపోవడం, యాడ్స్ సేకరించుకోలేకపోవడం వల్లనూ 2009 డిసెంబర్ నాటికి సాలీనా రు.2 లక్షలు నష్టం వచ్చింది. 2010 జనవరిలో నిర్వహించిన కార్యవర్గ సమావేశం నిర్ణయం మేరకు 2010 ఏప్రిల్ నుండి వార్షిక చందా రు.80/-, దశాబ్ది చందా రు.600/-గా పెంచాము. సంవత్సరం అనుభవంలో ఈ పెంపుదల సరిపోదని, పేజీల సంఖ్యకొద్దిగా పెంచి రేటును మరోసారి సవరించాలని ప్రతిపాదించగా, మార్చి 19, 20 తేదీలలో నిర్వహించిన యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గం చందారేట్లను వార్షిక రు. 100/-లు, 5 సంవత్సరాలకు 450/-లు, దశాబ్ది రు. 850/-లుగా మే 1 తేదీ నుండి అమలు చేయాలని నిర్ణయించింది. అయితే రాష్ట్ర మహాసభలు మే 9,10,11 తేదీల్లో నిర్వహిస్తున్నందున, అప్పటి వరకు పాత రేట్లనే కొనసాగించాలని కార్యకర్తలు అభ్యర్థించినందున, ఏప్రిల్ 30న జరిగిన రాష్ట్ర ఆఫీస్ బేరర్ల సమావేశం ఆమోదంతో చందారేట్ల పెంపుదల మే 12 నుండి అమలు చేయాలని నిర్ణయించనైనది.

**యాడ్స్ :** గత 26 నెలల కాలంలో పత్రికకు వచ్చిన అడ్వర్టైజ్‌మెంట్లు చాలా స్వల్పంగా ఉన్నాయి. సమాచార, పౌర సంబంధాల శాఖ నుండి 5, ఖమ్మం-1, రంగారెడ్డి-1, నెల్లూరు-1/2 పేజీ చొప్పున మొత్తం 7 1/2 పేజీల కలర్ యాడ్స్, సెంటర్-1, నల్లగొండ-2, ఖమ్మం - 1 1/2, నిజామాబాద్-1/2, హైదరాబాద్-1/4, గుంటూరు-1/4 పేజీ చొప్పున మొత్తం 5 1/2 పేజీల బ్లాక్ & వైట్ ప్రకటనలు మాత్రమే వచ్చాయి. 2010 జనవరి 17న నిర్వహించిన రాష్ట్ర కార్యవర్గ సమావేశంలో తీర్మానించిన మేరకు ప్రతినెల 2 జిల్లా శాఖలు కనీసం ఒక్కొక్క పేజీ యాడ్స్‌ను సేకరించి పంపించాలన్న నిర్ణయాన్ని ఖమ్మం, నల్లగొండ జిల్లాలు పూర్తిగా, రంగారెడ్డి,నెల్లూరు, నిజామాబాద్ జిల్లాశాఖలు పాక్షికంగానూ అమలు పరిచాయి. మిగిలిన జిల్లాలు స్పందించలేదు.

**విరాళాలు :** యుటియఫ్ సభ్యులు, శ్రేయోభిలాషుల ఉద్యోగ విరమణ, వివాహము, గృహప్రవేశం, పుట్టిన రోజు, వర్ధంతి వంటి సందర్భాలలో ఐక్య ఉపాధ్యాయ పత్రికకు విరాళాలు సేకరించి పంపించే సాంప్రదాయం పరిమితంగా కొనసాగుతున్నది. అటువంటి సందర్భాలలో రాష్ట్ర శాఖకు, ఐక్య ఉపాధ్యాయకు కాకుండా స్థానిక శాఖలకు, జిల్లా శాఖలకు విరాళాలు సేకరించడంపైనే దృష్టి కేంద్రీకరిస్తున్నారు. ఫోటోలు మాత్రం ఐక్య ఉపాధ్యాయలో ప్రచురించమంటున్నారు. ఇప్పటివరకు రు.500/- ఇస్తే ఫోటో మాత్రమే ప్రచురిస్తూ రు. 1000/- ఆపైన ఇచ్చినప్పుడు ఫోటోతోపాటు విరాళం ఇచ్చినట్లు ప్రకటిస్తున్నాము. పెరిగిన ముద్రణా ఖర్చులు, ఉపాధ్యాయుల వేతనాలను దృష్టిలో ఉంచుకొని ఇకమీదట రు. 1000/-పైగా విరాళం ఇచ్చినప్పుడే కలర్ ఫోటోలు ప్రచురిండం సమంజసంగా ఉంటుందని ప్రతిపాదిస్తున్నాము. గత మహాసభ అనంతరం ఐక్య ఉపాధ్యాయకు వచ్చిన విరాళాలు రు. 59072/-

**జిల్లాల వారీ వివరాలు :** ఖమ్మం -18000, తూర్పుగోదావరి -13560, చిత్తూరు-6016, నల్లగొండ-4632, హైదరాబాద్-4116, పశ్చిమగోదావరి13116, కృష్ణా-2632, గుంటూరు-1500, కరీంనగర్-1500, ఆదిలాబాద్-1500, రంగారెడ్డి-1500, గుంటూరు-500, వరంగల్-500 మొత్తం రు. 59072. దాతలకు మరియు సేకరించి పంపిన కార్యకర్తలకు ధన్యవాదములు.

**ఫోటోలు :** పత్రిక కవర్ పేజీపై రంగులలో ముద్రిస్తున్న ఫోటోలలో నాణ్యత లోపిస్తున్నది. ఉద్యమాలు, కార్యక్రమాలు నిర్వహించినప్పుడు పత్రిక కోసం ప్రత్యేకంగా ఫోటోలు తీయించి పంపించాలని పదేపదే చెప్పుకున్నప్పటికీ ఆచరణలో అమలు జరగడం లేదు. హైరిజల్యూషన్‌తో ఉన్న ఫోటోలను ఎంపికచేసి ప్రింట్ వేయించి పంపినా లేదా ఇ-మెయిల్‌లో పంపినా ముద్రణలో ఆకర్షణీయంగా వస్తాయి.

**కృతజ్ఞతలు :** పత్రికను నిరంతరాయంగా, ఉన్నంతలో ఆకర్షణీయం గానూ, విజ్ఞానదాయకంగానూ తీసుకురావడంలో తోడ్పడిన రచయిత/త్రులకు, కవులు, కవయిత్రులకు, అభిప్రాయాలు, సూచనలు తెలిపిన పాఠకులు, పెద్దలకు, యుటియఫ్ రాష్ట్ర కేంద్ర బాధ్యులకు, కవర్ పేజీ డిజైన్ చేయడంలో సహకరించిన చిత్రకారులు కె. ఆనందాచారి (ఖమ్మం), కరుణాకర్ (ఆర్టిస్ట్), జె. వెంకటేష్(ప్రజాశక్తి), గణేష్ (డిజైనర్), బసవేశ్వరరావు, మధు (ప్రజాశక్తి), ప్రజాశక్తి ఫోటోగ్రాఫర్స్ హరి, రమణ, ప్రతినెలా డిటిపి, కంపోజింగ్, పేజ్‌మేకింగ్ చేసిన బి. శిరీష్‌బాబు, జి. సత్యనారాయణ, విష్ణువర్ధని ఇతర కార్యాలయ సిబ్బందికి, ఎడిటింగ్, ప్రూఫ్ రీడింగ్‌కు సహకరించిన డి. మస్తాన్‌రావు, అనువాదకులు జి. నరసింహాచారి, పి.వి. కృష్ణారావు, జి. గోపాలకృష్ణ, ఎన్. సత్య నారాయణాచార్యులు గార్లకు, సమాచార శాఖ యాడ్స్ సేకరణకు సహకరించిన పిడిఎఫ్ ఛైర్మన్ సి. రామయ్యగారికి, సర్క్యులేషన్ పెంపుదలకు, పత్రిక అభివృద్ధికి నిరంతరం కృషి చేస్తున్న రాష్ట్ర, జిల్లా, మండల స్థాయి నాయకులు, కార్యకర్తలకు మరియు పత్రిక నిర్వహణలో ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ సహకరిస్తున్న ప్రతి ఒక్కరికీ పేరుపేరున ధన్యవాదములు తెలుపుకుంటున్నాము.

**ముగింపు :** సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావంతో మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలతోనే పెనవేసుకుపోతున్న తరుణంలో నమ్మిన ఆదర్శాల కోసం కొన్ని విలువలకు కట్టుబడి ఉపాధ్యాయులకు నిజాయితీగా సేవలందిచండంలో యుటియఫ్ కార్యకర్తలకు మరెవ్వరూ సాటిరాలేరు. అటువంటి సమరశీల పోరాట సంస్థ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికారవాణిగా ఐక్య ఉపాధ్యాయను పాఠకుల అభిరుచి, ఆకాంక్షలకు అనుగుణంగా తీసుకురావడంలో సంపాదకవర్గం ఒక మేరకు విజయం సాధించిందని అభిప్రాయ పడుతున్నాము. అయితే అదే సంపూర్ణమని సంతృప్తి చెందడం లేదు. నిర్వహణా లోపాలను అధిగమించాలి. పాఠకుల అభిరుచికి అనుగుణంగా వినూత్న శీర్షికలు, రచనలు, కార్యకర్తలు ఉపాధ్యాయులలో సామ్రాజ్యవాద, సరళీకరణ విధానాలకు వ్యతిరేకంగా, దేశభక్తిని పెంపొందించాలి. అవినీతి వ్యతిరేక పోరాటాన్ని సాగించటానికి అవసరమైన చైతన్యాన్ని కలిగించాల్సిన అవసరం ఉన్నది. ఈ బృహత్తర కర్తవ్య నిర్వహణ కోసం ఐక్య ఉపాధ్యాయను రాష్ట్రం నలుదిశలా విస్తరింపజేసి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాము.

పత్రిక నిర్వహణ మెరుగుదలకు, నాణ్యత పెంపొందించుటకు, ఆర్థిక పరిపుష్టిని సాధించుటకు అవసరమైన సూచనలు ఇవ్వాలని కోరుతున్నాము.

వందనములతో....

సంపాదకవర్గం పక్షాన

(సిహెచ్. రవి)

ప్రధాన సంపాదకుడు

# ఐక్య ఉపాధ్యాయ సర్క్యులేషన్

| క్ర. సం. | జిల్లా | 2010 ఫిబ్రవరి | | | | 2011 ఫిబ్రవరి | | | | 2011 ఏప్రిల్ 30 | | | | మొత్తం ఉపాధ్యా యులు | ఉపాధ్యా యులు పత్రిక నిష్పత్తి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | దశాబ్ది | జీవిత | మొత్తం | | |
| 1 | శ్రీకాకుళం | 297 | 16 | 2 | 315 | 356 | 21 | 2 | 379 | 209 | 22 | 2 | 233 | 11685 | 50:1 |
| 2 | విజయనగరం | 162 | 28 | 0 | 190 | 244 | 48 | 0 | 292 | 113 | 48 | 0 | 161 | 9674 | 60:1 |
| 3 | విశాఖపట్నం | 86 | 23 | 10 | 119 | 99 | 32 | 7 | 138 | 83 | 34 | 7 | 124 | 11047 | 89:1 |
| 4 | తూర్పుగోదావరి | 928 | 834 | 207 | 1969 | 1535 | 1,050 | 166 | 2751 | 1,247 | 1,075 | 166 | 2488 | 15875 | 6:1 |
| 5 | పశ్చిమగోదావరి | 770 | 724 | 79 | 1573 | 667 | 1,131 | 63 | 1861 | 548 | 1,149 | 63 | 1760 | 13042 | 7:1 |
| 6 | కృష్ణ | 618 | 345 | 64 | 1027 | 492 | 440 | 46 | 978 | 448 | 459 | 46 | 953 | 13759 | 14:1 |
| 7 | గుంటూరు | 484 | 361 | 27 | 872 | 683 | 486 | 22 | 1191 | 433 | 530 | 22 | 985 | 14979 | 15:1 |
| 8 | ప్రకాశం | 1,259 | 223 | 44 | 1526 | 930 | 306 | 41 | 1277 | 879 | 329 | 41 | 1249 | 13944 | 11:1 |
| 9 | నెల్లూరు | 86 | 61 | 82 | 229 | 337 | 145 | 23 | 505 | 2875 | 162 | 23 | 3060 | 12168 | 4:1 |
| 10 | చిత్తూరు | 376 | 41 | 15 | 432 | 470 | 47 | 12 | 529 | 410 | 151 | 12 | 573 | 15699 | 27:1 |
| 11 | కడప | 196 | 26 | 3 | 225 | 181 | 42 | 3 | 226 | 52 | 42 | 3 | 97 | 11859 | 122:1 |
| 12 | కర్నూలు | 486 | 35 | 1 | 522 | 450 | 61 | 4 | 515 | 332 | 69 | 4 | 405 | 12381 | 31:1 |
| 13 | అనంతపురం | 102 | 57 | 4 | 163 | 360 | 79 | 3 | 442 | 216 | 83 | 3 | 302 | 13081 | 43:1 |
| 14 | ఖమ్మం | 803 | 771 | 64 | 1638 | 621 | 1,006 | 49 | 1676 | 518 | 1,023 | 49 | 1590 | 11366 | 7:1 |
| 15 | వరంగల్ | 385 | 152 | 14 | 551 | 389 | 213 | 11 | 613 | 307 | 234 | 11 | 552 | 14028 | 25:1 |
| 16 | కరీంనగర్ | 82 | 30 | 4 | 116 | 268 | 36 | 4 | 308 | 303 | 38 | 4 | 345 | 13217 | 38:1 |
| 17 | అదిలాబాద్ | 184 | 120 | 21 | 325 | 181 | 167 | 18 | 366 | 129 | 171 | 18 | 318 | 10586 | 33:1 |
| 18 | ఎం. నగర్ | 285 | 204 | 47 | 536 | 399 | 274 | 24 | 697 | 355 | 287 | 24 | 666 | 14701 | 22:1 |
| 19 | నల్లగొండ | 647 | 254 | 10 | 911 | 769 | 285 | 9 | 1063 | 698 | 293 | 9 | 1000 | 12688 | 13:1 |
| 20 | నిజామాబాద్ | 90 | 45 | 9 | 144 | 27 | 54 | 8 | 89 | 26 | 57 | 8 | 91 | 9070 | 100:1 |
| 21 | మెదక్ | 230 | 13 | 4 | 247 | 167 | 19 | 4 | 190 | 164 | 19 | 4 | 187 | 10430 | 56:1 |
| 22 | రంగారెడ్డి | 314 | 86 | 1 | 401 | 235 | 117 | 1 | 353 | 290 | 163 | 1 | 454 | 8528 | 19:1 |
| 23 | హైదరాబాద్ | 391 | 183 | 27 | 601 | 322 | 241 | 21 | 584 | 219 | 242 | 21 | 482 | 7191 | 15:1 |
| 24 | ఇతరములు | | | | 315 | | | | 350 | | | | 350 | | |
| | మొత్తం | 9261 | 4632 | 739 | 14947 | 10182 | 6300 | 541 | 17373 | 10854 | 6680 | 541 | 18425 | 280998 | 15:1 |

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## 12వ రాష్ట్ర మహాసభలు 2011 మే 9,10,11 -కర్నూలు

## ఆమోదించిన తీర్మానములు

**1. ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతులు కల్పించాలి**

**2. ఉన్నత పాఠశాలల్లో ఐ.టి. విద్యను సమీక్షించాలి**

ఎ) కంప్యూటరు బోధకుల వేతనాలు జి.ఓ. 3 ప్రకారం చెల్లించాలి.

బి) ప్రతి పాఠశాలకు విద్యార్థుల సంఖ్యకనుగుణంగా కంప్యూటర్లను సరఫరా చేయాలి.

సి) ప్రధానోపాధ్యాయాలకు మరియు ఉపాధ్యాయులకు కంప్యూటరు విద్యపై అవగాహన కల్పించాలి.

డి) కంప్యూటర్ విద్యలో ఫ్రీ సాఫ్ట్‌వేర్‌ను వినియోగించాలి.

**3. రాజీవ్ విద్యామిషన్ కార్యక్రమాలపై సమీక్ష జరపాలి**

ఎ) గత సంవత్సరం వరకు ఉపాధ్యాయులకిచ్చిన శిక్షణా కార్యక్రమాలపై సమగ్రమైన సమీక్ష జరిపి; వచ్చే విద్యా సంవత్సరంలో శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయాలి.

బి) పాఠశాలలకిచ్చే గ్రాంటును విద్యార్థుల సంఖ్యకు అనుగుణంగా కేటాయింపులు చేయాలి.

**4. విద్యాహక్కు చట్టాన్ని సమగ్రంగా అమలు చేయాలి; చట్టంలో అవసరమైన మార్పులు చేయాలి.**

ఎ) 60కి లోపు ప్రతి ప్రాథమిక పాఠశాలలో ఇద్దరు రెగ్యులర్ ఉపాధ్యాయులుండే విధంగా చర్య తీసుకోవాలి.

బి) చట్టంలోని విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి ప్రకారం క్రొత్త పోస్టులు మంజూరు చేయాలి.

సి) సక్సెస్ ఉన్నత పాఠశాలలో ఇంగ్లీషు మీడియం సెక్షన్స్‌కు 7 స్కూలు అసిస్టెంటు పోస్టులు మంజూరు చేయాలి.

డి) ప్రాథమిక పాఠశాలలో ప్రీ ప్రైమరీ విద్యను అమలు చేయాలి.

**విద్యాహక్కు చట్టంలో చేయవలసిన మార్పులు**

ఎ) విద్యాహక్కు చట్టాన్ని 0-18 సంవత్సరాల వయస్సుగల బాలబాలికలందరికి అమలు చేయాలి.

బి) ప్రాథమిక పాఠశాలలో విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి 20:1గా మార్చాలి. పాఠశాల పోస్టులను శాశ్వత ప్రాతిపదికన భర్తీ చేయాలి.

**5. మధ్యాహ్న భోజన పథకం సక్రమంగా అమలు చేయాలి**

ఎ) బియ్యాన్ని ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు 150 గ్రాములు, ఉన్నత పాఠశాలలకు 200 గ్రాముల చొప్పున కేటాయించాలి.

బి) భోజనము అవసరమైన ఇతర పదార్థాలు మరియు వంట చెరుకు నిమిత్తం విద్యార్థి ఒక్కరికి పది రూపాయలు చెల్లించాలి.

సి) వంట ఏజెన్సీ వారికి పారితోషికము రు. 3000/-లకు పెంచాలి.

డి) వంట గదులు నిర్మాణానికి ప్రభుత్వ లెక్కల ప్రకారం బడ్జెట్ కేటాయించాలి.

ఇ) అవసరమైన విద్యార్థులకు ఉదయం టిఫిన్ ఏర్పాటు చేయాలి.

**7. ప్రాథమికోన్నత & ఉన్నత పాఠశాలలోని పండిట్, పిఇటి పోస్టులను అప్‌గ్రేడ్ చేయాలి**

**8. అన్ని పాఠశాలలకు నాన్ టీచింగ్ పోస్టులు మంజూరు చేయాలి**

**9. ఉపాధ్యాయుల సర్వీసు సమస్యలు పరిష్కరించాలి**

1. అంప్రెటిస్ విధానాన్ని రద్దు చేసి 2008 డిఎస్‌సి అభ్యర్థులకు రెగ్యులర్ టైమ్ స్కేలు ఫిబ్రవరి 2010 నుండి అమలు చేరయాలి.

2. జి.ఓ.2 ప్రకారం ప్రభుత్వ మరియు పంచాయితీరాజ్ యజమాన్యాలలో అప్రెంటిస్ ఉపాధ్యాయులకు మంజూరు చేసిన నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయడమైనది. కానీ ఎయిడెడ్, మున్సిపల్ మరియు గిరిజన సంక్షేమ శాఖలలోని ఉపాధ్యాయులకు కూడా వర్తింప జేయాలి. స్పెనల్ విద్యావాలంటీర్లుగా నియమించన వారికి, ట్రైనింగ్ లేకుండా నియమించబడిన ఎస్సీ, ఎస్టీ ఉపాధ్యాయులకు అన్‌ట్రైన్డ్ కాలానికి నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలి. అదే విధంగా రు. 398/-ల వేతనంతో స్పెషల్ టీచర్లుగా పనిచేసిన వారికి కూడ నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలి.

3. **పీఆర్‌సికి సంబంధించిన సమస్యలు**

ఎ) ఆర్‌పిఎస్-2010లో సీనియర్లకు జరిగిన నష్టాన్ని భర్తీ చేయుటకుగాను సర్వీసు వెయిటేజి ఇంక్రిమెంట్లు మంజూరి చేయాలి.

బి) పీఆర్‌సీ-1993లో వలెనే ఆటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కేళ్ళకు కూడ 6(g)(i) వర్తింప చేయాలి.

సి) ఎస్‌జిటి క్యాడరులో ఒకే డిఎస్‌సిలో ఒకేసారి నియమించబడి, తిరిగి ఒకే తేదీన స్కూలు అసిస్టెంట్లుగా వేర్వేరు సబ్జెక్టులలో ప్రమోషన్ పొందినవారిలో ఒకరికి స్టెప్‌అప్ వలన వేతనము పెరిగింది. రెండవ వ్యక్తి అటువంటి అవకాశము సంబంధిత సబ్జెక్టులో లభించలేదు. కావున వీరిద్దరి మధ్య వేతన వ్యత్యాసము సరిచేయుటకు అవసరమైన ఉత్తర్వులు జారీ చేయాలి.

4. యాక్ట్-37/05, యాక్ట్ 1/05ను ప్రాస్పెక్టివ్‌గా అమలు చేస్తూ యాక్టులకు సవరణలు చేయాలి.

5. అడ్‌హాక్ రూల్సు రూపొందించి, మండల విద్యాధికారి, డైట్ లెక్చరర్స్ మరియు ఉప విద్యాధికారి పోస్టులకు అన్ని మేనేజ్ మెంట్లలోని ఫీడరు క్యాటగిరీ ఉపాధ్యాయులతో పదోన్నతుల ద్వారా భర్తీ చేయాలి.

6. గతంలో యున్న విధంగా అన్ని మేనేజిమెంట్లలోని స్కూల్ అసిస్టెంట్లకు జూనియర్ లెక్చరర్సుగా పదోన్నతి కల్పించే ఉత్తర్వులను పునరుద్ధరించాలి.

7. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు సంవత్సరమునకు 30 సంపాధిత సెలవులు ఇస్తూ ఉపాధ్యాయులకు 6 మాత్రమే ఇవ్వడం చాలా అన్యాయం. 220 రోజులు పనిచేస్తున్న ఉపాధ్యాయులకు పని దినముల దామాషాలో సంపాదిత సెలవులు ఇవ్వాలి.

8. **ఎయిడెడ్ ఉపాధ్యాయుల మరియు పాఠశాలల సమస్యలు పరిష్కరించాలి.**

ఎ) ఎయిడెడ్ పాఠశాలలో ఖాళీల భర్తీపై యున్న నిషేధాన్ని ఎత్తి వేయాలి.

బి) బడ్జెట్ విడుదలతో సంబంధం లేకుండా ప్రతినెల 1వ తేదీన జీతాలు విడుదల చేయాలి.

సి) హెల్త్‌కార్డ్‌ల పథకము అమలు ఆలస్యం అగుచున్నందున, మెడికల్ రీయింబర్స్‌మెంటు సౌకర్యము కల్పించాలి. ఎల్‌టిసి సౌకర్యము కల్పించాలి.

డి) విద్యార్థులు లేని ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయులను ఇతర మేనేజ్‌మెంట్లలోని పాఠశాలలను పోస్టులతో సహ షిఫ్ట్ చేయాలి.

9. **మున్సిపల్ ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలి.**

ఎ) మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీసు రూల్సు ప్రకటించి అమలు చేయాలి.

బి) మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీసులను ప్రావిన్షియలైజేషన్ చేయాలి.

సి) మున్సిపల్ ఉపాధ్యాయులకు ఎల్‌టిసి మరియు ఏపిసిఎల్ఐని వర్తింప చేయాలి.

డి) విజయవాడ, విశాఖపట్నం మున్సిపల్ కార్పొరేషన్లలో పని చేయుచున్న ఉపాధ్యాయులకు 010 ద్వారా జీతాలు చెల్లించాలి.

10. **గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలి.**

ఎ) గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులకు సబార్డినేట్ సర్వీస్ రూల్స్ తక్షణమే విడుదల చేయాలి. జి.ఓ. 276 (బి) ప్రకారం మంజూరైన పోస్టులను ప్రమోషన్స్ ద్వారా వెంటనే భర్తీ చేయాలి.

11. మహిళా ఉపాధ్యాయులకు కేంద్ర ప్రభుత్వం అమలు చేస్తున్న విధంగా పిల్లల విద్య కొరకు రెండు సంవత్సరాల స్టడీ లీవు మంజూరు చేయాలి.

**ఇతర సమస్యలు**

1. చట్ట సభలలో మహిళలకు $33^1/_3\%$ సీట్లను రిజర్వు చేసే బిల్లును లోక్‌సభలో ప్రవేశ పెట్టి ఆమోదింప చేయాలి.
2. బలహీన వర్గాలకు నిర్మిస్తున్న ప్రభుత్వ గృహాలు మధ్యలో ఆగిపోయిన వాటిని అదనపు నిధులు కేటాయించి వెంటనే నిర్మాణాలను పూర్తి చేయాలి.
3. ఉన్నత విద్యలో విదేశీ యూనివర్సిటీల చొరబాటును నియంత్రించాలి.
4. ప్రైవేటు రంగంలోని ఉపాధ్యాయ శిక్షణా సంస్థలలో ప్రమాణాలు పెంపుకు అవసరమైన చర్యలు తీసుకోవాలి.
5. ఉన్నత విద్య, సాంకేతిక విద్యకు సంబంధించిన ఉపాధి అవకాశాలు, రాష్ట్ర, దేశీయ అవసరాలు దృష్టిలో పెట్టుకొని, ఆయా సంస్థలకు అనుమతులు జారీ చేయాలి.
6. సమ్మె హక్కును చట్టబద్ధం చేయాలి.
7. జి.ఓ. 177ను వెంటనే రద్దు చేయాలి. ఉద్యోగుల, ఉపాధ్యాయుల మరియు కార్మికులకు నిరసన తెలిపే హక్కును హరిస్తున్న జి.ఓ. 177ను రద్దు చేయాలి.
8. ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు శాసనమండలి సభ్యులను ఎన్నుకొనే ఓటు హక్కును కల్పించాలి.
9. జిపిఎఫ్ వడ్డీ రేటు కేంద్ర ప్రభుత్వం ఇస్తున్న విధంగా 2010-2011 ఆర్థిక సంవత్సరం నుండి 9.5% వర్తింప చేయాలి.
10. జిఐఎస్ చందా రేట్లు ప్రస్తుత వేతనాలతో పోల్చినపుడు చాలా తక్కువగా ఉన్నాయి. వాటిని రు. 50/-, 100/-, 150/-, 200/-లకు పెంచాలి.
11. ఏపిజిఎల్ఐ రికవరీల వివరాలను సర్వీస్ పుస్తకాల్లో నమోదు చేసి ఉద్యోగుల నుండి మినహాయించిన మొత్తాలను సర్వీస్ పుస్తకాల ఆధారంగా మిస్సింగ్ క్రెడిట్స్‌తో సంబంధం లేకుండా చెల్లించాలి.

## జి.ఓ. 55ను రద్దు చేయాలి

### రౌండ్‌టేబుల్ సమావేశంలో వక్తలు ఉద్ఘాటన

రాష్ట్ర ప్రభుత్వం క్రమబద్ధీకరణ పేరుతో విడుదల చేసిన క్రమబద్ధీకరణ ఉత్తర్వులు 55 వలన పాఠశాల విద్యారంగానికి, విద్యార్థులకు తీవ్రమైన నష్టం కలుగుతుందని, విద్యాహక్కు చట్టం స్ఫూర్తికి భిన్నంగా ఈ ఉత్తర్వులు ఉన్నాయని కావున ఈ ఉత్తర్వులు రద్దు చేయాలని రౌండ్‌టేబుల్ సమావేశంలో పాల్గొన్న ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు ప్రభుత్వానికి హెచ్చరిక చేశారు.

యుటియఫ్ ఆధ్వర్యంలో మే 16న రౌండ్ టేబుల్ సమావేశం యుటియఫ్ రాష్ట్ర కార్యాలయంలో రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా ఆయన యుటియఫ్ తరపున రౌండ్ టేబుల్ సమావేశానికి ప్రతిపాదించిన తీర్మానాన్ని పాల్గొన్న ఉపాధ్యాయ విద్యార్థి సంఘ ప్రతినిధులు ఏకగ్రీవంగా ఆమోదించారు. తీర్మానంపై జరిగిన చర్చలో గురుకుల ఉపాధ్యాయ, సిబ్బంది సంఘాల కాన్ఫడరేషన్ చైర్మన్ కె. రవిచంద్రర్, ఏపిటిఎఫ్(1938) అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు కె. సుబ్బారెడ్డి, వై. సత్యం, డిటిఎఫ్ అధ్యక్షులు కె.నారాయణరెడ్డి, ఎస్‌ఎల్‌టిఏ ప్రధాన కార్యదర్శి సి.చంద్రమోహన్, ఆపస్ రాష్ట్ర కార్యదర్శి ఆర్. గిరిధర్, యుటియఫ్ రాష్ట్రకార్యదర్శి సిహెచ్. రవి, ఎస్‌ఎఫ్‌ఐ రాష్ట్ర కార్యదర్శి కె. చంద్రమోహన్, డివైఎఫ్ఐ రాష్ట్ర కార్యదర్శి ఎం. బాలకాశి, ఆర్‌యుపిపి రాష్ట్ర నాయకులు డి. రవికుమార్, యుటియఫ్ హైదరాబాద్ జిల్లా ప్రధానకార్యదర్శి దేవదాస్ తదితరులు పాల్గొన్నారు.

## జాక్టా ఆవిర్భావం

2008 సమ్మె సందర్భంగా జాక్టో నాయకత్వం స్వార్థపరుల, పాలకుల కొమ్ముగాసే నాయకుల చేతికి పోయింది. ఒంటరిగానైనా పోరాటాల్లో ఛాంపియన్‌గా యుటియఫ్ ముందంజలో ఉన్నది. హైదరాబాదు జిల్లాలో జాక్టో పని తీరుతో విసిగిన సంఘాల బాధ్యులు యుటియఫ్‌తో కలిసి ఉద్యమాలు చేయడానికి సిద్ధపడ్డారు. యుటియఫ్ జిల్లా శాఖ చొరవతో UTF, DTF, T-STU, PRTU-TG, BTA, APPTA, STF, TTA, T-PETA, SLTA మొ॥ సంఘాల నేతృత్వంలో **"జాక్టా"** ఏర్పాటైంది. ఉపాధ్యాయుల ఆశలకు, ఆకాంక్షలకు అనుగుణంగా ఈ జాక్టా పనిచేస్తూ, కలిసొచ్చే అన్ని సంఘాలను కలుపుకొని విశాల వేదికగా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతుందని స్టీరింగ్ కమిటీ తెలిపింది.

**స్టీరింగ్ కమిటీ సభ్యులు :** మేడె దేవదాసు(UTF), ఎస్. మల్లయ్య (DTF), ఎం.ఏ. బాసీత్ ఖాన్ (T-STU), బి. నాగేశ్వర్ (PRTU-TG), పి. రామ సుబ్బారావు (BTA), షేక్ అఫ్జల్ (APPTA), ఎం.ఏ. మొయిద్ (STF), కె. శంకర్ నాయక్ (TTA), ఏ. షక్రూ (T-PETA), ఎస్. హనుమంతు (SLTA).

**కథల పోటీల్లో ద్వితీయ బహుమతి పొందిన కథ**




# సదువు సదువే - పని పనే

శారదా హన్మాండ్లు
నిజామాబాద్ జిల్లా

పొద్దు పొడుపు లేత కిరణాలు వెచ్చగా ముఖాన్ని తాకగానే ఉలిక్కి పడి కళ్ళు తెరిచాడు నారాయణ.

తుఫాను కారణంగా ఎడతెరిపిలేకుండా కురిసి అలసిపోయిన వాన ఒక్కసారిగా ఆగిపోయింది. మూడు రోజులుగా మేఘాల దుప్పట్లో వెచ్చగా నిద్దురపోయిన సూరీడు దర్శనమిచ్చాడు.

కోతకొచ్చిన పొలం కళ్ళముందు మెదిలింది నారాయణకు "మొత్తం పంటంతా నీళ్ళల్ల మునిగి ఉండచ్చు. మునగకుండా ఎలా ఉంటుంది. అకాల వర్షాలు ముంచడానికే వచ్చే, అనుకుంటూ పొలం వైపు అడుగులేశాడు భుజాన పారతో పొలాలన్ని చెఱువులయ్యాయి ఎక్కడ చూసినా నీళ్ళే. వరి అంతా నేలపై పన్నది. రైతులంతా పొలంల నిలిచిన నీళ్ళను వంపు వైపు కాలువలు చేసి పారిస్తున్నారు.

నారాయణకు పొలం పరిస్థితి చూసి గుండెదడ పెరిగింది ఈ యాడాది మంచిగ వానలు పడ్డయి. ఇల్లు గట్టిన బాకీ కొంత తీర్సేయాలని పెట్టుబడికి గూడా బాకీ జేసిన. బాకీల సంగతి దేవుడెరుగు తిండి గింజలు చేతికస్తె చాలు అనుకుంటూ గట్లకు గండ్లు తవ్వడం మొదలు పెట్టాడు.

ఎండ నడినెత్తికొచ్చె సుశీల ఇంకరాకపాయె. అనుకుంటూ ఊరి వైపు చూశాడు నారాయణ. నెత్తిమీద సద్దిగుల్లతో దూరంగా సుశీల కనబడింది. కాళ్ళు, చేతులు కడిగి ఒడ్డు మీద కూర్చున్నాడు నారాయణ.

ఉన్నోళ్ళింటికేలి వచ్చినా ఏనాడు దేనికీ సతాయించింది గుర్తులేదు. అవసరాలు ముందే గుర్తుపట్టి సంసారం సగబెట్టుట్ల సుశీలకు ఎవలూ సాటిరారు. ఇదే లేకుంటే నేను గిట్ల బతికెటోన్న. ఊర్లెగింత పేరున్నదంటే నా సుశీల జెయ్యంగనే అనుకుంటూ సుశీలవైపే చూస్తున్నాడు నారాయణ.

'గిదేందయ్య పంటంతా నేలపాలాయె చేసిన కష్టమంతా ఉట్టిగైపాయె. సంసారం ఎట్లా నడవాలా. అప్పులెట్లా తీరాలా. వానసల్లగుండ' అంటూ సద్దిగుల్ల దించింది. అన్ని మనం అనుకున్నట్లైతే ఇంక దేవుడెందుకే. ఎప్పటికి ఒక తీరుగనే ఉంటదా. కష్టం, సుఖం సూడాలా, నాల్గొద్దులు గట్టిగ ఎండకొడితే పంటగొంతయినా సేతికొస్తది.

'మన సేతిల ఏమున్నదయ్యా ఎట్లయితేగట్లాయేతే, తిందురా పొద్దుననగ వస్తివి. 'నువు జెల్ది అస్తనంటివి గదనే. బాగా పొద్దుపోయింది'.

'వాడు ఒక పట్టాన లేస్తనా. లేసినంకనన్నో మాటింటెనా. నేనే కొట్టం సాపుసేసి, బర్లుగొట్టేసి. అంతజేసుకొని అస్తి.

'నువ్వేమన్నను వాణ్ణి జూస్తేనే నాకు పెయ్యంత మంట. ఎద్దోలె పెరుగుతున్నడుగని దేనికీ పనికిరాడు. శెట్టంత కొడుకుంటె ఉల్టా బెదిరిస్తడు. వాడితోని సచ్చిన సావచ్చిందె సుశీలా.

ఏం జేద్దాం జెప్పు, మనకెట్లయినా సదువుసందెలు లేవు. వాడినన్న ఇంత సదిపిస్తే వాని తెలివివానికుంటది. ఇంత గొప్పగ బతుకుతడని బల్లె ఏస్తిమి. వాడేమో ఫేలయి ఇంట్లగుసుండె. ఐతమాయతీ ఇంత పనన్న నేరుస్తడేమోఅంటె వాడు పెయివంచకపాయె. 'పది సదివిన పెండ తీస్తనా' అంటడు. రెంటికి జెడ్డరేవడాయె ఆని బతుకు.

'అట్లగాదే సదువు సంగతి పక్కకు వెట్టు. గింతనన్న పెద్దోల్లంటె భయంలేదు. మాయమ్మ సచ్చియాడున్నదో 'అయ్యకు ఎదురాడద్దురా. అయ్యంటే ఏమనుకున్నవ్'. అని అంటుండె. గిప్పటికి ఎన్నడన్న మా అయ్యముంగట కూసున్ననా. ఎదురాడిన్నా. వీడి కెట్లచ్చెనే పోగాలంబుద్ధి.

'సదివెస్తే ఉన్నమతి పోయినట్లు నాలుగక్షరాలయితే అచ్చినయిగని పని ఇలువ తెలుసుకోలేదయ్యా వాడు. 'పని ఇలువ నేర్పని సదువేంటికే. వాడి బతుకెట్లారాసిండో దేవుడు. ఏంజేస్తాం మరి. మన చేతుల ఏమున్నది.

'గట్లా అనకయ్యా గిండ్లమన తప్పుకూడా ఉన్నది.

'మనమేం జేసినమే.

'ఏనాడన్నా బల్లె కాలుపెట్టినమా. నా కొడుకెట్ల సదువుతున్నడని అడిగినమా.

'గాముచ్చటంతా మనకెట్లర్థమయితదే. మనకేం తెలుస్తది. 'తెల్వది,తెల్వది అంటెనే గీడిదాకచ్చింది. ఎప్పటిదప్పుడు అరుసుకుంటె గిట్లఉండకుండె. నదువుకునేటోనికి పనేం జెప్పాలె అంటిమి. ఆడు పనిరాకుండబాయె.

'అంటె సిన్నప్పటి నుంచె పని జెప్పేదుండె అంటవా'.

'అవుమల్లా సదువు సదువే, పని పనే, చిన్నోన్నన్న గిప్పటి నుంచే దారిల బెట్టాలె. 'మంచి ముచ్చటంటివే లేకుంటే నడిసేటట్లులేదు. మరి పెద్దోనిగతేందే ఏం జేద్దామంటవ్.

వాని సంగతి నేజూసుకుంటగని మాటల్లవడి నువు సరిగతిననే లేదు. జర తిండి మీన ద్యాస వెట్టు. అంటూ సుశీల గుల్లసర్దింది. భర్తతో పాటు కాసేపు పొలంలో నడుం వంచింది. ఇంటికి వెల్తూ మంచె మీదకి పారిన ఆన్యపుతీగవెతికి ఒక కాయ తెంపుకొని బయలుదేరింది.

గోదూళి ఎర్రదనం. సందెవెలుగు ఎర్రదనంతో కలిసి వాతావరణం మరింత ఎర్రబడింది. పక్షుల కిలకిలలేవీ సుశీల చెవికి సోకడం లేదు. పెద్దోడి గురించే ఆలోచించుకుంటూ ఇల్లు చేరింది సుశీల.

చిన్నోడు బడినుండి వస్తూనే పుస్తకాల సంచి అరుగుమీద పడేసి వాకిట్లోకి పరుగు తీయబోయాడు. 'కాళ్లునొప్పిగా ఉన్నయి. బర్రల్ని జర కట్టేసి గడ్డేయిరా చిన్నోడా. అన్న తల్లి అరుపు విని వెనక్కితిరిగాడు చిన్నోడు.

మార్కులు తక్కువచ్చినయటగదా సార్ జెప్పిండు. పుస్తకాలు ముందేసుకొని కుసో. టి.వి. గివి అని పోయేవ్ అని గదమాయించింది సుశీల.

తల్లికి కోపం వస్తే ఏం జరుగుతుందో తనకు బాగా తెలుసు. అందుకే బుద్ధిగా తన ప్రణాళిక మార్చుకున్నాడు చిన్నోడు.

పెద్దోడు ఇంటికి వస్తూనే అమ్మా అన్నం అంటూ కంచం ముందు కూర్చున్నాడు. గిన్నెలో ఉన్న కొంచెం అన్నాన్ని వడ్డించింది సుశీల.

'గిదేందమ్మా సగం కడుపుకే వండినవ్'.

'అవుమల్ల ఒక్కడు జేస్తే ఐదగురం కూసుండి తినవడ్తిమి. సగం కడుపుకు గాకుంటే నిండ దొరుకుతదా కొడుకా. నాయ్నదుకాన్ల జీతం మాట్లాడొచ్చిండు. పొద్దుగాల్లేసి సద్ది గట్టిస్తపోయి బుద్ధిగా పనిచేసుకో'. అన్నది సుశీల

'నేను దుకాన్ల జీతముండను. మల్లా పరీక్షరాసేది ఉన్నదినాకు. నేపోను. అన్నాడు దూకుడుగా. సార్‌తోని మాట్లాడి ఫీజు గట్టి వచ్చిన. పరీక్షముందట ట్యూషన్ జెప్తనన్నడు. అప్పటిదాకా పనికి పో లేకుంటే అందరం సగం కడుపుకే తినాల'. అంటూ గిన్నెలు సర్ది అటుతిరిగి పడుకున్నది.

నాల్గురోజులుగా ఇంట్లో అందరికి కొద్దిగానే వంట జేసింది సుశీల కావాలని.

"అమ్మా నాయ్నతోని పొలం పనికి పోతా దుకాన్ల జీత ముండ అన్నడు. పెద్దోడు. ఇక కుదిరేటట్లులేదని.

'నీ ఇష్టంరా. ఏదైనా సరే మాకింత అన్నం పెట్టే పని నేర్చుకో సాలు'. అన్నది సుశీల కోటి దేవుళ్ళకు మనసులోనే మొక్కుకుంటూ.

సూర్యోదయంకన్నా ముందే నిద్రలేచి భుజాన కొడవలితో పొలంవైపు నడిచాడు. నారాయణ.

'హమ్మయ్య వరి గాలికి బాగా ఆరింది. అంటూ యథాలాపంగా వెనక్కి తిరిగి చూశాడు. నారాయణ ముఖం వెలిగిపోయింది. తనవెనుకే నడిచి వస్తున్న పెద్ద కొడుకుని చూసి.

చీకటి తెరల్ని చీల్చుకొని వెలుగులు విరజిమ్ముతున్నాడు సూర్యుడు.

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## రాష్ట్ర కార్యవర్గం ఆమోదించిన కర్తవ్యాలు

యుటియఫ్ రాష్ట్ర ఆఫీస్ బేరర్ల సమావేశం మే 29,30, కార్యవర్గ సమావేశం మే 31న ఏవిఎస్ చెన్నుపాటిభవన్, హైదరాబాద్‌లో ఎన్. నారాయణ అధ్యక్షతన నిర్వహించారు. జరిగాయి. మహాసభల సమీక్ష, ఆఫీసు బేరర్ల పని విభజన, సబ్ కమిటీల నియామకం, క్యాంపెయిన్స్, కోటాలు, రేషనలైజేషన్, బదిలీలు, ప్రచురణలు తదితర అంశాలపై చర్చించి రానున్న 3 నెలల కాలానికి ఈ క్రింది కర్తవ్యాలను నిర్ణయించారు.

12వ మహాసభల తర్వాత జరిగిన తొలి కార్యవర్గ సమావేశంనకు 89/120 (74%) హాజరయ్యారు.

### కర్తవ్యాలు

**1. క్యాంపెయిన్స్**: 2011 సంవత్సరమునకు సభ్యత్వం, జనరల్ ఫండ్‌ల క్యాంపెయిన్స్ ఆగస్టు 10లోగా పూర్తి చేయాలి. రాష్ట్ర కార్యవర్గం నిర్ణయించిన కోటాలను అధిగమించేందుకు జిల్లా శాఖలు, ఆఫీసు బేరర్లు, కార్యవర్గాలు వేసుకొని ప్రణాళిక సిద్ధం చేసుకోవాలి. విద్యావాలంటీర్లు, సిఆర్‌టిలను, కెజిబివి టీచర్లను యుటియఫ్ సభ్యులుగా చేర్చుకోవాలి. కంప్యూటర్ టీచర్ల సంఘాన్ని యుటియఫ్‌కు అనుబంధంగా నిర్వహించాలి.

**2. జూన్ 3,4,5 తేదీలలో ఆర్‌విఎం శిక్షణ కేంద్రాలలో** భోజన విరామ సమయంలో ప్రదర్శనలు చేయాలి. అప్రెంటిస్ రద్దు చేసి డిఎస్‌సి 2008 వారికి పూర్తి జీతం చెల్లించాలని, రేషనలైజేషన్ ఉత్తర్వులు రద్దు చేయాలని, భాషాపండితులు, పిఇటి పోస్టులు అప్‌గ్రేడ్ చేయాలని, మున్సిపల్, గిరిజన, ఎయిడెడ్ ఉపాధ్యాయ నోషనల్ ఇంక్రిమెంట్లు, 398 ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు యివ్వాలని కోరుతూ నిరసన ప్రదర్శనకు ఏర్పాట్లు చేసుకోవాలి.

**3. అప్రెంటిస్ రద్దు కోసం జూన్ 27 నుండి ఇందిరాపార్క్ వద్ద నిరవధిక నిరాహారదీక్షలు** : ఎన్.నారాయణ కొందరు అప్రెంటిస్ టీచర్లు, ఒక ఎమ్మెల్సీ నిరవధిక నిరాహారదీక్షలో కూర్చుంటారు. వీరికి మద్దతుగా ప్రతిరోజు 100 చొప్పున హైదరాబాద్‌లో రిలే దీక్షలో పాల్గొనాలి. దీక్షలకు మద్దతుగా అన్ని జిల్లా డివిజన్ కేంద్రాలలో అప్రెంటిస్ టీచర్లు సామూహిక నిరాహారదీక్షలు నిర్వహించాలి.

**4. దశల వారీ పోరాట కార్యక్రమం** : అన్ని మేనేజిమెంట్లలో పెండింగ్‌లోనున్న ప్రధాన సమస్యలు పరిష్కారం కోరుతూ జులై చివరి వారం, ఆగస్ట్ నెలల్లో 3 దశల పోరాట కార్యక్రమాలు నిర్వహించాలి. 1) మండల / పట్టణ కేంద్రాలలో ధర్నా, 2) జిల్లా కేంద్రాలలో ర్యాలీ ధర్నా, 3) రాష్ట్ర కేంద్రంలో ర్యాలీ, ధర్నా.

**5. యాజమాన్యం వారీ సమస్యలపై ప్రత్యేక కార్యాచరణ ఆగస్టు** నెలలో నిర్వహించాలి.

**6. వివిధ సంఘాలతో సమన్వయం** కంప్యూటర్ టీచర్లు, ఆశ్రమ, గురుకుల పాఠశాలల్లో సిఆర్‌టిల, పార్ట్‌టైమ్ టీచర్లు, కస్తూరిబా బాలికా విద్యాలయాల్లో టీచర్లు, కేంద్రీయ నవోదయ విద్యాలయాల ఉపాధ్యాయ సంఘాలతో సమన్వయం పెంచుకొని వారి పోరాటాలకు సహకారం అందించాలి.

**7. జాక్టా ఏర్పాటు** జాక్టోకు ప్రత్యామ్నాయంగా కలిసివచ్చే సంఘాలకు కలుపుకొని 'జాయింట్ యాక్షన్ కమిటీ ఆఫ్ టీచర్సు అసోసియేషన్' జాక్టాను ఏర్పాటు చేయాలి. జిల్లా స్థాయిలో కలిసివచ్చే సంఘాలతో పోరాటాలు, కార్యక్రమాలు నిర్వహించాలి.

**8. రేషనలైజేషన్ ఉత్తర్వులను తక్షణమే** రద్దు చేయాలని హైకోర్టులో యుటియఫ్ పక్షాన పిటిషన్ వేయాలి.

**9. ఆగస్ట్ 10న యుటియఫ్, ఆగస్ట్ 12న ఎస్‌టిఎఫ్ఐ** ఆవిర్భావ దినోత్సవాలు ఘనంగా నిర్వహించాలి.

పై కర్తవ్యాల అమలుకు ప్రణాళికబద్ధంగా కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

**10. సబ్ కమిటీల నియామకం : ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గంతో** పాటు మహిళ, అకడమిక్, ప్రచురణల కమిటీలను కార్యవర్గం నియమించింది.

**ప్రచురణల కమిటి :** చైర్మన్ సిహెచ్. సుభాస్‌చంద్రబోస్, కన్వీనర్ బి. నాగేశ్వర రావు, సభ్యులు 1. కె. వెంకట్రావు (ప్రకాశం), 2. టి.ఎస్.ఎల్.ఎన్. మల్లేశ్వర రావు (గుంటూరు),3. కె. సంజీవరెడ్డి (కృష్ణ),4. ఆర్. విక్రమ్‌రెడ్డి (ఖమ్మం), 5. ఎం.వి. రంగాచార్యులు (పశ్చిమగోదావరి),6. వై. నాగభూషణరావు (కృష్ణ),7. ఎన్. కుమార్‌రాజా (గుంటూరు),8. ఎన్. రమేష్ (హైదరాబాద్),9. డి. మల్లారెడ్డి (రంగారెడ్డి)

**అకడమిక్‌విభాగం :** చైర్మన్ డా॥ చుక్కా రామయ్య ఎమ్మెల్సీ, వైస్ చైర్మన్ వి. బాలసుబ్రహ్మణ్యం ఎమ్మెల్సీ, సెక్రటరీ ఎం.ఎ.కె.దత్, ఎక్స్ అఫిషియో **సభ్యులు** :1. ఎన్.నారాయణ, రాష్ట్ర అధ్యక్షులు, 2. ఐ. వెంకటేశ్వర రావు, రాష్ట్ర ప్రధానకార్యదర్శి, సభ్యులు 1. ఎం. వెంకటేశ్వర్లు (ప్రకాశం), 2. ఎం.వి. చలపతి (నెల్లూరు), 3. ఎస్. భాస్కర్‌రెడ్డి (ఎం.నగర్), 4. ఎం. కోటేశ్వర రావు (పశ్చిమగోదావరి), 5. జి. గోపాలకృష్ణ (ఖమ్మం), 6. ఆర్. నరసింహాచారి (రంగారెడ్డి), 7. పి.బి. శ్రీనివాస్ (విజయనగరం), 8. జి. అశోక్ (కరీంనగర్), 9. డి. శ్రీనివాస్ (నల్గొండ), 10. బి. మధుసూదనరావు (చిత్తూరు), 11. ఎన్. కుమార్ రాజా (గుంటూరు), 12. పి. రాందేవ్ (కృష్ణ).

**మహిళా విభాగం :** చైర్‌పర్సన్ ఎం. సంయుక్త, సెక్రటరీగా సిహెచ్. దుర్గాభవాని (ఖమ్మం), ఎక్స్ అఫిషియో సభ్యులుగా రాష్ట్ర కార్యవర్గ సభ్యులు 1. కె. విజయగౌరి (రాష్ట్ర కార్యదర్శి), 2. ఎం. విజయగౌరి (తూర్పుగోదావరి), 3. ఎస్. జయప్రభ (పశ్చిమగోదావరి), 4. పి. నవభారతి (కృష్ణ), 5. బి. కృష్ణతులసి (గుంటూరు), 6. ఎం. లక్ష్మి సుబ్బులు (ప్రకాశం), 7. డి. సుజాత (చిత్తూరు), 8. జి. ఉషాదేవి(నల్లగొండ), 9. డిఎల్.ప్రసన్నకుమారి (రంగారెడ్డి), 10. కె. రేణు (హైదరాబాద్), కమిటి సభ్యులు 11. ఎం. విజయలక్ష్మి (రంగారెడ్డి), 12. సిహెచ్. పద్మావతి (గుంటూరు), 13. ఆర్. శారద (హైదరాబాద్), 14. అజయ్ సంపత్ కుమారి(నెల్లూరు), 15. హేమలత (ఎం. నగర్), 16. వి. కనకదుర్గ (పశ్చిమగోదావరి), 17. రామలక్ష్మి (శ్రీకాకుళం), 18. జ్ఞాన మంజరి (మెదక్), 19. డా॥ ఏ. విద్యాదేవి (వరంగల్), 20. సరళ (నల్గొండ), 21. నిర్మల(విజయనగరం).

# సామాజిక న్యాయం సాధనలో ముందడుగు

## యుటియఫ్ నిరంతర పోరాట ఫలితమే ఎస్‌సి, ఎస్‌టి, బిసి, అన్‌ట్రైన్డ్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు



వి. వెంకటేశ్వర రావు
యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి

ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులు మరియు స్పెషల్ విద్యావాలంటీర్ల సమస్యల పరిష్కారం కోరుతూ యుటియఫ్ ఆధ్వర్యంలో జులై 2003 నుండి జనవరి 2011 వరకు దాదాపు 8 సంవత్సరాలు చేసిన పోరాటాలు, చివరగా జెఏసి ఒప్పందం ఫలించాయి. 2001 జనవరి 23న జెఏసి వేదిక మీద మంత్రుల కమిటీలో మన సంఘం తరపున రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ చేసిన వాదన ఫలించింది. జెఏసి ఒప్పందంపై మే 27న జి.ఓ. 69 ద్వారా ఎస్‌సి,ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు రెగ్యులర్‌స్కేలు పొందిన తేదీన రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చింది. ఈ ఉత్తర్వుల ద్వారా స్పెషల్ విద్యావాలంటీర్లుగా నియామకం పొందిన 10 వేల మందితోపాటు అంతకుముందు అన్‌ట్రైన్డ్‌గా అపాయింట్ అయిన సుమారు ఐదువేలమంది ఎస్‌సి, ఎస్‌టి ఉపాధ్యాయులు మొత్తం 15 వేలమందికి ఈ ఉత్తర్వుల వలన ప్రయోజనం చేకూరుతుంది. ఇది ఉపాధ్యాయ రంగంలో యుటియఫ్ సాధించిన సామాజిక న్యాయానికి సంబంధించిన విజయం.

2002లో బ్యాక్‌లాగ్ పోస్టుల భర్తీ కోసం అన్‌ట్రైన్డ్ అభ్యర్థులను డిఎస్‌సి ద్వారా ఎంపిక చేసిన ప్రభుత్వం 3 సం॥లోగా శిక్షణ పొంది వస్తే అప్రెంటిస్‌గా నియమిస్తానని షరతు విధించింది. నిరుద్యోగ ఎస్‌సి, ఎస్‌టి, బిసి ఉపాధ్యాయులను సమీకరించి యుటియఫ్ చేసిన పోరాట ఫలితంగా స్పెసల్ విద్యావాలంటీర్లుగా నియమించిన ప్రభుత్వమే దూర విద్య ద్వారా శిక్షణావకాశం కల్పించింది.

దానికొనసాగింపు పోరాట ఫలితంగా జి.ఓ. 748, తేది. 27.08.2004 ద్వారా శిక్షణా కాలాన్ని అప్రెంటిస్‌గా పరిగణిస్తామని, శిక్షణా కాలానికి ఫీజు మినహాయింపు, స్టైపెండు పెంపు, అన్ని రకాల సెలవులను అర్హత కల్పించడం వంటి సదుపాయలు ఈ ఉత్తర్వుల ద్వారా సాధించుకొన్నాము. అయితే స్పెషల్ విద్యావాలంటీర్లను రెగ్యులర్ పోస్టులలో నియామకం చేయుటకు ఇచ్చిన జి.ఓ. 130, తేది. 26.10.2005 ద్వారా ఆ రోజు నుండే రెగ్యులర్ ఉపాధ్యాయులుగా పరిగణించాలని పేర్కొనడంతో 2 సం॥ల 7 నెలల సర్వీసు కోల్పోయే ప్రమాదం దాపురించింది. ఆ సర్వీస్‌ని రక్షించాలని, అప్రెంటిస్‌గా పరిగణించి నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలని, పెన్షన్‌కు లెక్కించాలని, పిఎఫ్ వర్తింపు చేయాలని అనేక పోరాటాలు చేశాము. 748 జి.ఓ. అమలు కోసం న్యాయ పోరాటంలో సైతం విజయం సాధించాము. పీఆర్‌సి సిఫారసులకు అనుగుణంగా అప్రెంటిస్ సర్వీసును శిక్షణాకాలాన్ని పెన్షన్‌కు పరిగణించాలనే ఉత్తర్వులు 178, తేది. 17.05.2010 స్పెషల్ విద్యావాలంటీర్లకు వర్తింప చేయాలని కోరుతూ చేసిన యుటియఫ్ ప్రాతినిధ్యం మేరకు స్పెషల్ విద్యావాలంటీర్లకు జిపిఎఫ్ అకౌంట్స్ ప్రారంభించాలని ఆర్‌సినం. 48857/డి2-3/ 2010, తేది. 20.12.2010 డిఎస్‌సి ప్రొసీడింగ్స్ ఇచ్చారు. కొన్ని ఉపాధ్యాయ సంఘాల వత్తిడి మేరకు మరుసటి రోజునే దానిని రద్దు చేశారు. అందుకు నిరసనగా డిఎస్‌ఇ ముట్టడి చేశాము.

### స్పెషల్ విద్యావాలంటీర్లు, ఎస్‌సి, ఎస్‌టి అన్‌ట్రైన్డ్ టీచర్ల సమస్యలపై చేసిన ప్రత్యేక పోరాటాలు

స్పెషల్ విద్యావాలంటీర్లు, ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయుల సమస్యలను యుటియఫ్ సామాజిక కోణం నుండి పరిశీలించి, సామాజిక న్యాయం సాధించేందుకు ప్రభుత్వంతో అనేక ప్రాతినిధ్యాలు, పోరాటాలు చేసింది. జనరల్ సమస్యలపై జరిగిన పోరాటాలలో ప్రధాన డిమాండుగా పెట్టడంతోపాటు అనేక ప్రత్యేక పోరాటాలు నిర్వహించింది. ఎస్‌సి, ఎస్‌టి, కమీషన్ ద్వారా, మానవహక్కుల సంఘం ద్వారా ప్రభుత్వానికి లేఖలు పెట్టించడం జరిగింది. ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి నిరసనగా అంబేద్కర్ జయంతి రోజు ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించాము.

| | |
|---|---|
| 2003 జులై 24 | అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయుల సమస్యపై జిల్లా కేంద్రాలలో ధర్నాలు |
| 2004 జులై 27 | స్పెషల్ విద్యావాలంటీర్ల రాష్ట్ర ధర్నా |
| 2006 ఏప్రిల్ 13 | స్పెషల్ విద్యావాలంటీర్ల రాష్ట్ర ధర్నా |
| 2010 జనవరి 7 | స్పెషల్ విద్యావాలంటీర్లు, అన్‌ట్రైన్డ్ టీచర్ల రాష్ట్ర ధర్నా |
| 2010 జులై 21 | స్పెషల్ వి.వి.ల అన్‌ట్రైన్డ్ సమస్యలపై చలో సెక్రటేరియట్ |
| 2010 సెప్టెంబర్ 1-15 | ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలతో ముఖ్యమంత్రికి లేఖలు |
| 2011 జనవరి 5 | జిపిఎఫ్ అక్కౌంట్స్ ప్రారంభించాలని, ప్రభుత్వ పెన్షన్‌ను వర్తింప చేయాలని డైరెక్టరేట్ ముట్టడి |
| 2011 జనవరి 23న | జెఏసి అగ్రిమెంటులో ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు రెండు నోషనల్ ఇంక్రిమెంట్సు మంజూరుకు అంగీకారం. |
| 2011 మార్చి 28,29 | డివిజన్ కేంద్రాలలో ర్యాలీలు |
| 2011 ఏప్రిల్ 8 | రాష్ట్ర ధర్నా |

స్పెషల్ విద్యావాలంటీర్లు, అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయుల సర్వీసును అప్రెంటిస్‌గా గుర్తించి నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేసినందున వీరికి పాత పెన్షన్, జిపిఎఫ్ సౌకర్యం వర్తిస్తుంది.

### రేణుకకు ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు అభినందనలు

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో గుంటూరు జిల్లా ప్రథమ ర్యాంక్ సాధించిన కె.రేణుకా మాధురిని ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు అభినందించారు. యడ్లపాడు మండలం ఉన్నవ జెడ్పీహెచ్ స్కూల్ చదివిన మాధురి 580 మార్కులు సాధించడం అభినందనీయ మన్నారు. మరో విద్యార్థిని లక్ష్మీ సుప్రజ 569 మార్కులు సాధించింది. ప్రభుత్వ పాఠశాలలో చదివి అత్యుత్తమ మార్కులు సాధించి అందరికీ ఆదర్శంగా నిలిచారన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి పి. ప్రేమ్ కుమార్, ఉన్నవ జెడ్పీ ప్రధానోపాధ్యాయులు ఉమామహేశ్వర రావు తదితరులు పాల్గొన్నారు.

# రాష్ట్ర మహాసభల పతాక జాతాలకు ఆత్మీయ స్వాగతం

**యుటియఫ్ లోగడ 11 మహాసభలు నిర్వహించిన ప్రాంతాల నుండి ఉద్యమ పతాకాలను తీసుకొని కర్నూలుకు బయలుదేరిన జాతాలకు మార్గమధ్యంలో వివిధ యుటియఫ్ శాఖలు సాదరంగా స్వాగతం, వీడ్కోలు పలికారు.**

### తూర్పుగోదావరి జిల్లాలో మహాసభల జాతాల పర్యటన

మే 9,10,11 తేదీలలో కర్నూలులో నిర్వహించిన 12వ రాష్ట్ర మహాసభల సందర్భంగా తూర్పుగోదావరి జిల్లా నుండి ప్రథమ మహాసభ జాతా రాజమండ్రి, రజతోత్సవాల మహాసభ జాతా కాకినాడ నుండి బయలు దేరాయి.

**ప్రథమ మహాసభ జాతా :** రాజమండ్రిలో 1974లో జరుపబడిన ప్రథమ మహాసభ జాతా రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.ఎస్. ప్రసాద్ నాయకత్వంలో రాజమండ్రి, రాజానగరం, గండేపల్లి, జగ్గంపేట, పెద్దాపురం, రంగంపేట, అనపర్తి, మండపేట ఆలమూరు మీదుగా రావులపాలెం చేరింది. ఈ జాతాలో మాజీ రాష్ట్ర కార్యదర్శి పి. పుల్లయ్య, జిల్లా కార్యదర్శులు బి. వీర్రాజు, ఎ. షరీఫ్ వివిధ మండలాల కార్యకర్తలు, రాష్ట్ర కార్యవర్గ సభ్యులు తోలేటి సూర్యనారాయణ పాల్గొన్నారు.

**రజతోత్సవ జాతా :** 2000 సం॥లో కాకినాడలో నిర్వహించబడిన రజతోత్సవ జాతాను జిల్లా అధ్యక్షులు జి. ప్రభాకరవర్మ ఆధ్వర్యంలో నిర్వహించారు. ఈ జాతాను మాజీ జిల్లా గౌరవాధ్యక్షులు పి.వి. రాఘవులు జెండావూపి ప్రారంభించారు. ఉపజాతా జిల్లా ప్రధాన కార్యదర్శి కె. సత్తిరాజు ఆధ్వర్యంలో నిర్వహించడమైనది. డివైఎఫ్ఐ జిల్లా కన్వీనర్ పి. వీరబాబు జెండా ఊపి ప్రారంభించారు. 3 జాతాలు జిల్లాలో పర్యటించి పశ్చిమగోదావరి జిల్లా సిద్ధాంతం వద్ద భీమవరం మహాసభల జాతాతో కలిసి విజయవాడ, గుంటూరు మీదుగా కర్నూలు చేరుకున్నాయి.

### పతాక యాత్రకు స్వాగతం పలికిన గుంటూరు జిల్లా

తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాల పతాక యాత్రల జాతాకు మే 8వ తేదీ ఉదయం గుంటూరు జిల్లా సీతానగరం ప్రకాశం బ్యారేజ్ వద్ద యుటియఫ్ మంగళగిరి డివిజన్ శాఖలు స్వాగతం పలికాయి. 20 మోటారు సైకిళ్ళతో 40 మందికి పైగా కార్యకర్తలు యుటియఫ్ జెండాలతో నినాదాలతో జాతాను ముందు ర్యాలీగా మంగళగిరి పట్టణానికి తీసుకువచ్చారు. అనంతరం నాగార్జున యూనివర్శిటీ వరకు వెళ్ళి జాతాకు వీడ్కోలు పలికారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి ఎన్. కుమార్‌రాజా, జిల్లా నాయకులు డి.ఎం. కొండయ్య, యు. రాజశేఖర్, మంగళగిరి మండల, పట్టణ, తాడేపల్లి, తుళ్ళూరు శాఖల నాయకులు స్థానిక ప్రజా సంఘాల బాధ్యులు పాల్గొన్నారు.

### యుటియఫ్ జాతాలకు ఘన స్వాగతం పలికిన ఎం. నగర్ శాఖ

ఖమ్మం, నల్లగొండ మరియు హైదరాబాద్ జిల్లాల జాతాలు మహబూబ్‌నగర్ జిల్లాలోకి ప్రవేశించింది. ఈ జాతాకు షాద్‌నగర్, జడ్చర్ల శాఖలు స్వాగతం పలికి మహబూబ్‌నగర్ పట్టణానికి సాగనంపారు. మహబూబ్‌నగర్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఘనస్వాగతం పలికారు. ఈ జాతాలకు యుటియఫ్ రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త, ఖమ్మం జిల్లా గౌరవాధ్యక్షులు కళ్యాణం, నాగేశ్వరరావు, నల్గొండ జిల్లా అధ్యక్షులు ఎం. నాజశేఖర రెడ్డి, హైదరాబాద్ జిల్లా నాయకత్వం వహించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ నాయకులు ఎన్. వెంకటేశ్, కె. రవికుమార్, రామదాసు, రఘుపతిరెడ్డి, శంకరయ్య, అజయ్, కళ్యాణ్, హేమలత, ఉమ మొ॥ వారు పాల్గొన్నారు.

### కర్నూలు బయలుదేరిన హైదరాబాద్ జాతా

2వ మహాసభ జరిపిన ఖమ్మం జిల్లాలో జాతా ప్రారంభమై 11వ మహాసభలు జరిపిన నల్లగొండ చేరుకొని ఆ జాతాతో కలిసి 9వ మహాసభ జరిగిన హైదరాబాదుకు చేరుకున్నాయి. ఖమ్మం, నల్లగొండ జాతాలకు ఎల్బీనగర్ [illegible] హైదరాబాద్, రంగారెడ్డి జిల్లా శాఖలు ఘనస్వాగతం పలికాయి. రా[illegible]శాధికారి ఎం.సంయుక్త, హైదరాబాద్ జిల్లా కోశాధికారి ఎస్.వై. కొండలరావు, రంగారెడ్డి జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం. ఆంజనేయులు నాయకత్వంలో జాతాలను దోమలగూడ లోని రాష్ట్ర కార్యాలయానికి తోడ్కొని వచ్చారు. మే 8వ తేదీ ఉదయం హైదరాబాదు జాతా [illegible]ది. రాష్ట్ర అధ్యక్షుడు ఎన్. నారాయణ యుటియఫ్ జండా ఊ[illegible]ు ప్రారంభించారు. జాతా షాద్‌నగర్, జడ్చర్ల మీదుగా మహబూబన[illegible]గద్వాల్ ద్వారా కర్నూలు చేరుకుంది. కర్నూలులో రాష్ట్ర నేతలు ఐ. [illegible]కటేశ్వర రావు, సిహెచ్. సుభాష్‌చంద్ర బోస్, కె. విజయగౌరి, జిల్లా నాయకులు కె. సురేష్, నరసింహు[illegible] జాతాలకు ఆహ్వానం పలికారు. ఈ జాతాలో హైదరాబాద్ నుండ ఎం. సంయుక్త, ఎన్. రమేష్, ఇబ్రహీం, ఏ. రమాదేవిలు పాల్గొన్నారు.

### ఖమ్మం నుండి 2వ మహాసభల జాతా

యుటియఫ్ రాష్ట్ర మహాసభల ప్రచార జాతా మే 7న ఖమ్మం నుండి బయలుదేరింది. ఖమ్మం జిల్లా యుటియఫ్ వ్యవస్థాపక కన్వీనర్ ఆర్. రాఘవయ్య పతాకం ఊపి జాతాను ప్రారంభించారు. యుటియఫ్ రాష్ట్ర పూర్వ కార్యదర్శి ఎస్.డి. జియావుద్దీన్, జిల్లా ప్రధానకార్యదర్శి జి. రాజశేఖర్‌లు మాట్లాడుతూ యుటియఫ్ మహాసభల లక్ష్యాన్ని వివరించారు. జాతా విజయవంతంగా సాగాలని ఆకాంక్షించారు. ప్రచార జాతా సూర్యాపేట, నార్కెట్‌పల్లి, నల్లగొండ, హైదరాబాద్, జడ్చెర్ల, పెబ్బేరు మీదుగా పర్యటించి కర్నూలు చేరుకున్నది. ప్రచార జాతాకు జిల్లా గౌరవాధ్యక్షులు కళ్యాణం నాగేశ్వర రావు నాయకత్వం వహించగా, జిల్లా నాయకులు జి.వి. నాగమల్లేశ్వర రావు, ఉద్దండు, మధు, శ్రీనివాసరావు, క్రిష్ణ తదితరులు పాల్గొన్నారు. 100 ద్విచక్ర వాహనాలతో కార్యకర్తలు యుటియఫ్ కార్యాలయం నుండి ఖమ్మం పొలిమేరల వరకు ర్యాలీ నిర్వహించి జాతాకు వీడ్కోలు పలికారు. [illegible]నికి యుటియఫ్ జిల్లా నాయకులు సిహెచ్. దుర్గాభవాని, ఎన్. వీరబాబు, ఆర్. విక్రమ్‌రెడ్డి, ఎస్. నాగేశ్వర రావు, బి. సీతారాములు, కె. యమున, ఏ. రమాదేవి, ఆర్. వీరాస్వామి తదితరులు నాయకత్వం వహించారు.

### అట్టహాసంగా చిత్తూరు జిల్లా మహాసభలు

చిత్తూరు జిల్లా 12వ మహాసభలు ఏప్రిల్ 24,25 తేదీలలో చిత్తూరు అంబేద్కర్ భవనమునందు అట్టహాసంగా ప్రారంభమైనాయి. 24వ తేదీన ప్రారంభ సభను ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం ప్రారంభించి మాట్లాడారు. జిల్లాలో 576 పాఠశాలలు ఏకోపాధ్యాయ పాఠశాలలుగా మారనున్నాయని 200 పాఠశాలలకుపైగా 10లోపు పిల్లలున్న పాఠశాలలున్నాయన్నారు. ప్రభుత్వ పాఠశాలలను కాపాడు కోవలసిన బాధ్యత నేటి ఉపాధ్యాయులపై వున్నదన్నారు. ఎమ్మెల్సీ శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయులకు సంవత్సరంలో 220

రోజులు పాఠశాలలో పనిచేసే విధంగా వుండాలని శిక్షణా కార్యక్రమాలన్ని వేసవి సెలవుల్లోనే ఇవ్వాలని, ఏకోపాధ్యాయ పాఠశాలలు వుండరాదని ప్రతిపాఠశాలలో ముగ్గురు ఉపాధ్యాయులకు తక్కువ లేకుండా ఉండాలని తెలియజేశారు. జిల్లా పరిషత్ సిఇఓ నాగేశ్వర రావు మాట్లాడుతూ జిల్లా పరిషత్ పరిధిలో పాఠశాలల నిర్వహణపై మాకెలాంటి అధికారులు లేరని అయినా ప్రభుత్వ పాఠశాలల పరిరక్షణ కోసం తమ వంతు ప్రయత్నం చేస్తామన్నారు. పి.ఓ. చిట్టిబాబు మాట్లాడుతూ గత 10 సం॥గా విద్యారంగంలో అనేక మార్పులు తీసుకొచ్చినా విద్యార్థుల సంఖ్య ప్రతి సంవత్సరం తగ్గిపోతుందని ఆవేదన వ్యక్తంచేశారు. సమావేశానికి రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు, ఎన్.నారాయణ, రాష్ట్ర సహాధ్యక్షులు బాబురెడ్డి, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు జి. శ్రీరామమూర్తి, ఎన్. సోమచంద్రారెడ్డి, జిల్లా కార్యవర్గ సభ్యులు 1000 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. మధ్యాహ్నం ఎమ్మెల్సీల అభినందన సభ నిర్వహించడమైనది. అభినందన సభకు సిఐటియు, అంగన్వాడీ, ఆశ వర్కర్స్, జె.వి.వి. నాయకులు, కె.వి.పి.ఎస్. నాయకులు అధిక సంఖ్యలో పాల్గొని ఇద్దరు ఎమ్మెల్సీలను అభినందించారు. రెండవ రోజు 300 మందితో కౌన్సిల్ సమావేశం నిర్వహించి నూతన కార్యవర్గాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

**నూతన కమిటీ :** గౌరవాధ్యక్షులు పి. కోదండరెడ్డి, అధ్యక్షులు జి. శ్రీరామ మూర్తి, సహాధ్యక్షులు కె. రమణయ్య, కె. వరలక్ష్మి, ప్రధానకార్యదర్శి ఎన్. సోమచంద్రారెడ్డి, కోశాధికారి ఎన్. రవి ప్రకాశ్, కార్యదర్శులు : ఎస్. రెడ్డెప్ప, వై. చంద్రశేఖర్‌రెడ్డి, ఎస్ఎస్. నాయుడు, డి. నిర్మల, కె. ముత్యాలరెడ్డి, ఎన్. గుణశేఖర్‌రెడ్డి, టి. చంద్రశేఖర్‌రెడ్డి, టి. ఉత్తన్న, టి. సుబ్రహ్మణ్యం, ఎస్. ప్రేమ్‌కుమార్, కె.ఎస్.బి. సూర్యాప్రకాశ్, ఎం. సోమశేఖర్‌నాయుడు, ఎం. జనార్ధన్‌రెడ్డి, జి. రాధాకృష్ణ, టి.రఘుపతి రెడ్డి, మహ్మద్ షకీల్, ఎం. స్వామినాథం.

### అనంతపురం జిల్లా మహాసభ

యుటియఫ్ అనంతపురం జిల్లా 12వ మహాసభలు ఏప్రిల్ 29న అనంతపురంలో నిర్వహించారు. రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ, ఎమ్మెల్సీ డా॥ఎం. గేయానంద్, సిఐటియు జిల్లా ఉపాధ్యక్షులు జి. ఓబుళకొండారెడ్డి, జిల్లా జెఏసి సెక్రటరీ, ఎన్.జి.ఓ. సంఘ కార్యదర్శి జయరామప్ప, రాష్ట్ర కార్యదర్శి బి. నరసింహారావు, యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గ సభ్యులు బీరం సుబ్బారెడ్డిలు పాల్గొన్నారు.

మహాసభలు ప్రారంభిస్తూ రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ గత రెండు సంవత్సరాలుగా యుటియఫ్ ఒంటరిగాను, ఐక్య ఉద్యమంలో జెఏసి భాగస్వామిగా రాష్ట్ర వ్యాప్తంగా అనేక ఉద్యమాలు నిర్వహించి, అనేక ఫలితాలు ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, విద్యారంగానికి అందజేసిందన్నారు. ఎమ్మెల్సీ డా॥ గేయానంద్ మాట్లాడుతూ ఎమ్మెల్సీ ఎన్నికల్లో యుటియఫ్ కార్యకర్తలు మంచి కృషి చేశారని తన గెలుపు యుటియఫ్ గెలుపు అన్నారు. ఎమ్మెల్సీ హోదాను ఉద్యమాలకు, సమస్యల పరిష్కారానికి అంకితం చేస్తానన్నారు. జెఏసి కార్యదర్శి జయరామప్ప మాట్లాడుతూ యుటియఫ్ ఉద్యమాలు, నిర్మాణం, కార్యక్రమాలు మేలయినవన్నారు. సిఐటియు జిల్లా ఉపాధ్యక్షులు ఓబుళ కొండారెడ్డి మాట్లాడుతూ విద్యారంగాన్ని, వైద్యరంగాన్ని సామాన్యులకు అందుబాటులో లేకుండా ప్రైవేటు పరం చేసేందుకు ప్రభుత్వం కుట్ర పన్నిందంటూ ఐక్య ఉద్యమాలతో ప్రభుత్వ కుట్రలను ఎదుర్కోవాలని పిలుపునిచ్చారు.

అనంతరం జిల్లా ప్రధానకార్యదర్శి కార్యక్రమాల నివేదికను, కోశాధికారి పి. ఈశ్వరయ్య ఆర్థిక నివేదికన్ను ప్రవేశ పెట్టారు. ఈ సభలకు జిల్లా అధ్యక్షుడు సి.కె. నాగేంద్రబాబు అధ్యక్షత వహించారు. రాష్ట్ర కార్యదర్శి బి. నరసింహారావు పర్యవేక్షణలో జిల్లా నూతన కార్యవర్గం, ఆఫీస్ బేరర్సు, ఆడిట్ కమిటీ ఎన్నికలు ఏకగ్రీవంగా జరిగాయి.

**నూతన కమిటీ :** జిల్లా గౌరవాధ్యక్షులు ఎం. ఓబులేసు, అధ్యక్షులు సి.కె. నాగేంద్రబాబు, సహాధ్యక్షులు వి. శ్రీనివాసులు, సహాధ్యక్షురాలు టి.ఎల్. శారద, ప్రధానకార్యదర్శి ఎస్. మహమ్మద్‌జిలాన్, కోశాధికారి సి. ఈశ్వరయ్య, కార్యదర్శులు పి. ఈశ్వరయ్య, పి. సి. తాహెర్‌వలి, ఎన్. విజయభాస్కర్, ఎస్. జయచంద్రారెడ్డి, వి. గోవిందరాజులు, ఎం.వి. మారుతి శ్రీనివాస్, వి.కోటేశ్వరప్ప, ఎం. సుధాకర్, జి. శ్రీనివాసులు, కె. నాగేంద్ర, వై.ఎం. సుధారాణి.

**ఆడిట్ కమిటీ :** ఎన్. వేణుగోపాల్‌రెడ్డి (కన్వీనర్), సభ్యులు : వై. సాయినాథ్ బాబు, ఎన్. వెంకటేశులు, హెచ్. భాస్కర్, చంద్రశేఖర్ నాయుడు, ఎన్. సుధాకర్, కె. సిద్ధన్న.

### కడప జిల్లా మహాసభ

యుటియఫ్ కడప జిల్లా మహాసభలు ఏప్రిల్ 26న కడపనందు బీరం సుబ్బారెడ్డి అధ్యక్షతన నిర్వహించారు. రాష్ట్ర సహాధ్యక్షులు పి. బాబురెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడుతూ విద్యాహక్కు చట్టం నిబంధనల మేరకు జి.ఓ.55 ఇచ్చినట్లు చెబుతూ రేషనలైజేషన్ ఫలితంగా క్రొత్తగా ఉపాధ్యాయ పోస్టులను సృష్టించేది లేదని చెప్పటం అన్యాయమని అన్నారు. విద్యాహక్కు చట్టాన్ని సక్రమంగా అమలు చేస్తే అదనంగా ఉపాధ్యాయ పోస్టులు అవసరం ఉంటుందని అవసరమైన చోట అదనపు పోస్టులు సృష్టించాలని డిమాండ్ చేశారు. యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి బి. లక్ష్మిరాజ కార్యకలాపాల నివేదికను ప్రతిపాదించగా ప్రతినిధులు చర్చించి ఆమోదించారు. సహాధ్యక్షుడు ఎస్.ఓబుల్‌రెడ్డి, గౌరవాధ్యక్షుడు పి.వి. రమణారెడ్డి, ట్రెజరర్ ఎస్.వి. సుబ్బరాజు, జిల్లా కార్యదర్శులు పి.చంద్రశేఖర్, భూషణయ్య, విజయ్‌కుమార్, మృత్యుంజయరాజు వివిధ మండలాల నాయకులు కార్యకర్తలు పాల్గొన్నారు. అనంతరం నూతన కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

**నూతన కమిటీ :** గౌరవాధ్యక్షులు బీరం సుబ్బారెడ్డి, అధ్యక్షులు ఎస్. ఓబుల్‌రెడ్డి, సహాధ్యక్షులు ఎం. విజయ్‌కుమార్, ఉషా తులసి, ప్రధానకార్యదర్శి బి. లక్ష్మిరాజ, ట్రెజరర్ ఎస్.వి. సుబ్బరాజు, కార్యదర్శులు పి.వి. రమణారెడ్డి, పి. చంద్రశేఖర్, ఎం. నాగేశ్వర్‌గౌడ్, కె. భూషణయ్య, పి. నారాయణ, డి. క్రిష్టారెడ్డి, బి.పి.పి. విద్యాసాగర్, రూతు ఆరోగ్యమేరి, ఎస్. జాబీర్, లక్ష్మీ కుమార్. ఆడిట్ కమిటీ వై. మస్తాన్‌రెడ్డి (కన్వీనర్).

**హైదరాబాద్ జిల్లా నూతన కమిటీ :** గౌరవాధ్యక్షులు ఎన్. రమేష్, అధ్యక్షులు ఎస్.వై. కొండలరావు, సహాధ్యక్షులు డి. సంజీవరావు, కె. రేణు, కోశాధికారి ఏ. సింహాచలం, కార్యదర్శు : జి. సుబ్రహ్మణ్యం, కె. లక్ష్మణరావు, ఎం.డి. ఇబ్రహీం, ఆర్. రమాదేవి, కె.ఎల్.ఎన్. ఆచార్య, జి. నర్సింగరావు, ఎస్.వి. రామకృష్ణా, శ్రీనునాయక్, ఆడిట్ కమిటీ : జె. నరేందర్ (కన్వీనర్), సభ్యులు : హెచ్. శ్రీనాథ్, ఎం. సంజీవ, సి. నర్సింగరావు, బి. గీతావాణి

**రాష్ట్ర కార్యవర్గ సభ్యులు :** ఎన్. రమేష్, ఎస్.వై. కొండలరావు, కె.రేణు, ఎం. దేవదాస్

# 2008 డిఎస్‌సి ఉపాధ్యాయులకు పూర్తి జీతాల కోసం జిల్లా కలెక్టరేట్ల వద్ద పికెటింగ్‌లు

**నల్లగొండలో**

ఉపాధ్యాయుల అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేసి 2008 డిఎస్‌సి వారి పూర్తి జీతాలు చెల్లించాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ నల్లగొండ జిల్లాశాఖ ఆధ్వర్యంలో మే 24న జిల్లా కలక్టరేట్ ఎదుట పికెటింగ్ నిర్వహించారు.

ఈ సందర్భంగా రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు పాఠశాల విద్యారంగాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నాయని చట్టబద్ధమైన కట్టు బానిస వ్యవస్థ, అప్రెంటిస్ విధానం రద్దు కోసం 16 సం॥లుగా సంఘాలు నిర్వహించిన పోరాటాలు, 9వ పీఆర్‌సీ సిఫారసుల ఫలితంగా రద్దు చేస్తానని 2011 జనవరి 23న జెఏసికి వ్రాత పూర్వకంగా హామీ ఇచ్చిన ప్రభుత్వం ఉత్తర్వులు ఇవ్వకుండా తాత్సారం చేస్తున్నదని దీని ఫలితంగా 2008 డిఎస్‌సి ద్వారా నియామకమైన 45 వేలమంది ఉపాధ్యాయులు నెలనెలా వేలాది రూపాయలు నష్టపోతున్నారని ఆవేదన వెలిబుచ్చారు.

కలెక్టరేట్ ఎదుట పికెటింగ్ చేస్తున్న రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ, రాష్ట్ర కార్యదర్శి ఏ. నర్సిరెడ్డి, జిల్లా గౌరవాధ్యక్షులు ఎన్. బలరాం, జిల్లా అధ్యక్షులు ఎం. రాజశేఖర్‌రెడ్డి, ప్రధానకార్యదర్శి సిహెచ్. రాములు, కోశాధికారి ఎడ్ల సైదులు మొ॥ నాయకులతో సహా 300 మంది ఉపాధ్యాయులను అరెస్టు చేసి వన్‌టౌన్ పోలీస్ స్టేషన్‌కు తరలించారు. ఈ కార్యక్రమంలో పలువురు జిల్లా కార్యదర్శులు వివిధ మండలాల బాధ్యులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**సంగారెడ్డిలో**

ఉపాధ్యాయుల అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేసి డిఎస్‌సి 2008 టీచర్లకు రెగ్యులర్ పే స్కేలు ఇవ్వాలనే డిమాండ్‌తో యుటియఫ్ మెదక్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో మే 24న సంగారెడ్డిలో "కలెక్టరేట్ ముట్టడి" కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి టి. లక్ష్మారెడ్డి మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు పాఠశాల విద్యారంగాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నాయన్నారు. 9వ పీఆర్‌సీ సిఫారసు మేరకు అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేశారు. జిల్లా అధ్యక్షులు పి. బాలగోపాల్, యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు బి. సాయిలు, జిల్లా కార్యదర్శులు కె. పద్మారావు, పి. కిషన్, ఎన్. సుధాకర్, సాయితేజ తదితరులు పాల్గొన్నారు.

**కరీంనగర్‌లో**

డిఎస్‌సి 2008 ఉపాధ్యాయులకు రెగ్యులర్ స్కేల్ ఇవ్వాలనే డిమాండుతో మే 24న కరీంనగర్‌లో డిసిఇబి నుండి కలెక్టరేట్ వరకు 60 మంది ఉపాధ్యాయులతో ర్యాలీగా వెళ్లి కలెక్టరేటు కార్యాలయాన్ని ముట్టడించనైనది. ఈ కార్యక్రమంలో అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు టి. రాజేష్, కె. భూంరెడ్డిలు పికెటింగును ఉద్దేశించి మాట్లాడుతూ కట్టుబానిస వ్యవస్థయైన అప్రెంటిస్‌షిప్ విధానాన్ని వెంటనే రద్దు చేసి డిఎస్‌సి 2008 ఉపాధ్యాయులకు రెగ్యులర్ వేతనాన్ని మంజూరు చేయాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా నాయకులు జి. అశోక్, ప్రతాపరావు, శ్రీనివాసరావు దేశ్‌ముఖ్, ఏ. లక్ష్మారెడ్డి, అరుణ్‌కుమార్, వి. రాజగోపాల్, వి. శ్రీకాంత్, కమలాకర్, మురళీధర్, తిరుపతి, చంద్రశేఖర్‌రావు, శ్రీధర్ రెడ్డి, రమణారెడ్డి మరియు డిఎస్‌సి 2008 ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**కర్నూలులో**

అప్రెంటిస్ విధానం అంతానికై చేస్తున్న అంతిమ పోరాటంలో భాగంగా మే 24న కర్నూలులో కలెక్టరేట్‌ను ముట్టడించారు. దాదాపు 200 మంది ఉపాధ్యాయులు యుటియఫ్ జెండాలు, ప్లకార్డులతో 2 గంటలపాటు కలెక్టరేట్‌ను ముట్టడించారు. ఈ కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా అధ్యక్షుడు ఎన్. నరసింహుడు అధ్యక్షత వహించగా జిల్లా నాయకులు కె. సురేష్‌కుమార్, డి. రామశేషయ్య, బి. మాణిక్యంశెట్టి, పి. భాస్కర్, డి.ఎన్. కాశయ్య, ఎస్.వి.రమణమ్మ, చాముండేశ్వరి, బి. ప్రతాప్, వెంకటేశుడు, లక్ష్మయ్య, నాగరాజు, మూర్తు జవలి, జయరాజు, రవికుమార్ తదితరులు పాల్గొని మాట్లాడారు.

ప్రధానోపాధ్యాయుల సంఘం జిల్లా కార్యదర్శి పి. సుభాన్ హాజరై పోరాటానికి సంఘీభావం ప్రకటించారు.

**అనంతపురంలో**

అప్రెంటిస్ విధానాన్ని వెంటనే రద్దు చేసి డిఎస్‌సి 2008 టీచర్లకు వారి నియామకపు తేదీ నుండి టైం స్కేల్‌లో ఎరియర్స్‌తో పూర్తి వేతనాలు చెల్లించాలనే ప్రధాన డిమాండ్‌తో అనంతపురం యుటియఫ్ ఆధ్వర్యంలో కలెక్టరేట్‌ను ఉపాధ్యాయులు ముట్టడించారు. శాంతియుతంగా పికెటింగ్ చేస్తున్న ఉపాధ్యాయులను పోలీసులు రంగ ప్రవేశం చేసి ఈడ్చుకెళ్ళి అరెస్టు చేశారు. అరెస్టు అయిన వారిలో జెఏసీ జిల్లా సెక్రటరీ జయరామప్ప, యుటియఫ్ నాయకులు నాగేంద్రబాబు, మహమ్మద్ జిలాన్, శ్రీనివాసులు, ఈశ్వరయ్య, సుధాకర్, కోటేశ్వరరావు, నాగేంద్ర, భాస్కర్, జనార్ధన్, వివిధ మండలాల నాయకులు, ఉపాధ్యాయులు వున్నారు. ఈ ఆందోళనా పోరాటానికి సిఐటియు జిల్లా ఉపాధ్యక్షులు రాంభూపాల్‌రెడ్డి సంఘీభావం తెలియజేశారు.

**కాకినాడలో**

ఉపాధ్యాయుల అప్రెంటిస్ విధానం రద్దు చెయ్యాలని, డిఎస్‌సి 2008 వారికి పూర్తి వేతనాలు చెల్లించాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ తూర్పుగోదావరి జిల్లా శాఖ ఆధ్వర్యంలో మే 24న కాకినాడ కలెక్టర్ కార్యాలయాన్ని ముట్టడించారు. ఈ కార్యక్రమానికి జిల్లాశాఖ అధ్యక్షులు జి. ప్రభాకరవర్మ అధ్యక్షత వహించగా రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.ఎస్. ప్రసాద్ ప్రారంభించారు. జిల్లా ప్రధానకార్యదర్శి కె. సత్తిరాజు, కె. విజయకుమారి, ఎన్.వి. పద్మావతి, టిజివివిఆర్ చక్రవర్తి, వై.వి.వి. రామారెడ్డి, ట్రెజరర్ టి. అన్నా రాము కాకినాడ డివిజన్ పరిధిలో గల శాఖల బాధ్యులు, ఉపాధ్యాయులు 200 మంది పాల్గొన్నారు.

**మహబూబ్‌నగర్‌లో**

యుటియఫ్ ఆధ్వర్యంలో మే 24న మహబూబ్‌నగర్ కలెక్టరేట్ ముందు పికెటింగ్ నిర్వహించారు. ఈ పికెటింగ్‌నుద్దేశించి యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎన్. కిష్టయ్య, వెంకటప్పలు

ప్రసంగిస్తూ చట్టబద్ధమైన కట్టుబానిస విధానం అప్రెంటిస్‌ను రద్దు చేసే వరకు పోరాటం కొనసాగిస్తామని అన్నారు. ఈ పికెటింగ్‌లో యుటియఫ్ సీనియర్ నాయకులు ఏ.పి. మల్లయ్య, జిల్లా సహాధ్యక్షులు హేమలత, జిల్లా కార్యదర్శులు సీత్యానాయక్, నారాయణ, నాయకులు ఎన్. వెంకటేష్ రవికుమార్, కళ్యాణం, తావుర్య నాయక్, ఉమాదేవి, ఖాదరయ్య, భాస్కర్‌రెడ్డి, అజయ్, ఎస్ఎల్‌టిఏ అధ్యక్షులు సురేంద్రనాథ్ తదితరుల నాయకత్వంలో నిర్వహించారు.

**ఖమ్మంలో**

అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని, అన్‌ట్రైన్డ్, స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ ఖమ్మం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఉపాధ్యాయులు మే 24న ఖమ్మం జిల్లా కలెక్టరేట్‌ను ముట్టడించారు. అక్కడ ఉపాధ్యాయుల్ని ఉద్దేశించి ఎమ్మెల్సీ చుక్కారామయ్య ప్రసంగించారు. అప్రెంటిస్ రద్దు చేస్తామని ఇచ్చిన హామీని నెరవేర్చాలని పిడిఎఫ్ ఎమ్మెల్సీలు శాసన మండలి లోపల, యుటియఫ్ బయట ఆందోళనలు చేసినా ప్రభుత్వం స్పందించడం లేదని విమర్శించారు. ఉపాధ్యాయులు కలెక్టరేట్‌ను ముట్టడించడం ప్రభుత్వానికే అవమానకరమని అన్నారు. యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు కె. నాగేశ్వర రావు, సహాధ్యక్షులు బి. రాందాసు ఉపాధ్యాయుల్ని ఉద్దేశించి ప్రసంగించారు.

అనంతరం తీవ్ర ఉద్రిక్తత, పెనుగులాటల మధ్య పోలీసులు ఎమ్మెల్సీ చుక్కా రామయ్య, యుటియఫ్ జిల్లా నాయకులు, వందలమంది కార్యకర్తల్ని అరెస్టు చేసి 2 టౌన్ పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అనంతరం వ్యక్తిగత పూచికత్తుపై విడుదల చేశారు. కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి జి. రాజశేఖర్, సి.హెచ్. దుర్గాభవాని, సహాధ్యక్షులు, కార్యదర్శులు ఎన్. వీరబాబు, ఆర్. విక్రమ్‌రెడ్డి, ఎస్. నాగేశ్వర రావు, బి. సీతారాములు, జె. రాంబాబు, కె. యమున, ఆర్. వీరాస్వామి, టి. ఆంజనేయులు, ఆర్. బ్రహ్మారెడ్డి, ఏ. రమాదేవి, ఏ. నరసింహారావు తదితరులు నాయకత్వం వహించారు.

**రంగారెడ్డిలో**

అప్రెంటిస్ విధానం రద్దు, డిఎస్‌సి 2008 టీచర్లకు టైంస్కేలు డిమాండ్లతో యుటియఫ్ రాష్ట్ర వ్యాపిత పోరాటంలో భాగంగా మే 31న రంగారెడ్డి జిల్లా కలెక్టరేట్ వద్ద టీచర్ల పికెటింగ్ జరిగింది. పికెటింగ్‌లో పాల్గొన్న టీచర్లనుద్దేశించి జిల్లా అధ్యక్షులు పి. మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు పాఠశాల విద్యారంగాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నాయని అన్నారు. జిల్లా ప్రధానకార్యదర్శి ఎం. ఆంజనేయులు మాట్లాడుతూ అసంబద్ధ రేషనలైజేషన్‌తో ప్రభుత్వ విద్యారంగాన్ని నిర్వీర్యం చేయదలచుకున్నట్లు కన్పిస్తున్నదని అన్నారు.

డిడిఆర్‌సి సమావేశం కారణంగా ఉన్న గట్టి బందోబస్తును సైతం లెక్క చేయక పికెటింగ్ చేస్తున్న యుటియఫ్ నాయకులకు పోలీసులు అరెస్టులు చేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా గౌరవాధ్యక్షులు డి. మల్లారెడ్డి, సహాధ్యక్షులు ఎస్. రాజశేఖర్, డిఎల్. ప్రసన్న కుమారి, కోశాధికారి ఇ. గాలయ్య, కార్యదర్శులు ఎం. విజయలక్ష్మి, జి. వందన, ఎ.జగదీశ్వర్, పి.శ్రీధర్, సి.హెచ్ వెంకట రత్నం, జి.బాల్‌కోటి, యు.విఠల్ తో పాటు వివిధ మండలాలనుంచి బాధ్యులు పాల్గొన్నారు.

**గుంటూరులో**

ఉపాధ్యాయ నియామకాల్లో అప్రెంటిస్ విధానం రద్దు చేసేంత వరకు పోరాటం కొనసాగుతూనే వుంటుందని యుటియఫ్ నాయకులు హెచ్చరించారు. డిఎస్‌సి 2008 ద్వారా నియామక పొందిన ఉపాధ్యాయులకు వెంటనే పూర్తిగా జీతాలను చెల్లించాలని కోరుతూ మే 24న గుంటూరు జిల్లా కలెక్టర్ కార్యాలయాన్ని ముట్టడించారు. ఈ సందర్భంగా ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు మాట్లాడుతూ జనవరి నెలలో జరిగిన సంయుక్త కార్యాచరణ మండలితో ఒప్పందం కుదిరినప్పటికీ ప్రభుత్వం మొండిగా వ్యవహరిస్తుం దన్నారు. యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి ఎన్. తాండవకృష్ణ, జి. ప్రభుదాస్,జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం. హనుమంతరావు తదితరులు మాట్లాడుతూ సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేశారు.

**అమలాపురంలో**

అప్రెంటిస్ విధానం రద్దు కోరుతూ అమలాపురం డివిజన్‌లోని యుటియఫ్ కార్యకర్తలు సుమారు 300 మంది ఆర్‌డిఓ కార్యాలయమును ముట్టడించారు. కదలి సత్యనారాయణ, యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గ సభ్యులు టి. కామేశ్వర రావు, వ్యవసాయ కార్మిక సంఘం నాయకులు ఎం. రాజశేఖర్, ఐద్వా నాయకురాలు రమణి, కె.వి.పి.ఎస్. నాయకులు కారెం వెంకటేశ్వర రావు, సిఐటియు నాయకులు వసంత్‌కుమార్, ఎస్ఎఫ్ఐ నాయకులు సందేశాలు ఇచ్చారు. ఉదయం 9 గంటల నుండి మధ్యాహ్నం 11.30 వరకు పికెటింగ్ జరిగింది. పోలీసులు రంగప్రవేశం చేసి సుమారు 150మంది ఉపాధ్యాయులను అరెస్టు చేశారు. ఈ కార్యక్రమంలో పోలీస్ స్టేషన్ వద్ద అమలాపురం డివిజన్ జెఏసి చైర్మన్ వి.ఎస్. దివాకర్ సంఘీభావ తెలిపారు. జిల్లా ఆడిట్ కమిటీ సభ్యుడు పెంకే వెంకటేశ్వర రావు తదితరులు నాయకత్వం వహించారు.

**రంపచోడవరంలో**

అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని కోరుతూ మే 24న ఐటిడిఏ రంపచోడవరం ఎదుట యుటియఫ్ జిల్లా కార్యదర్శి టి.జి. వాషింగ్టన్ అధ్యక్షతన యుటియఫ్ ధర్నా కార్యక్రమము నిర్వహించారు. యుటియఫ్ జిల్లా కార్యదర్శి కె. వరప్రసాదుబాబు ప్రారంభించారు.

ధర్నా అనంతరము ఐటిడిఏ వద్ద నుండి ఆర్‌డివో కార్యాలయం వరకు ర్యాలీ చేసుకుంటూ వెళ్ళి ఆర్‌డిఓ గారికి వినతి పత్రాన్ని అందజేశారు. ఈ కార్యక్రమంలో ఏజెన్సీ ఏడు మండలాల బాధ్యులు కె. సూరిబాబు, ఇ. చైతన్యకిరణ్, వి. సత్యనారాయణ, ఎస్. నాగప్రసాద్, ఎ. గాంధీ, పిఎల్ రాజేష్, ప్రభాకర్‌రెడ్డి, సి.హెచ్. ప్రేమ్‌కుమార్, కె. సోమిరెడ్డి, డి. సూరిబాబు, రస్కిన్, శ్రీనివాస్, తమ్మన్నదొర మరియు 100 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### కడప ఆర్‌డిఓ కార్యాలయం ముట్టడి

ఉపాధ్యాయుల అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ ఆధ్వర్యంలో మే 24న కడప ఆర్డిఓ కార్యాలయం వద్ద ఆందోళన నిర్వహించారు. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి లక్ష్మిరాజా మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు విద్యారంగాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నాయని విమర్శించారు.

యుటియఫ్ జిల్లా కార్యదర్శులు పి. చంద్రశేఖర్, కృష్ణారెడ్డి, ట్రెజరర్ ఎస్వీ సుబ్బరాజు, ఉపాధ్యాయులు ఆర్. గంగన్న, నాగేశ్వర రావు, సుబ్బారావు, రాజు, గంగిరెడ్డి, రామాంజనేయులు, కేశవ, గోపినాథ్ తదితరులు పాల్గొన్నారు.

# రాష్ట్ర వ్యాప్తంగా యుటియఫ్ ఆధ్వర్యంలో "మే"డే వేడుకలు

అంతర్జాతీయ కార్మిక దినోత్సవ స్ఫూర్తితో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమరశీల పోరాటాలకు ఉపాధ్యాయులు సిద్ధం కావాలని **ఆం.ప్ర. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్)** రాష్ట్ర కార్యాలయంలో జరిగిన 'మేడే' కార్యక్రమంలో వక్తలు ఉద్బోధించారు.

అలవిమీరిన చాకిరి, అదనపు పని గంటలు, తక్కువ వేతనాలకు వ్యతిరేకంగా నాడు చికాగో నగరంలో కార్మిక వర్గం చేసిన పోరాటాలు, త్యాగాల ఫలితంగా నేడు ఉపాధ్యాయ వర్గం, కార్మికులు మెరుగైన వేతనాలు, సౌకర్యాలు సాధించుకున్నారని రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్ అన్నారు. తొలుత యుటియఫ్ పతాకాన్ని ఆయన ఎగురవేశారు. అనంతరం బాబురెడ్డి అధ్యక్షతన జరిగిన సమావేశంలో రాష్ట్ర అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎన్. నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు, సీనియర్ నాయకులు ఎం. నరహరి, ఎం.ఏ.కె. దత్, కోశాధికారి ఎం. సంయుక్త తదితరులు సందేశలిచ్చారు.

పెన్షన్ సంస్కరణలు, అప్రెంటిస్ విధానంకు వ్యతిరేకంగా కార్మికులు, ఉద్యోగులు సాగించే పోరాటాలకు మద్ధతుగా శాసనమండలిలో బలమైన వాణిని విన్పిస్తారని ముఖ్య అతిథి ఎమ్మెల్సీ వై. శ్రీనివాసులురెడ్డి సౌహార్ధ సందేశమిచ్చారు. దేశభద్రత,ప్రజల సంక్షేమాన్ని విస్మరించి కార్పొరేట్ శక్తుల సేవలో యుపిఏ-2 ప్రభుత్వం తరిస్తుందని పెన్షనర్ల సంఘం నాయకులు ఎం. నరహరి విమర్శించారు.

శ్రామికుల, మధ్యతరగతి ఉద్యోగుల హక్కులు, సౌకర్యాలను కబళించే ప్రయత్నాలను ప్రతిఘటిస్తామని యుటియఫ్ నాయకులు ఐ. వెంకటేశ్వర రావు వివరించారు. ప్రభుత్వ రంగంలోని ఉపాధ్యాయుల జీతభత్యాలు, సర్వీసు కండీషన్లు ప్రపంచీకరణ ఫలితంగా ప్రమాదంలో పడ్డాయని, ప్రైవేట్ రంగంలోని ఉపాధ్యాయుల శ్రమదోపిడిని గుర్తించటం వారి పోరాటాలకు సంఘీభావం తెల్పుతూ ఐక్యంగా పోరాడాలని సీనియర్ నాయకులు ఎం.ఏ.కె.దత్ పిలుపునిచ్చారు.

ప్రజల స్థితి గతుల్లో దుర్భరమైన మార్పులు తెస్తున్న సరళీకరణ విధానాలను అర్థం చేసుకోవటం, ప్రజల్లో బలంగా ప్రచారం చేయాలని నాయకురాలు ఎం. సంయుక్త కోరారు. పి. బాబురెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో మరికొందరు సందేశాలిచ్చారు.

తొలుత యుటియఫ్ జెండాను రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ ఎగురవేశారు. రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ శుభాకాంక్షలు తెలిపారు.

**తూర్పుగోదావరిలో :** యుటియఫ్ తూర్పుగోదావరి జిల్లాశాఖ ఆధ్వర్యంలో "మే"డే ఉత్సవాలు ఘనంగా నిర్వహించారు.

**కాకినాడ :** కాకినాడ యుటియఫ్ హోమ్ నందు జిల్లా శాఖ అధ్యక్షులు జి. ప్రభాకర వర్మ యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. సాయంత్రం బాలాజీ చెరువు సెంటర్‌నందు సిఐటియు ఆధ్వర్యంలో జరిగిన బహిరంగ సభలో జిల్లా ప్రధాన కార్యదర్శి కె. సత్తిరాజు పాల్గొని ప్రసంగించారు.

**రాజమండ్రి :** రాజమండ్రి ఏరియాలో గల అన్ని మండల / పట్టణ శాఖలు మేడే సందర్భంగా యుటియఫ్ పతాకావిష్కరణలు నిర్వహించి రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.ఎస్.ప్రసాద్ ఆధ్వర్యంలో "మేడే" ర్యాలీలో 200 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**అమలాపురం :** ప్రాంతీయ కార్యాలయంలో జడ్‌పి హైస్కూల్ పేరూరు గెజిటెడ్ ప్రధానోపాధ్యాయుడు జి.వి. గోపాలకృష్ణ యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం మే డే ర్యాలీలో ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

జిల్లాలో తుని, కోరుకొండ, రంపచోడవరం ప్రాంతీయ కార్యాలయాల్లో జెండాలు ఎగురవేశారు. జిల్లాలో అన్ని మండల / పట్టణ / నగర కేంద్రాలలో యుటియఫ్ పతాకాలు ఆవిష్కరించి ప్రజా సంఘాలు ఐక్య వేదిక ఆధ్వర్యంలో జరిగిన ర్యాలీలో పాల్గొన్నారు.

**నల్లగొండలో :** ప్రపంచ కార్మిక దినోత్సవం మే డేను యుటియఫ్ నల్లగొండ జిల్లా కార్యాలయంలో ఘనంగా నిర్వహించారు.

**మచిలీపట్నంలో**

**మచిలీపట్నంలో :** యుటిఎఫ్ కృష్ణా జిల్లా శాఖ ఆధ్వర్యంలో ప్రపంచ కార్మిక దినోత్సవము సందర్భముగా మచిలీపట్నంలోని యుటియఫ్ భవనముపై యుటియఫ్ జెండా ఆవిష్కరించారు.

**ఎం. కొండూరులో :** కృష్ణా జిల్లా. ఏ. కొండూరు మండలంలో మేడే వేడుకలు ఘనంగా నిర్వహించారు.

**ఖమ్మంలో**

**ఖమ్మంలో :** యుటియఫ్ ఖమ్మం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో జరిగిన మేడే ఉత్సవాల్లో భాగంగా జిల్లా కార్యాలయంలో సంఘ పతాకాన్ని జిల్లా ప్రధానకార్యదర్శి జి. రాజశేఖర్ ఆవిష్కరించిన అనంతరం కార్యకర్తల్ని ఉద్దేశించి ప్రసంగించారు.

**కరీంనగర్ జిల్లా కార్యవర్గ సమావేశం**

కరీంనగర్‌లో మే 24 మధ్యాహ్నం జిల్లా అధ్యక్షులు టి. రాజేష్ అధ్యక్షతన జిల్లా కార్యవర్గ సమావేశం జరిగింది. దీనికి ముఖ్య అతిథిగా విచ్చేసిన రాష్ట్ర కార్యదర్శి పి. మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ జి.ఓ.55ను వెంటనే రద్దు చేయాలని డిఎస్‌సి 2008 టీచర్ల రెగ్యులర్ స్కేల్ ఇవ్వాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. కార్యక్రమంలో భాగంగా జిల్లా ప్రధాన కార్యదర్శి కె. భూంరెడ్డి కార్యకలాపాల నివేదికను ప్రవేశ పెట్టారు. సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది. సమావేశంలో సీనియర్ కార్యకర్తలైన వేణుశ్రీ, ప్రతాపరావు, అశోకు లు జిల్లా కమిటి బలో పేతానికి సూచనలు ఇచ్చారు. అనంతరం ఉపాధ్యాయులు రేషనలైజేషన్, బదిలీలపై తమ అనుమానాలను అడిగి నివృత్తి చేసుకున్నారు. ఈ కార్యక్రమంలో 30 మంది కార్యవర్గ సభ్యులు పాల్గొన్నారు.

**మదనపల్లెలో ఎమ్మెల్సీల అభినందన సభ**

చిత్తూరు జిల్లా మదనపల్లెనందు ఏప్రిల్ 16న చిత్తూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల శాసనమండలి, ఉపాధ్యాయ, పట్టభద్రుల ఎమ్మెల్సీలు విఠపు బాలసుబ్రహ్మణ్యం, వై. శ్రీనివాసులురెడ్డిల అభినందన సభ

ఏర్పాటు చేశారు. ఈ సభనుద్దేశించి వి. బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ, రాజకీయాలకు అతీతంగా ప్రతి ఉపాధ్యాయుడు పనిచేసి ప్రలోభాలకు లోను కాకుండా తమను గెలిపించిన ఓటర్లకు కృతజ్ఞతలు తెలిపారు. విద్యరంగాన్ని పటిష్టం చేయడానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తానని, ప్రభుత్వ పాఠశాలలను బలోపేతం చేయడానికి ప్రతి ఉపాధ్యాయుడు తనవంతు కృషి చేయాలని పిలుపునిచ్చారు. వై. శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ ఉద్యమాలకు అండగా ఉంటానని, అన్ని రంగాల సమస్యలను శాసనమండలిలో చర్చించి, పిడిఎఫ్ సహకారంతో పరిష్కారం దిశగా పయనిస్తానని అన్నారు. నైతిక విలువల పెద్దపీట వేసిన ఓటర్లకు, సహకరించిన ప్రజలకు అభినందనలు తెలియజేశారు. అనంతరం పిడిఎఫ్,యుటియఫ్ లోగోలతో ప్రత్యేకంగా తయారు చేయించిన కండువాలతో, పూలతో మదనపల్లె యుటియఫ్ నాయకులు ఎస్‌హెచ్ రహమాన్, ఎన్. రవిప్రకాష్, టి. ఉత్తన్న, టి. సుధాకర్ నాయుడు, కె. ఆదినారాయణ, గిరివర్ధన్, శర్మ, పద్మనాభం సన్మానించారు. అదే విధంగా బిఎస్ఎన్ఎల్, ఎల్ఐసి, ఎన్‌జిఓ, ఆర్‌టిసి సంఘాలు ప్రతినిధులు, యుటియఫ్ మొలకల చెరువు, నిమ్మనపల్లె, తంబళ్ళ పల్లె, జి.కొత్తకోట, మదనపల్లె, కురబలకోట, గుర్రంకొండ మండల శాఖలు ఎమ్మెల్సీలను సన్మానించారు. ఈ సమావేశంలో 500 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### ఉపాధ్యాయులకు కంప్యూటర్ శిక్షణ

తూర్పుగోదావరి జిల్లా అమలాపురం యుటియఫ్ హోమ్‌నందు మే 4 నుండి ఉపాధ్యాయులకు నిర్వహించిన కంప్యూటర్ శిక్షణా తరగతులను యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి కె. సత్తిరాజు ప్రారంభించారు. తదుపరి జరిగిన సమావేశమునకు యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు ఎం. వెంకటేశ్వర రావు అధ్యక్షత వహించి మాట్లాడుతూ కంప్యూటర్ శిక్షణ అనేది ఈ రోజుల్లో అందరికీ అత్యవసరం అన్నారు. సీనియర్ నాయకులు కె. సత్యనారాయణ, కుటుంబసంక్షేమ పథకం డైరెక్టర్ టి. కామేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

కంప్యూటర్ శిక్షణా శిబిరాన్ని ఉభయగోదావరి జిల్లాల గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ కె. జార్జివిక్టర్, యుటియఫ్ రాష్ట్ర గౌరవాధ్యక్షులు సిహెచ్. సుభాస్‌చంద్రబోస్‌లు మే 20న సందర్శించారు. ఈ సందర్భంగా జార్జివిక్టర్ మాట్లాడుతూ ఉపాధ్యాయులందరూ తప్పనిసరిగా కంప్యూటర్ పరిజ్ఞానం కలిగి ఉండాలని ఉద్బోధించారు. సుభాస్‌చంద్రబోస్ మాట్లాడుతూ రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా యుటియఫ్ అమలాపురం హోం కేంద్రంగా కంప్యూటర్ శిక్షణా కార్యక్రమం ఏర్పాటు చేయడం అభినందనీయమని అన్నారు. శిక్షణ పొందుతున్న కార్యకర్తలకొరకై తయారు చేసిన హ్యాండ్‌బుక్‌ను సుభాస్‌చంద్రబోస్ ఆవిష్కరించి పంపిణీ చేశారు. కంప్యూటర్ శిక్షణా కార్యక్రమ నిర్వాహకులను మరియు హ్యాండ్ బుక్ రూపకల్పనకు కృషి చేసిన కె. భాస్కరరావు, ఎ.ఎస్.డి.ఎన్.వి. ఎస్.ఎస్. ప్రసాద్‌ను కె. జార్జివిక్టర్, సుభాస్‌చంద్రబోస్ అభినందించారు. ఈ కార్యక్రమంలో జిల్లా మాజీ గౌరవాధ్యక్షులు కె. సత్యనారాయణ, జిల్లా గౌరవాధ్యక్షులు ఎం. వెంకటేశులు, కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ కె. కామేశ్వరరావు, మండల, పట్టణ శాఖల అధ్యక్ష, కార్యదర్శులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## ఎస్ఎస్‌సిలో మెరుగైన ఫలితాలు

### ఉపాధ్యాయులకు, విద్యార్థులకు యుటియఫ్ అభినందనలు

మార్చి 2011 పదవ తరగతి పరీక్షలలో 83.10 ఉత్తీర్ణత శాతం సాధించడం పట్ల ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) అభినందనలు తెలియజేస్తున్నది. గత మార్చి 2010 కంటే 1.4% అధికంగా ఫలితాలు రావడం పట్ల యుటియఫ్ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎన్.నారాయణ, ఐ. వెంకటేశ్వర రావు హర్షం వ్యక్తం చేశారు. ఈ ఫలితాలలో బాలికల ఉత్తీర్ణతే శాతం పెరుగుదల పై చేయి కావడం అభివృద్ధికరం. సున్నా శాతం ఫలితాలు వచ్చిన పాఠశాలలు 10 మాత్రమే ఉన్నాయి. 2009-2010 సంవత్సరాలలో ఉన్నత పాఠశాలల్లో స్కూల్ అసిస్టెంట్ల పోస్టులు భర్తీ కావడం వల్ల 10వ తరగతి ఫలితాలు మెరుగైనాయని వారు పేర్కొన్నారు. మున్సిపల్, ఎయిడెడ్ పాఠశాలల్లో పోస్టులు భర్తీ కాకపోవడం వల్ల ఫలితాలపై దాని ప్రభావం కన్పిస్తుంది. ఉన్నత పాఠశాలల్లో పోస్టులన్నీ స్టాఫ్ ప్యాటర్న్ ప్రకారం భర్తీ చేస్తే ఈ ఫలితాలు మరింత పెరుగుతాయని ఆశాభావం వ్యక్తం చేశారు.

## "నోషనల్ ఇంక్రిమెంట్స్ విజయోత్సవ సభ"

కరీంనగర్ జిల్లా మెట్‌పల్లి పట్టణంలో మే 29న జిల్లా కార్యదర్శి టి. ఆగమయ్య అధ్యక్షతన నోషనల్ ఇంక్రిమెంట్స్ విజయోత్సవ సభ జరిగినది. ఈ సభకు జిల్లా అధ్యక్షులు తోట రాజేష్ ముఖ్య అతిథిగా హాజరై మాట్లాడుతూ యుటియఫ్ రాష్ట్ర నాయకత్వం, పిడిఎఫ్ ఎమ్మెల్సీల పోరాటం ఫలితంగా ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ టీచర్లకు, స్పెషల్ విద్యావాలంటీర్లకు 2 నోషనల్ ఇంక్రిమెంట్స్ మంజూరు చేస్తూ ప్రభుత్వం జి.ఓ. 69 విడుదల చేసిందన్నారు.

అనంతరం జిల్లా ప్రధాన కార్యదర్శి కర్ణ భూంరెడ్డి మాట్లాడుతూ జి.ఓ. 69 విడుదల ద్వారా సామాజిక న్యాయం చేకూరినట్లయిందని పేర్కొన్నారు. ఈ కార్యక్రమంలో పలువురు ఉపాధ్యాయులు దశాబ్ద కాలంగా యుటియఫ్ చేసిన పోరాటాన్ని కృషిని అభినందించారు. కార్యక్రమంలో టి. శ్యాంసుందర్, రాజేందర్, నర్సయ్య, కృష్ణకుమార్, రాజు, మోహన్, శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు.

### అనంతలో విజయోత్సవం!!

యుటియఫ్ సుదీర్ఘ పోరాటాల ఫలితంగా రాష్ట్ర ప్రభుత్వం స్పెషల్ విద్యావాలంటీర్లకు ఎస్‌సి, ఎస్‌టి, బిసి, అన్‌ట్రైన్డ్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేస్తూ జి.ఓ. 69ని విడుదల చేయడం పట్ల జిల్లాశాఖ యుటియఫ్ అనంతపురం విజయోత్సవం నిర్వహించింది.

ఈ సందర్భంగా డిఇఓ ప్రేమానంద్ మాట్లాడుతూ యుటియఫ్ నిరంతరం విద్యారంగ, ఉపాధ్యాయ సంక్షేమ కోసం పోరాడే సంఘం అని అభినందించారు. ఈ కార్యక్రమంలో జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు సిహెచ్. నాగేంద్రబాబు, ఎస్ఎం. జిలాన్, జిల్లా కోశాధికారి ఈశ్వరయ్య, కార్యదర్శులు నాగేంద్ర, విజయభాస్కర్, రాష్ట్ర కార్యవర్గ సభ్యులు భాస్కర్, నాయకులు అహోబిలేసు, గోవిందు, అనిల్‌కుమార్, హరినాథ్, వెంకటేష్, బసవరాజు, రఘునాథ్, సాయినాథ్‌బాబు, మారుతి, వెంకటరాముడు, జగదీష్, క్రిష్టయ్య తదితరులు పాల్గొన్నారు.

# ఉపాధ్యాయ సమస్యల పరిష్కారం కోసం స్పాట్ కేంద్రాల దిగ్బంధం

**హైదరాబాద్‌లో**

అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని, 2008 టీచర్లకు టైం స్కేలు ఇవ్వాలని, ఉన్నత పాఠశాలల్లోని పండిట్, పిఇటి పోస్టులను అప్‌గ్రేడ్ చెయ్యాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ హైదరాబాద్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న సికింద్రాబాద్‌లోని స్పాట్ కేంద్రాన్ని ముట్టడించారు. పిడిఎఫ్ చైర్మన్ చుక్కా రామయ్య కార్యక్రమాన్ని ప్రారంభించారు. ప్రశాంతంగా పేపర్లు దిద్దుకోలసిన టీచర్లు ఉద్యమించ వలసిన పరిస్థితిని ప్రభుత్వమే కల్పించిందన్నారు. వెట్టిచాకిరీకి తీసిపోని అప్రెంటిస్ వ్యవస్థను రద్దు చేయాలన్నారు. యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ మాట్లాడుతూ ప్రభుత్వం హామీలు ఇస్తున్నా నీటిమీద రాతల్లాగే ఉంటున్నాయని, పీఆర్‌సీ కమీషనర్ రికమండ్ చేసినా, పీడీఎఫ్ ఎమ్మెల్సీలు వత్తిడిచేసినా పరిస్థితిలో మార్పు లేదని ప్రభుత్వం మొద్దునిద్ర వదిలించుకొని సమస్యల పరిష్కారానికి దృష్టి సారించాలన్నారు. అప్రెంటిస్ విధానం రద్దు చేయకపోతే ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తామని హెచ్చరించారు. హైస్కూళ్ళల్లో ఉన్న పండిత, పిఇటి పోస్టులను అప్‌గ్రేడ్ చేసి వారికి జరిగిన అన్యాయాన్ని సరిచేయాలన్నారు. రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త, జిల్లా కోశాధికారి ఎస్.వై. కొండలరావు, జిల్లా కార్యదర్శులు, మండల నాయకులు మొదలయిన వారు పాల్గొన్నారు.

**ఖమ్మంలో**

యుటియఫ్ ఖమ్మం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ ఏప్రిల్ 17న 2000 మంది ఉపాధ్యాయులు ఎస్ఎస్‌సి స్పాట్ కేంద్రాన్ని ముట్టడించారు. ముట్టడిలో పాల్గొన్న ఉపాధ్యాయుల నుద్దేశించి యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి బి. నరసింహరావు మాట్లాడుతూ అప్రెంటిస్ వ్యవస్థ రద్దు కోసం 15 సం॥లుగా పోరాడుతున్నా పలుమార్లు హామీ ఇచ్చిన ప్రభుత్వం రద్దు ఉత్తర్వులు ఇవ్వకుండా ఉపాధ్యాయుల ఆత్మగౌరవాన్ని ప్రపంచబ్యాంకుకు తాకట్టు పెట్టిందన్నారు.

యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి జి. రాజశేఖర్ మాట్లాడుతూ ఉపాధ్యాయుల సమస్యలపై ప్రభుత్వం గతంలో సంఘాలతో అనేకసార్లు ఒప్పందాలు కుదుర్చుకొని వాటిని అమలు చేయకుండా సాచివేత వైఖరి అవలంబిస్తున్నదని ఆరోపించారు. యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు బి. రాందాసు, కోశాధికారి ఎన్. వీరబాబు, కార్యదర్శి ఎస్.కె. మహబూబ్‌అలీ ప్రసంగించారు. తీవ్ర పెనుగులాట మధ్య పోలీసులు యుటియఫ్ జిల్లా నాయకత్వం, కార్యకర్తల్ని అరెస్టు చేసి 3 టౌన్ పోలీస్ స్టేషన్‌కు తరలించి సాయంత్రం విడుదలచేశారు.

**కృష్ణలో**

యుటియఫ్ రాష్ట్ర సంఘం పిలుపుమేరకు కృష్ణాజిల్లా శాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న సమస్యల పరిష్కారం కొరకు ఉ॥ 9 గం॥ నుండి 10.30 గం॥ల వరకు మచిలీపట్నంలోని ఎస్ఎస్‌సి స్పాట్ వ్యాల్యూయేషన్ కేంద్రం వద్ద పికెటింగ్ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి బి. నాగేశ్వర రావు మాట్లాడుతూ ప్రభుత్వం హామీలిచ్చిన సమస్యలపై వెంటనే ఉత్తర్వులు ఇవ్వాలని డిమాండ్ చేశారు. సమస్యల పరిష్కారం కొరకు స్పాట్ కేంద్రం ఎదుట శాంతియుతంగా పికెటింగ్ జరుపుతున్న సుమారు 100 మంది యుటియఫ్ నాయకులు, కార్యకర్తలు, ఉపాధ్యాయులను పోలీసులు అరెస్టు చేశారు. యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఉమామహేశ్వరరావు, ప్రధానకార్యదర్శి బి. నాగేశ్వర రావు, జిల్లా సహాధ్యక్షులు జి.రమేష్, జిల్లా కోశాధికారి కె. సంజీవరెడ్డి, పలువురు కార్యదర్శులు, వివిధ మండల / పట్టణ శాఖల నాయకులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**గుంటూరులో**

దీర్ఘకాలంగా ఉన్న ఉపాధ్యాయ సమస్యల పరిష్కారం కోరుతూ యుటియఫ్ ఆధ్వర్యంలో ఆదివారం పికెటింగ్ నిర్వహించారు. జిల్లాలోని పలు ప్రాంతాల నుండి వచ్చిన ఉపాధ్యాయులు 10వ తరగతి మూల్యాంకనా కేంద్రాన్ని (స్టాల్ ఉన్నత పాఠశాల) దిగ్బంధించారు. ఈ సందర్భంగా ఆందోళనకారులకు, పోలీసులకు మధ్య కొంత ఉద్రిక్త వాతావరణం నెలకొంది. ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావుతో పాటు వందలాది మంది ఉపాధ్యాయులను పోలీసులు అరెస్టు చేసి నగర పాలెం పోలీస్ స్టేషన్‌కు తరలించారు. సొంత పూచీకత్తుపై వారిని విడుదల చేశారు. ఈ సందర్భంగా లక్ష్మణరావు మాట్లాడుతూ ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంలో ప్రభుత్వం నిర్లక్ష్య వైఖరి విడనాడాలన్నారు. అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేశారు. దీనిపై 2010 పీఆర్‌సీ రిపోర్టు ఇచ్చినా, ఉపాధ్యాయ సంఘాలకు ప్రభుత్వం హామీ ఇచ్చినా ఇంత వరకు ఆ దిశగా చర్యలు తీసుకోకపోవడం దారుణమన్నారు. యుటియఫ్ జిల్లా అధ్యక్షులు జి. ప్రభుదాసు, ప్రధానకార్యదర్శి ఎం. హనుమంతరావు, జిల్లా సహాధ్యక్షులు సిహెచ్. పద్మావతి, జిల్లా కోశాధికారి ఎన్. వెంకటేశ్వర్లు, పలువురు జిల్లా కార్యదర్శులు పాల్గొన్నారు. బిటిఎఫ్, ఆర్‌యుపిపి, పండిత పరిషత్ నాయకులు పికెటింగ్‌కు సంఘీభావం తెలిపారు.

**నల్లగొండలో స్పాట్ కేంద్రం దిగ్బంధం**

యుటియఫ్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న నల్లగొండలో స్పాట్ వ్యాల్యూయేషన్ కేంద్రాన్ని ఉపాధ్యాయులు పెద్ద ఎత్తున దిగ్బంధించారు. ఈ కార్యక్రమానికి జిల్లా అధ్యక్షులు ఎం. రాజశేఖర్ రెడ్డి అధ్యక్షత వహించగా, రాష్ట్ర కార్యదర్శి ఏ. నర్సిరెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయ నియామకంలో అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని, డిఎస్‌సి 2008 టీచర్లకు టైమ్ స్కేల్‌తో పూర్తి జీతాలు చెల్లించాలని డిమాండ్ చేశారు. జిల్లా ప్రధానకార్యదర్శి సిహెచ్. రాములు, గౌరవాధ్యక్షులు ఎన్. బలరాం, సహాధ్యక్షులు పి. లక్‌పతినాయక్, కోశాధికారి ఎడ్ల సైదులు పలువురు జిల్లా కార్యదర్శులు పాల్గొన్నారు.

**జి.ఓ. 177 ప్రతుల దహనం, నిరసన ప్రదర్శన**

ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికులపై ఉక్కుపాదం మోపుతూ ప్రభుత్వం అసంబద్ధంగా జారీ చేసిన జి.ఓ. 177ను వెంటనే రద్దు చేయాలని

యుటియఫ్ నల్లగొండ జిల్లా శాఖ ఆధ్వర్యంలో స్థానిక ఎస్ఎస్సి స్పాట్ కేంద్రంలో లంచ్అవర్ నందు జి.ఓ. ప్రతులను దహనం చేసి నిరసన ప్రదర్శన నిర్వహించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి ఏ. నర్సిరెడ్డి పాల్గొని మాట్లాడుతూ అసంబద్ధమైన జి.ఓ177ను వెంటనే రద్దు చేయాలని లేని యెడల పెద్ద ఎత్తున ఆందోళన కార్యక్రమాలు నిర్వహిస్తామన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఎం. రాజశేఖర్‌రెడ్డి, జిల్లా కార్యదర్శులు డి. యాకయ్య, రామలింగయ్య, జిల్లా కమిటీ సభ్యులు ఎం. మురళయ్య, నీరజ, సుజాత వివిధ మండలాల బాధ్యులు పెద్ద సంఖ్యలో ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**కాకినాడలో స్పాట్ పికెటింగ్**

ఏప్రిల్ 17న యుటియఫ్ తూర్పుగోదావరి జిల్లా శాఖ ఆధ్వర్యంలో కాకినాడ నందు ఎస్ఎస్సి స్పాట్ కేంద్రాన్ని ముట్టడించారు. జిల్లా అధక్షులు జి. ప్రభాకర్‌వర్మ అధ్యక్షతన ఉదయం 8 గం॥లకే స్పాట్ కేంద్రంలోనికి వెళ్ళే గేట్లు రెండింటిని ఉపాధ్యాయులు ముట్టడించారు. పికెటింగ్ కార్యక్రమాన్ని రాష్ట్ర కార్యదర్శి కెఎస్ఎస్. ప్రసాదు ప్రారంభిస్తూ ప్రభుత్వం ఉపాధ్యాయుల పెండింగ్ సమస్యలు పరిష్కారం చేయటంలో తాత్సారం చేస్తుందన్నారు. ప్రభుత్వం స్పందించకపోవటం వల్లనే యుటియఫ్ పోరాట కార్యక్రమాలు చేపట్టిందన్నారు. ఈ కార్యక్రమంలో 300 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ఈ పోరాటంలో జిల్లా ప్రధాకార్యదర్శి కె. సత్తిరాజు, సహాధ్యక్షులు ఎస్. జ్యోతిబసు, ఎన్. అరుణకుమారి, ట్రెజరర్ టి. అన్నరాము జిల్లా కార్యదర్శులు కె.వి.ప్రసాద్‌బాబు, జి. అప్పలనాయుడు, జె. అప్పారావు మొ॥వారు మండల / పట్టణ శాఖల బాధ్యులు పాల్గొన్నారు.

**మెదక్‌లో**

మెదక్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న బిహెచ్ఇఎల్ జ్యోతి విద్యాలయం దగ్గర భారీ ఎత్తున వందలాది మందితో 2 గంటలపాటు స్పాట్ దిగ్బంధనాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సమావేశాన్ని ఉద్దేశించి రాష్ట్ర యుటియఫ్ కార్యదర్శి చావరవి మాట్లాడుతూ అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేశారు.

యుటియఫ్ జిల్లా అధ్యక్షులు పి. బాలగోపాల్, జిల్లా ప్రధానకార్యదర్శి టి. లక్ష్మారెడ్డి, జిల్లా గౌరవాధ్యక్షులు వి. సత్యనారాయణ మాట్లాడారు. సిఐటియు నాయకులు నర్సింహ్మా రెడ్డి, ఎం. గణేష్‌లు పాల్గొని సంపూర్ణ మద్దతు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో జిల్లా సహాధ్యక్షులు బి. సాయిలు, జిల్లా కోశాధికారి కె. అశోక్, జిల్లా కార్యదర్శులు కె. పద్మారావు, సి. చంద్రారెడ్డి, దిలీప్‌సింగ్ ఠాగూర్, టి. యాదగిరి, పి. కిషన్‌జి, శ్రీనివాసరావు, ఎన్. సుధాకర్, పి. శ్రీనివాసరావు తదితరులు నాయకత్వంలో వందలాదిమంది ఉపాధ్యాయులు ర్యాలీ నిర్వహించారు.

**మహబూబ్‌నగర్‌లో**

అపరిష్కృతంగా ఉన్న ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలనే డిమాండ్‌తో ఏప్రిల్ 17న మహబూబ్‌నగర్‌లో ఎస్ఎస్సి మూల్యాంకన కేంద్రం దగ్గర యుటియఫ్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో పికెటింగ్ నిర్వహించారు. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఎన్. కిష్టయ్య, యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి ఎం. వెంకటప్ప మాట్లాడారు. యుటియఫ్ నాయకులు సీత్యానాయక్, వేణు, రవిప్రసాద్, మహబూబ్ సాబ్, తౌర్య, ఎన్. వెంకటేష్, కె. రవి, నవీన్, పాపయ్య, రఘుపాల్, తిప్పన్న, భీమయ్య మొ॥ వారితోపాటు 2 వేలమంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**కడపలో**

ఏప్రిల్ 17న యుటియఫ్ ఆధ్వర్యంలో ఎస్ఎస్సి స్పాట్ వ్యాల్యుయేషన్ కేంద్రాలకు తాళాలు వేసి పికెటింగ్ చేశారు. ఈ పికెటింగ్‌నుద్దేశించి బీరం సుబ్బారెడ్డి యుటియఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి బి. లక్ష్మీరాజ మాట్లాడుతూ అప్రెంటిస్ రద్దు, నోషనల్ ఇంక్రిమెంట్లు, పండితుల గ్రేడ్-2 స్కేలు, ఎయిడెడ్ టీచర్ల అన్ ఎయిడెడ్ సర్వీసు తదితర సమస్యల పరిష్కారం కోసం ఉపాధ్యాయ సంఘాలు చాలా కాలంగా పోరాడుతున్నాయన్నారు. అనేకసార్లు చర్చలు జరిగి వ్రాత పూర్వక అగ్రిమెంట్స్, మినిట్స్ వున్నాయి. అయినా ఉత్తర్వులు ఇవ్వకుండా ప్రభుత్వం కాలయాపన చేస్తున్నదని విమర్శించారు. అప్రెంటిస్ రద్దు, డిఎస్సి 2008 ఉపాధ్యాయులకు పూర్తి జీతాలు, డిఎస్సి 2008 హామీ పత్రాలు ఇచ్చిన వారికి పోస్టింగ్ ఉత్తర్వులు ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఈ పికెటింగ్ కార్యక్రమంలో ఆర్‌విపిపి నాయకుడు బాలయ్యరెడ్డి, సిఐటియు జిల్లా అధ్యక్షుడు ఏ. రఘునాథ్‌రెడ్డి, కొండయ్య ఎస్ఎల్‌టిఏ నాయకులు, జెవివి అధ్యక్షుడు బి. రాజశేఖర్ రాహుల్, యుటియఫ్ జిల్లా కార్యదర్శులు తదితర మండల జిల్లా నాయకులు పాల్గొన్నారు.

**ఏలూరులో**

ఏలూరులో మూల్యాంకన కేంద్రం వద్ద యుటియఫ్ ప॥గో॥జిల్లా శాఖ నిర్వహించిన పికెటింగ్ విజయవంతమైంది. వెయ్యి మందికిపైగా ఉపాధ్యాయులు పికెటింగ్‌లో పాల్గొన్నారు. స్పాట్ కేంద్రం వద్ద ఉ॥ 8 గం॥ నుండి 12 గం॥ల వరకు పికెటింగ్ కార్యక్రమం జరిగింది. పికెటింగ్‌లో పాల్గొన్న ఉపాధ్యాయులనుద్దేశించి యుటియఫ్ జిల్లా శాఖ ప్రధానకార్యదర్శి షేక్ సాబ్జీ మాట్లాడుతూ అప్రెంటిస్ రద్దు చేసి, డిఎస్సి 2008 టీచర్లందరికి రెగ్యులర్ టైమ్ స్కేలు వర్తింప చేసే వరకు పోరాటాన్ని కొనసాగిస్తామన్నారు. యుటియఫ్ జిల్లాశాఖ అధ్యక్షులు ఎస్. శ్రీకాంత్ అధ్యక్షత వహించగా, ఎస్ఎల్‌టిఏ రాష్ట్ర కార్యదర్శి కె. రామచంద్రరావు, పండితుల కోసం యుటియఫ్ పోరాడటం సంతోష దాయకమన్నారు. సిఐటియు జిల్లా కార్యదర్శి డిఎన్‌విడి ప్రసాద్, ఆర్‌యుపిపి నాయకులు సుబ్రహ్మణ్యం, యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు బి.ఎస్. ప్రకాశరావు, జిల్లా కార్యదర్శులు ఎంఎస్.ఆర్.కె. ప్రసాదు, సిహెచ్. జగన్‌మోహనరావు, టి.వి. రామకృష్ణ, ఎం. రామకృష్ణ, బి. గోపిమూర్తి, ఐ.వి. నరసింహారాజు, జి. రవికుమార్, వి. శంకరుడు, వి. కనకదుర్గ, బి. శ్రీదేవి, రాష్ట్ర కార్యవర్గ సభ్యులు ఎం.ఇ. విజయకుమర్, వై.వి. డేవిడ్ రాజులు, అన్ని మండల పట్టణ శాఖల నుండి ఉపాధ్యాయులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

**అనంతపురంలో**

యుటియఫ్ అనంతపురం జిల్లాశాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 17న మూల్యాంకన కేంద్రాన్ని దిగ్బంధించారు. యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు నాగేంద్రబాబు, మహమ్మద్ జిలాన్‌ల నాయకత్వంలో ఉదయం 8 గంటలకే స్పాట్ కేంద్రాన్ని దిగ్బంధించారు. స్థానిక గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ డాక్టర్ గేయానంద్ మద్దతు తెలియజేస్తూ ఉపాధ్యాయుల, విద్యారంగ సమస్యల పరిష్కారానికి వెంటనే చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. యుటియఫ్ జిల్లా సీనియర్ నాయకులు ఇమాంసాబ్, సిపిఎం పార్టీ జిల్లా కార్యదర్శి ఓబుళ కొండారెడ్డి, జిల్లా ఎన్‌జిఓ ప్రధానకార్యదర్శి జయరామప్ప యుటియఫ్ పోరాటానికి సంఘీభావం తెలియజేశారు.

ఏపిటిఎఫ్ నాయకులు ప్రభాకర్, హెడ్మాస్టర్ల సంఘం రాష్ట్ర నాయకులు చలపతి, టిఎన్‌యుఎస్ నాయకులు అజయ్‌కుమార్, ఎపిటిఎఫ్ (హెచ్) నాయకులు రవిచంద్ర, ఆపస్ నాయకులు శ్రీనివాసప్రసాద్, పిఇటి సంఘం నాయకులు నాగరాజు, పండిత పరిషత్ నాయకులు గురువి రెడ్డి, ఎ.పి. విద్యావాలంటీర్ల సంఘం. నాయకులు అంజన్‌రాజులు, యుటియఫ్ జిల్లా అసోసియేట్ అధ్యక్షులు శ్రీనివాసులు, కోశాధికారి ఈశ్వరయ్య, జిల్లా కార్యదర్శులు సుధాకర్, విజయభాస్కర్ తదితరులు పాల్గొన్నారు.

**రంగారెడ్డి జిల్లాలో**

ఉపాధ్యాయుల అప్రెంటిస్ రద్దు చేసి టైం స్కేలు ఇవ్వడంతోపాటు, స్పెషల్ విద్యావాలంటీర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు, సీనియర్ టీచర్లకు సర్వీసు వెయిటేజి, పండితుల అప్‌గ్రేడేషన్ తదితర సమస్యలకు సంబంధించి తక్షణమే ఉత్తర్వులు జారీ చేయాలని లేని పక్షంలో ఉపాధ్యాయులు తమ పోరాటాన్ని తీవ్రతరం చేయాల్సి వస్తుందని యుటియఫ్ రంగారెడ్డి జిల్లా అధ్యక్షులు పి. మాణిక్‌రెడ్డి ప్రభుత్వాన్ని హెచ్చరించారు. హయత్‌నగర్‌లోని వర్డ్ & డీడ్ పాఠశాల వద్ద జరుగుతున్న స్పాట్ వ్యాల్యుయేషన్ కేంద్రాన్ని దిగ్బంధం చేసి పికెటింగ్ చేస్తున్న ఉపాధ్యాయులనుద్దేశించి ఆయన ప్రసంగించారు.

జిల్లా ప్రధానకార్యదర్శి ఎం. ఆంజనేయులు మాట్లాడుతూ ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ టీచర్ల నోషనల్ ఇంక్రిమెంట్లపై జనవరి 23న రాష్ట్ర ముఖ్యమంత్రి ఇచ్చిన హామీకే విలువ లేకపోవడం సిగ్గుచేటని అన్నారు. ఉ|| 8 గ||ల నుండి 10 గంటల వరకు బ్రహ్మాండంగా పికెటింగ్ కొనసాగింది. ఈ కార్యక్రమంలో జిల్లా గౌరవాధ్యక్షులు డి. మల్లారెడ్డి జిల్లా కోశాధికారి గాలయ్య, జిల్లా కార్యదర్శులు వివిధ మండలాల ఉపాధ్యాయులు అత్యధిక సంఖ్యలో పాల్గొన్నారు. అనంతరం డిఇఓ పి.వి. శ్రీహరికి మెమోరాండం సమర్పించినారు.

**జి.ఓ. 177ను రద్దు చేయాలి**

ప్రజా ఉద్యమాలకు ఉక్కుపాదం మోపే దిశగా ప్రభుత్వం విడుదల చేసిన జి.ఓ. 177ను బేషరతుగా రద్దు చేయాలని యుటియఫ్ రాష్ట్ర కోశాధికారి ఎం. సంయుక్త ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. హైదరాబాద్ జిల్లా స్పాట్ కేంద్రంలో భోజనవిరామ సమయంలో జరిగిన నిరసన ప్రదర్శనలో ఆమె పాల్గొన్నారు. ప్రభుత్వం విడుదల చేసిన జి.ఓ.177 ప్రజాస్వామ్యాన్ని పరిహాసం చేస్తున్నదన్నారు. ఈ జి.ఓ. వలన ప్రాంతీయ ఉద్యమాలకేకాకుండా ప్రతి ఉద్యమాన్ని అణచివేసే అవకాశాలున్నాయని,రాష్ట్ర వ్యాప్తంగా జరుగుతున్న నిరసన ప్రదర్శనలతోనైనా ప్రభుత్వం జి.ఓ.ను రద్దు చేయాలన్నారు.

# అంబేద్కర్ జయంతి ఉత్సవాలు



**తూర్పుగోదావరి జిల్లాలో**

ఏప్రిల్ 14వ తేదీ అంబేద్కర్ జయంతిని పురస్కరించుకొని యుటియఫ్ తూర్పుగోదావరి జిల్లా శాఖ ఆధ్వర్యంలో ఏప్రిల్ 16,17, 18 తేదీలలో అమలాపురం, రాజమండ్రి, కాకినాడలలో జయంతి ఉత్సవాలు నిర్వహించారు.

కాకినాడ యుటియఫ్ హోమ్‌నందు జిల్లా సహాధ్యక్షులు ఎస్. జ్యోతిబసు అధ్యక్షత వహించగా ముఖ్య అతిథులుగా ఆంధ్రా యూనివర్శిటీ ఎక్స్‌టెన్షన్ అధ్యాపకులు అరుణ్ కుమార్, కులవివక్ష పోరాట సంఘం జిల్లా గౌరవాధ్యక్షులు దడాల సుబ్బారావు పాల్గొని ప్రసంగించారు.

రాజమండ్రిలో ఏప్రిల్ 17వ తేదీన అంబేద్కర్ జయంతి సభను యుటియఫ్ జిల్లాశాఖ సహాధ్యక్షురాలు ఎన్.అరుణకుమారి అధ్యక్షతన నిర్వహించారు. ముఖ్య అతిథిగా మాజీ ఎం.పి. మీడియం బాబూరావు హాజరై ఎస్‌సి, ఎస్‌టి సబ్‌ప్లాన్ నిధులు అమలుకు కమీషన్ నియమించి ఖర్చు చేయాలనే అంశంపై ప్రసంగించారు.

**అమలాపురంలో**

అమలాపురం నందు ఏప్రిల్ 15న యుటియఫ్ మరియు కుల వివక్ష వ్యతిరేక పోరాట సంఘం ఆధ్వర్యంలో డా॥బి. ఆర్.అంబేద్కర్ 121వ జయంతి ఉత్సవములు నిర్వహించారు. కె.వి.పి.ఎస్. జిల్లా గౌరవాధ్యక్షులు దడాల సుబ్బారావు "ఎస్‌సి, ఎస్‌టి సబ్ ప్లాన్ నిధులు - అమలు" అనే అంశంపై మాట్లాడారు.

**విద్య, ఉపాధి మార్గాలే సామాజిక న్యాయ సాధనకు పరిష్కారం**

డా॥ బిఆర్ అంబేద్కర్ 121వ జయంతిని పురస్కరించుకొని ఏప్రిల్ 14న యుటియఫ్ మహబూబ్‌నగర్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో "సామాజిక న్యాయం - పరిష్కార మార్గాలు" అనే అంశంపై మహబూబ్‌నగర్‌లో జిల్లా సదస్సు నిర్వహించారు. ఈ సదస్సుకు ముఖ్య అతిథిగా హాజరైన యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎన్. నారాయణ ప్రసంగిస్తూ అణగారిన వర్గాలు అభివృద్ధి చెంది సామాజిక న్యాయం సాధించ బడాలంటే అందరికి విద్య, ఉపాధి, ఉద్యోగ అవకాశాలు కల్పించాలని డిమాండ్ చేశారు. యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి చావా రవి మాట్లాడుతూ ప్రమోషన్లలో రిజర్వేషన్లు అమలు జరిపే విధానాన్ని వివరించారు. సదస్సుకు జిల్లా అధ్యక్షులు ఎన్. కిష్టయ్య అధ్యక్షత వహించారు.

**దేవరకొండ**

భారతరత్న డా॥ బి.ఆర్. అంబేద్కర్ 121వ జయంతి ఉత్సవాలను యుటియఫ్ దేవరకొండ డివిజన్ ఆధ్వర్యంలో తమ కార్యాలయంలో ఘనంగా నిర్వహించారు. ముఖ్య అతిథులుగా నేనావత్ బాలు నాయక్ ఎంపిపి, పల్లా నర్సింహారెడ్డి,ఎమ్మెల్యే, గుంజరేణుకా నారాయణ హాజరై జెడ్‌పిటిసి, దేవరకొండ సందేశం ఇచ్చారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా నాయకులు బి. వెంకటేశ్వర్లు, పోలె వెంకటయ్య, దేవరకొండ, డిండి చందంపేట యుటియఫ్ బాధ్యులు తదితరులు పాల్గొన్నారు.

# అక్రమ క్రమబద్ధీకరణకు వ్యతిరేకంగా డిఇఓ కార్యాలయాల ముట్టడి

రాష్ట్ర ప్రభుత్వం క్రమబద్ధీకరణ పేరుతో విడుదల చేసిన ఉత్తర్వులు 55 వలన పాఠశాల విద్యారంగానికి, విద్యార్థులకు తీవ్రమైన నష్టం కలుగుతున్నది. ఈ ఉత్తర్వులలో రేషనాలిటీ లేదని, విద్యాహక్కు చట్టం స్ఫూర్తికి భిన్నంగా ఈ ఉత్తర్వులు ఉన్నాయి. అశాస్త్రీయంగా ఉన్న ఈ రేషనలైజేషన్ ఉత్తర్వులు రద్దు చేయాలని, బదిలీ నిబంధనల్లో కొన్ని సవరణలు చేయాలని యుటిఎఫ్ ఆధ్వర్యంలో 23.05.2011నాడు పాఠశాల విద్యా డైరెక్టరేట్ ముట్టడి కార్యక్రమంలో పాల్గొన్న నేతలు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. అన్ని జిల్లాలలోను వేలాది మంది డిఇఓ ఆఫీసులు ముట్టడించి నిరసన తెలియజేశారు.

ఈ కార్యక్రమంలో యుటిఎఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు, సహాధ్యక్షులు ఎం.సంయుక్త, కోశాధికారి పి. మాణిక్‌రెడ్డి, రాష్ట్ర కార్యదర్శి సిహెచ్. రవి, ఎస్ఎల్‌టిఎ ప్రధానకార్యదర్శి చంద్రమోహన్, హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల యుటిఎఫ్ నాయకులు పాల్గొన్నారు. పాఠశాల విద్య డైరెక్టర్ ఆర్.సత్య నారాయణను గేటు వద్ద అడ్డగించి మెమోరాండం సమర్పించారు. ఈ సందర్భంగా ఆయన స్పందిస్తూ దీనిపై విద్యా శాఖ కార్యదర్శితో చర్చించి నిర్ణయం తీసుకుంటామని తెలియజేశారు.

1. 'O' (జీరో) రోలు గలిగిన పాఠశాలల ఆవాస ప్రాంతాలను అధ్యయనం చేసి బడిఈడు బాలబాలికలు ఉన్నట్లయితే బడి నడిపే ప్రయత్నం చేయాలి తప్ప మూసివేయరాదు.
2. ప్రతి ప్రాథమిక పాఠశాలలను ఇద్దరు ఉపాధ్యాయులు తప్పనిసరిగా ఉండాలి. ఎల్ఎఫ్ఎల్ పోస్టుల తరలింపు ఆపాలి.
3. ఏజెన్సీ ప్రాంతంలో ఉపాధ్యాయుల విద్యార్థి నిష్పత్తి ప్రస్తుతం అమలులోనున్న విధంగానే 1:20గా ఉండాలి. ఏజెన్సీ ఏరియా పాఠశాలలను 1:30 నిష్పత్తి వర్తింప చేయడం సరికాదు.
4. విద్యార్థుల సంఖ్యతో నిమిత్తం లేకుండా నాణ్యమైన విద్యను అందించడానికి తరగతికి ఒక ఉపాధ్యాయుడు ఉండే విధంగా చూడాలి.
5. విద్యాహక్కు చట్టం ప్రకారం 6,7,8 తరగతులను 35మంది విద్యార్థులను ఒక సెక్షన్ ఉండాలి. దీనికి భిన్నంగా 280 మందికి విద్యార్థులకు మొత్తం విద్యార్థుల సంఖ్య ప్రాతిపదికగా 5 సెక్షన్స్‌గా పరిగణించడం సరికాదు. 60 మందితో ఒక సెక్షన్ పరిగణించడం అన్యాయం. ఇది విద్యాహక్కు చట్టంలో పేర్కొన్న దానికి భిన్నంగా ఉంది. కావున 175 వరకు ఐదు సెక్షన్లలకు స్టాఫ్ ప్యాట్రన్ 9 మంది ఉండాలి. ఆ మేరకు అదనపు పోస్టులు కేటాయించాలి.
6. ఇంగ్లీషు మీడియంను ప్రత్యేక మీడియంగా చూపించి 7 మంది స్టాఫ్ ప్యాట్రన్ చూపించాలి. రేషనలైజేషన్ ఉత్తర్వులలో 4 మాత్రమే చూపించారు.
7. 5 సెక్షన్లకు ఒక హిందీ పండిట్ ఉండాలి. 10 సెక్షన్లు 520 మంది విద్యార్థుల వరకు ఒకే హిందీ పండితులు ఉంటే పని భారం ఎక్కువ అవుతుందని విద్యార్థులకు నష్టం జరుగుతుంది.
8. భాషా పండితుల పోస్టులను అప్‌గ్రేడ్ చేయకుండా స్కూల్ అసిస్టెంట్ పోస్టులుగా పరిగణించడం ఉపయోగమేమీ లేదు. భాషాపండితుల పోస్టులను అప్‌గ్రేడ్ చేయాలి.
9. 850 మంది వరకు ఒక పిఇటి సరిపెట్టడం అన్యాయం. కనీసం 400 మందికి ఒక పిఇటి ప్రతి ఐదు తరగతులకు ఒక పిఇటి ఉండే విధంగా ఉండాలి.
10. ఇంగ్లీష్ మీడియంకు కూడా ఎస్ఏ ఫిజికల్ సైన్స్ ప్రత్యేకంగా ఉండాలి. ఎస్ఏ(పిఎస్)ను ఎస్ఏ (మాథ్స్)గా కన్వర్షన్ చేయడం సరైంది కాదు.

కావున జి.ఓ. 55 రేషనలైజేషన్ ఉత్తర్వులను సమూలంగా సవరించాలి. విద్యా హక్కు చట్టం అమలు చేయడం ద్వారా అవసరమైన పోస్టులు మంజూరు చేయాలి. బడి బయట ఉన్న బడిఈడు పిల్లలను బడిలో చేర్పించాలి. ఆ తర్వాతనే సర్దుబాటు చేయాలి.

2009లో ప్రమోషన్ పొందిన వారికి మరియు డిఎస్‌సి 2006 ద్వారా అపాయింట్ అయినవారికి వారి మొదటి నియామకపు తేదీ నుండే బదిలీకి అర్హత గల సర్వీస్‌గా పరిగణించాలి.

కౌన్సిలింగ్ హాల్‌లో పరిశీలన కోసం ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులను అనుమతించాలి. గతంలో అన్ని సందర్భాల్లోనూ అనుమతించటం జరిగింది. పెర్‌ఫామెన్స్ పేరామీటర్స్‌ని నిలుపుదల చేయాలి. అంతర్ జిల్లా బదిలీలు అనుమతించాలని యుటిఎఫ్ మెమోరాండంలో డిమాండ్ చేశారు.

**నల్లగొండలో**

యుటిఎఫ్ నల్లగొండ జిల్లాశాఖ ఆధ్వర్యంలో మే 20న జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయం వద్ద పికెటింగ్ నిర్వహించారు. పికెటర్లనుద్దేశించి యుటిఎఫ్ రాష్ట్ర కార్యదర్శి ఏ. నర్సిరెడ్డి మాట్లాడుతూ సెక్రటేరియట్ ద్వారా జరిగిన బదిలీలు రద్దు చేసి ఖాళీలను బదిలీ కౌన్సిలింగ్‌లో పెట్టాలని, రేషనలైజేషన్ జి.ఓ.55ను సవరించాలని, విద్యాహక్కు చట్టానికి అనుగుణంగా ప్రతి పాఠశాలలో రెండు రెగ్యులర్ ఎస్‌జిటి పోస్టులుండాలని డిమాండ్ చేశారు. పికెటింగు చేస్తున్న ఉపాధ్యాయులను పోలీసులు అరెస్టు చేసి వన్‌టౌన్ పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళారు. అనంతరం బెయిల్‌పై విడుదల చేశారు.

**కరీంనగర్‌లో**

రేషనలైజేషన్ జి.ఓ.55ను సమూలంగా సవరించాలని మరియు డిఎస్‌సి 2006 ఉపాధ్యాయులకు, 2009లో పదోన్నతి పొందిన ఉపాధ్యాయులకు బదిలీలలో అవకాశం కల్పించాలని డిమాండ్లతో మే 23న కరీంనగర్‌లో డిసిఇబి నుండి కలెక్టరేటు వరకు ర్యాలీ నిర్వహించి డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. ఈ కార్యక్రమంలో జిల్లా అధ్యక్షులు టి. రాజేష్, ప్రధానకార్యదర్శి కె. భూంరెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ విద్యా విధానాన్ని భ్రష్టుపట్టించే దిశలో ప్రభుత్వం యోచిస్తోందని దుయ్య బట్టారు.

**కర్నూలులో**

రేషనలైజేషన్ ప్రక్రియను నిలిపివేసి ఉపాధ్యాయ బదిలీ నిబంధనల్లో తగిన మార్పులు చేయాలని డిమాండ్ చేస్తూ మే 23న యుటిఎఫ్

కర్నూలు జిల్లా శాఖ ఆధ్వర్యంలో 250 మంది ఉపాధ్యాయులు డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. ఉపాధ్యాయులు యుటియఫ్ జెండాలు, ప్లకార్డులు చేతపట్టుకొని కార్యాలయాన్ని ముట్టడించారు. సిబ్బందినెవ్వరినీ లోనికి వెళ్ళనివ్వకుండా 2 గంటలపాటు అడ్డుకున్నారు. ఒక దశలో ఆర్‌జెడి, ఇంఛార్జి డిఇఓ అయిన మన్మధరెడ్డిని సైతం ఆపివేయటంతో ఆయన లోపలికి వెళ్ళకుండా వెనుదిరగవలసి వచ్చింది. ఈ సందర్భంగా జరిగిన కార్యక్రమానికి జిల్లా అధ్యక్షులు ఎన్. నరసింహుడు అధ్యక్షత వహించగా, జిల్లా ప్రధానకార్యదర్శి కె. సురేష్ కుమార్, డి. రామశేషయ్య, బి. మాణిక్యం శెట్టి తదితరులు మాట్లాడారు. ఈ కార్యక్రమానికి రాష్ట్ర భాషోపాధ్యాయ సంఘం (ఎస్‌సిటిఏ) అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు మద్దిలేటి, నాగేంద్రుడు హాజరై సంఘీభావం ప్రకటించారు.

**అనంతపురంలో**

యుటియఫ్ పిలుపు మేరకు మే 23న అనంతపురం జిల్లా డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. అక్రమబద్ధీకరణ ఉత్తర్వులు 55ను రద్దు చేయాలని ఉపాధ్యాయుల బదిలీ మార్గదర్శకాలలో మార్పులు చేయాలని రాష్ట్ర అక్రమ బదిలీలు రద్దు చేయాలని వందలాదిమంది ఉపాధ్యాయులు డిఇఓ ఆఫీసు ముందు బైఠాయించారు. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు సి.కె. నాగేంద్రబాబు, మహమ్మద్ జిలాన్ మాట్లాడారు. ఎస్‌టిఎఫ్, బిఇడి అసోసియేషన్, పిఇటి, ఫిజికల్ సైన్స్ టీచర్స్ ఫోరం పండిత పరిషత్, ఎల్‌ఎఫ్ఎల్ టీచర్స్ ఫోరం వైఎస్ఆర్ ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు సంఘీభావం తెలిపారు. ఉదయం 9 గం॥ల నుండి మధ్యాహ్నం 1 గంటవరకు జరిగిన దిగ్బంధం పోలీసుల అరెస్టుతో ముగిసింది.

**కాకినాడలో**

ఉపాధ్యాయుల అక్రమ బద్ధీకరణ ఆపాలి. బదిలీ మార్గదర్శకాల్లో మార్పు చెయ్యాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ రాష్ట్ర సంఘం ఇచ్చిన పిలుపుననుసరించి మే 23న తూర్పుగోదావరి జిల్లాలో డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. ఉదయం 9:30 నుండి మ॥ 2 గంటల వరకు జిల్లా విద్యాశాఖాధికారితో సహా సిబ్బంది ఎవ్వరూ కూడా డిఇఓ కార్యాలయం లోనికి ప్రవేశించకుండా గేటుముందు బైటాయించడం జరిగింది. మ॥ 2 గంటలకు 3టౌన్ ఎస్ఐ భరత్ కృష్ణ సారధ్యంలో అరెస్టు చేసి స్వంత పూచీకత్తుపై విడుదలచేశారు. ఈ కార్యక్రమానికి యుటియఫ్ జిల్లాశాఖ అధ్యక్షులు జి.ప్రభాకరవర్మ అధ్యక్షత వహించగా ఉభయ గోదావరి జిల్లాల గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీ కచ్చా జార్జివిక్టర్ ప్రారంభించారు.

**మెదక్‌లో**

విద్యాహక్కు చట్టం అమల్లో భాగంగా ఉపాధ్యాయుల క్రమబద్ధీకరణ పేరుతో ఉపాధ్యాయులను ఇతర పాఠశాలలకు క్రమబద్ధీకరించాలనే చర్యను ఆపాలని, జి.ఓ.55, 61లను రద్దు చేయాలని, ఉపాధ్యాయుల బదిలీ మార్గదర్శక జి.ఓ. 65లో మార్పులు చేయాలనే తదితర డిమాండ్ల పరిష్కారంకోసం రాష్ట్ర కమిటీ పిలుపు మేరకు మెదక్ జిల్లా యుటియఫ్ కమిటీ ఆధ్వర్యంలో డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు.

ఈ సందర్భంగా యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి టి. లక్ష్మారెడ్డి మాట్లాడుతూ విద్యాహక్కుల చట్టం పేరు చెప్పి ప్రభుత్వ విద్యారంగాన్ని నిర్వీర్యం చేసేందుకు ప్రభుత్వం జి.ఓ.నం. 55ను తీసుకు వచ్చిందన్నారు. జిల్లా అధ్యక్షులు బాలగోపాల్ అధ్యక్షత వహించగా, జిల్లా కార్యదర్శులు, మండల నాయకులు తదితరులు పాల్గొన్నారు.

**మహబూబ్‌నగర్‌లో**

రేషనలైజేషన్ ఉత్తర్వులు రద్దు చేయాలని, ఉపాధ్యాయుల బదిలీ మార్గదర్శకాల్లో కొన్ని సవరణలు చేయాలనే మొదలగు డిమాండ్లతో మే 23న ఉదయం 9.30 నుండి 12.30 గంటల వరకు డిఇఓ కార్యాలయం పికెటింగ్ నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ఏపిపిటిఏ, ఎస్ఎల్‌టిఏ మరియు ఫిజికల్ సైన్స్ టీచర్స్ అసోసియేషన్ సంఘాలు తమ మద్ధతు తెలిపి కార్యక్రమంలో పాల్గొన్నారు. పికెటింగ్‌ను ఉద్దేశించి యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఎన్. కిష్టయ్య మాట్లాడారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి ఎం. వెంకటప్ప, జిల్లా గౌరవాధ్యక్షులు కె. జంగయ్య, సహాధ్యక్షులు ఎస్. రవిప్రసాద్‌గౌడ్, డబ్బు హేమలత, ఏపిపిటిఏ జిల్లా అధ్యక్షులు ముజిబుర్ రహమాన్, బాల్‌రెడ్డి, ఎస్ఎల్‌టిఏ జిల్లా అధ్యక్ష కార్యదర్శులు సురేందర్‌నాథ్, గౌరిశంకర్ పలువురు యుటియఫ్ జిల్లా కార్యదర్శులు పాల్గొన్నారు.

**గుంటూరులో**

ఎయిడెడ్ ఉపాధ్యాయుల ఎరియర్స్ వెంటనే చెల్లించాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ గుంటూరు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో జిల్లా ఖజానాధికారి కార్యాలయం ముందు సోమవారం సాయంత్రం నిరసన నిర్వహించినట్లు యుటియఫ్ జిల్లా అధ్యక్ష కార్యదర్శులు జి. ప్రభుదాసు, ఎం. హనుమంత రావు తెలిపారు. యుటియఫ్ రాష్ట్ర కమిటీ పిడిఎఫ్ ఎమ్మెల్సీల కృషి మేరకు ఎయిడెడ్ ఉపాధ్యాయుల ఎరియర్స్ బిల్స్‌కి సంబంధించిన సొమ్ము మార్చి 28 నాటికి వచ్చి డిఈవో కార్యాలయంలో మంజూరై సంబంధిత ఎస్‌టిఓ కార్యాలయంలో పేపర్ టోకెన్ వేసినా ఎరియర్స్ చెల్లించకుండా నిర్లక్ష్యం ప్రదర్శించినందుకు యుటియఫ్ ఆధ్వర్యంలో డిఈవో కార్యాలయం ఎదుట వందలాది ఎయిడెడ్ ఉపాధ్యాయులతో నిరసన చేయడం జరిగిందని తెలిపారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి ఎన్. తాండవకృష్ణ మాట్లాడుతూ సవతి తల్లిప్రేమను ఎయిడెడ్ పట్ల మానుకోవాలని, వెంటనే ఎరియర్స్ చెల్లించాలని లేకుంటే భవిష్యత్‌లో తీవ్ర పోరాటం చేస్తామని హెచ్చరించారు. ఈ సందర్భంగా డిఈఓ మాట్లాడుతూ పది రోజుల లోపు సమస్య పరిష్కారానికి ప్రయత్నం చేస్తామని హామీ నిచ్చారు.

**ఖమ్మంలో**

ఉపాధ్యాయుల రేషనలైజేషన్, బదిలీ ఉత్తర్వుల్లో మార్పులు చేయాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్, ఎస్ఎల్‌టిఏ జిల్లా కమిటీల ఆధ్వర్యంలో ఉపాధ్యాయులు మే 23న డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. 2 గంటలపాటు డిఇఓ కార్యాలయ సిబ్బంది ఆఫీస్‌లోకి వెళ్ళకుండా అడ్డుకున్నారు. యుటియఫ్ జిల్లా నాయకులు బి. నరసింహారావు, జి. రాజశేఖర్, సిహెచ్. దుర్గాభవాని, ఎస్ఎల్‌టిఏ నాయకులు వెంకటేశ్వర్లు ఉపాధ్యాయులనుద్దేశించి ప్రసంగించారు. డిఇఓ కార్యాలయ అసిస్టెంట్ డైరెక్టర్‌కు మెమోరాండం సమర్పించారు. డిఇఓ ఆఫీసు కార్యక్రమాలు జరగకుండా అడ్డుకోవడంతో పోలీసులు

యుటియఫ్, ఎస్‌ఎల్‌టిఏ నాయకులను అరెస్టు చేసి పోలీస్ స్టేషన్‌కు తరలించి అనంతరం వ్యక్తిగత పూచీకత్తుపై విడుదల చేశారు.

**ఒంగోలులో యుటియఫ్ రిలే దీక్షలు విజయవంతం**

ప్రకాశం జిల్లా డిఇఓ కార్యాలయంలో అపరిష్కృత సమస్యల పరిష్కారం కొరకు మే 2న యుటియఫ్ జిల్లాశాఖ ఒంగోలు డిఇఓ కార్యాలయము ఎదుట రిలే నిరాహారదీక్షలు నిర్వహించింది. దీక్షలపై కలెక్టరు స్పందించి, జాయింట్ కలెక్టరును యుటియఫ్ నాయకులతో చర్చలు జరపమని ఆదేశించారు. ఆ మేరకు అదే రోజు మధ్యాహ్నం 3 గంటలకు జాయింట్ కలెక్టరు, పూర్వ ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి, యుటియఫ్ నాయకులు, డిఇఓ, ప్రాజెక్టు ఆఫీసరు, పరిషత్ విద్యాశాధికారి మధ్య చర్చలు జరిగాయి. సమస్యలపై జె.సి. సానుకూలంగా స్పందించి డిఇఓతో స్పష్టమైన హామీలు ఇప్పించి నిరాహారదీక్షలు విరమింప చేశారు.

కౌన్సిలింగ్‌కు విరుద్ధంగా జరిగిన నియామకాలపై చర్య తీసుకోవాడానికి, జూన్ 1న ప్రమోషన్స్ కౌన్సిలింగ్ నిర్వహించడానికి, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు మార్చి, ఏప్రిల్ నెల జీతాలు తక్షణమే చెల్లించడానికి తదితర సమస్యల పరిష్కారానికి హామీ ఇచ్చారు. సానుకూలంగా ఉన్నందున 3,4 తేదీలలో దీక్షలు తాత్కాలికంగా వాయిదా వేసినట్లు జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యులు రమణారెడ్డి, శ్రీనివాసరావు తెలిపారు.

**కడపలో**

రేషనలైజేషన్‌తో ప్రభుత్వ పాఠశాలలకు అపారమైన నష్టం జరుగుతుందని యుటియఫ్ కడప జిల్లా గౌరవాధ్యక్షుడు బీరం సుబ్బారెడ్డి ఆందోళన వ్యక్తం చేశారు. యుటియఫ్ ఆధ్వర్యంలో మే 23న జిల్లా విద్యాశాఖ కార్యాలయాన్ని ముట్టడించారు. గేటుకు తాళాలువేసి అక్కడే బైఠాయించారు. ఎస్‌ఎల్‌టీఏ రాష్ట్ర అధ్యక్షుడు జి. సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ బదిలీల ఉత్తర్వుల్లో మార్పులు చేయాలన్నారు. యుటియఫ్ జిల్లా అధ్యక్షుడు ఓబులరెడ్డి మాట్లాడుతూ బదిలీల మార్గదర్శకాల సవరణ అనంతరమే అమలు చేయాలని కోరారు. ముట్టడి కార్యక్రమాన్ని దాదాపు రెండు గంటలపాటు నిర్వహించారు. పోలీసుల జోక్యంతో విరమించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి బి. లక్ష్మీరాజా, ఎస్‌ఎల్‌టిఏ నాయకులు ఆదినారాయణ, ఏపిటీఏ నాయకులు రమణ, యుటియఫ్ కోశాధికారి సుబ్బరాజు తదితరులు పాల్గొన్నారు.

**గుంటూరులో**

రేషనలైజేషన్ జి.ఓ.లు 55,61లను రద్దు చేయాలని, మే 23న యుటియఫ్ డిమాండ్ చేసింది. సోమవారం యుటియఫ్ నాయకులు గుంటూరు జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయం ఎదుట ప్రదర్శన నిర్వహించి కార్యాలయాన్ని ముట్టడించేందుకు ప్రయత్నించారు. ధర్నానుద్దేశించి ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు మాట్లాడుతూ బదిలీల మార్గదర్శకాలకు సంబంధించిన జి.ఓ.65ను సమూలంగా మార్పు చేయాలన్నారు. జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం. హనుమంతరావు మాట్లాడుతూ ప్రభుత్వం దొడ్డిదారిన చేసిన అక్రమ బదిలీలు వెంటనే రద్దు చేయాలని డిమాండ్ చేశారు. జిల్లా అధ్యక్షులు జి. ప్రభుదాసు అధ్యక్షత వహించారు. పోలీసులు వెంటనే రంగంలోకి దిగి యుటియఫ్ నాయకులను, ఉపాధ్యాయులను అరెస్టు చేసి పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అరెస్టయిన వారిలో నాయకులు ఎన్. తాండవకృష్ణ, ఎం. హనుమంతరావు, సిహెచ్. పద్మావతి, తదితరులతో పాటు 200మంది ఉపాధ్యాయులు ఉన్నారు.

**గుంటూరులో బదిలీలు పారదర్శకంగా అమలు చేయాలి**

యుటియఫ్ ఆధ్వర్యంలో ఉపాధ్యాయుల బదిలీలపై అవగాహనా సదస్సు నిర్వహించారు. జిల్లా అధ్యక్షుడు జి. ప్రభుదాసు అధ్యక్షత వహించి మాట్లాడుతూ విద్యాహక్కు చట్టం ప్రకారం అవసరం అయిన పాఠశాలలకు అదనంగా పోస్టులు మంజూరు చేయాలని డిమాండ్ చేశారు. రాష్ట్ర కార్యదర్శి ఎన్. తాండవకృష్ణ మాట్లాడుతూ జి.ఓ.55ను సమూలంగా మార్పు చేయాలని డిమాండ్ చేశారు. జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం. హనుమంత రావు జి.ఓ.లనువివరించారు. ఈ సదస్సులో జిల్లా కార్యదర్శులు సిహెచ్. పద్మావతి, టి. మల్లేశ్వర రావు, కె. హనుమంతరావు, శివపూర్ణయ్య, ఆదిలక్ష్మి పాల్గొన్నారు.

**జి.ఓ. 55,61లను నిలిపేయండి**

ఉపాధ్యాయ పోస్టుల క్రమబద్ధీకరణకు జారీ చేసిన జీ.ఓ.లు 55,61లను తక్షణం నిలుపుదల చేయాలంటూ యుటియఫ్ కృష్ణా జిల్లా శాఖ ఆధ్వర్యంలో దాదాపు 100 మంది ఉపాధ్యాయులు మే 23న జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయాన్ని ముట్టడించారు. యుటియఫ్ జిల్లా అధ్యక్షుడు ఏ.ఉమామహేశ్వర రావు మాట్లాడుతూ ఉపాధ్యాయ పోస్టుల అక్రమ క్రమబద్ధీకరణ వల్ల విద్యాహక్కు చట్టం స్ఫూర్తి దెబ్బతింటుందని ఆందోళన వ్యక్తం చేశారు. వెంటనే ఉపాధ్యాయుల అక్రమ క్రమబద్ధీ కరణను ఆపాలని డిమాండ్ చేశారు.

బదిలీ మార్గదర్శకాల్లో మార్పులు చేయాలని యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి బి. నాగేశ్వరరావు ముట్టడిలో పాల్గొని డిమాండ్ చేశారు. ఉపాధ్యాయులను అరెస్టు చేసి చిలకలపూడి పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అనంతరం సొంతపూచికత్తుపై విడుదల చేశారు.

**జాక్టా ఆధ్వర్యంలో హైదరాబాదు డిఇఓ కార్యాలయ ముట్టడి**

రేషనలైజేషన్ జి.ఓ. 55ను తక్షణం రద్దు చేయాలని, గతంలో మూసివేసిన పాఠశాలలన్నింటిని వెంటనే తెరిపించాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్ జిల్లా జాక్టా ఆధ్వర్యంలో జూన్ 2వ తేదీన వందలాది మందితో డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించారు. యుటియఫ్ అధ్యక్షులు ఎన్. నారాయణ హాజరై ప్రసంగిస్తూ ప్రభుత్వ పాఠశాలలను రక్షించాలనే చిత్తశుద్ధి ప్రభుత్వానికి లేదని, విద్యాచట్టం ప్రకారం రాష్ట్రంలో 65,000 ఉపాధ్యాయ పోస్టులను మంజూరు చేయవలసి ఉండగా ఉన్న వారినే అదనంగా చూపుతున్నారని విమర్శించారు. డిటిఎఫ్ రాష్ట్ర నాయకులు నరసింగరావు, అనీసుర్ రహమాన్, యుటియఫ్ నుండి ఎం. సంయుక్త, మేడె దేవదాసు, ఎన్. రమేష్, ఎస్.వై. కొండలరావు, జాక్టా స్టీరింగ్ కమిటీ నాయకులు మల్లయ్య, నాగేశ్వర రావు, రామసుబ్బారావు, అఫ్జల్, బాసిత్‌ఖాన్ మెుయిద్, షక్రు తదితరులు పాల్గొన్నారు. తన కార్యాలయానికి చేరుకుంటున్న డిఇఓ సుశీందర్ రావును కార్యకర్తలు అడ్డుకోవడంతో ఉద్రిక్త పరిస్థితి తలెత్తింది. రాష్ట్ర నాయకులతో సహా కార్యకర్తలందరినీ పోలీసులు అరెస్టు చేసి నాంపల్లి పోలీస్ స్టేషన్‌కి తరలించారు. అనంతరం వదిలిపెట్టారు.

ప్రభుత్వ ఉత్తర్వులు

పాఠశాలలో. ఉపాధ్యాయుల క్రమబద్ధీకరణ నిబంధనలు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

Norms for Rationalisation of Schools, Posts and Staff under various managements viz., Government, Zilla Parishad, Mandal Praja Parishad, Municipal Schools – Orders - Issued.

**EDUCATION (SER.III) DEPARTMENT**

**G.O.Ms.No.55** **Dated: 23-04-2011.**

**Read the following:**

1. G.O.Ms.No.103, Edn. (Ser.V) Dept., dated. 5.08.2005
2. G.O.Ms.No.28, Edn.(SE.Ser.III) Dept., dt. 21.06.2010
3. Govt. Memo.No.25182/SE.Ser.III/2010, dt. 03.12.2010.
4. Minutes of the Committee dated 05.02.2011

***

**ORDER:**

Under Right to Education (RTE) Act 2009, the Right to Education is accorded the same legal status as the Right to Life as provided by Article 21 (a) of Indian Constitution. Every child in age group of 6 to 14 years will have to be provided upto 8 years of Elementary Education on admission to an age appropriate class in the vicinity of his / her neighborhood.

**Right to Education Act 2009 at Section 25(1) reads:-**

"Within six months from the date of commencement of this Act, the appropriate Government and the local authority shall ensure that the Pupil-Teacher Ratio, as specified in the Schedule, is maintained in each school."

2. Accordingly, this exercise of Rationalization of staff in schools is taken up strictly in accordance with norms and standards given in the schedule of the Act to implement this provision of the Act. In this regard, the Government have constituted a committee to submit a report on the modalities for rationalization of teachers working in Primary, Upper Primary and High Schools (Govt./ZP/MP) in the State based on the data available as on 01.12.2010
3. Accordingly, the Committee has reported in its minutes in the reference 4th read above that there is a need to rationalize the staff in schools and posts in Primary, Upper Primary and High Schools as there are some schools with over strength of students vis-à-vis the sanctioned teaching posts and on the other hand some schools with uneconomic strength of students with more teachers.
4. To rectify this imbalance, the Government after careful consideration hereby issue the norms of staff pattern for rationalization of staff under various managements in supercession of the orders issued in the reference 1st read above, as given in the annexure I, II & III appended showing staffing pattern for Primary School, Upper Primary School and a High School respectively. Further the norms of shifting of surplus posts on the basis of this staff pattern now notified are given in Annexure –IV.

**CONSTITUTION OF COMMITTEE AT DISTRICT LEVEL:**

**The Committee consists of the following:-**

| | |
|---|---|
| 1. District Collector | Chairman |
| 2. Chief Executive Officer, Zilla Parishad | Member |
| 3. P.O.I.T.D.A | Member |
| 4 Municipal Commissioner | Member |
| 5. District Educational Officer. | Member-Secretary |

5. The Committee is competent to rationalize the teaching staff in schools following the staffing pattern as detailed in the Annexures under various managements i.e., Government, Zilla Parishad, Mandal Parishad, Municipal & Tribal Welfare / ITDA Schools in the District.
6. This exercise of rationalization of teaching staff in schools shall commence immediately after completion of SSC spot valuation of April, 2011 and teachers on redeployment / reposting in consequence of this exercise shall be in position in new places by the time of reopening of the schools in June, 2011 for the academic year2011-12.
7. Rationalization shall be done every year before commencement of Academic year.
8. It is further clarified that of account of this rationalization there shall be no creation of any new post or reduction in sanctioned posts in a District, with District taken as a unit for each management.
9. The Commissioner and Director of School Education is requested to issue further guidelines on implementation of this exercise.
10. This orders issues with the concurrence of Finance (ESE) Department vide their U.O.No.6061/136/ESE/2011, Dated: 15-04-2011.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P)**

**DR. D. SAMBASIVA RAO**

PRINCIPAL SECRETARY TO GOVERNMENT

***

రేషనలైజేషన్ నిబంధనలలో కొన్ని మార్పులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

Norms for Rationalization of Schools, Posts and Staff under various Managements viz., Government, Zilla parishad, Mandal Praja Parishad, Municipal Schools – Modification orders – Issued.

**EDUCATION (SE-SER-III) DEPARTMENT**

**G.O.Ms.No 61** **Dated:16.05.2011**

Read the following

1. G.O.Ms.No.55 Education (SE-Ser-III) Dept, dt:23.04.2011
2. From the C& DSE, Hyd Lr.Rc.No.C3-2/2010, dt:03.05.2011. .

***

**ORDER:-**

In the circumstance reported by the commissioner & Director of School Education, AP, Hyderabad in the letter 2nd read above and after careful examination of the proposal, the following modifications are issued to the G.O. 1st read above.

(i) After providing LFL HM posts to the Primary Schools having strength of 151 and above, the balance of LFL posts may be adjusted in the schools having the enrolment up to 80 in the descending order.

(ii) The annexure III of G.O.1st read above is applicable to schools other SUCCESS High Schools. In respect of SUCCESS High Schools, in addition to the staff pattern in Annexure-III, the following School Assistant posts are to be provided to the English medium sections.

1. School Assistant (Maths)
2. School Assistant (English)
3. School Assistant (Social Studies)
4. School Assistant (Bio. Science)

(iii) One Vidya Volunteer shall be allotted to the Primary Schools having strength of 1 to 10 and 1 SGT shall be allotted to the Schools having strength 11 to 19.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**Dr.D.SAMBASIVA RAO**

PRINCIPAL SECRETARY TO GOVERNMENT

***

## 01.09.04కు ముందు అప్రెంటీస్ శిక్షణ సర్వీస్ కలిగి 01.07.08కంటే ముందు మరణించిన ఉద్యోగి కుటుంబానికి పెన్షన్ అర్హత కల్పిస్తూ జి.ఓ.178కి సవరణ ఉత్తర్వులు

### GOVERNMENT OF ANDHRA PRADESH
### ABSTRACT

**PENSIONS** – Training period of employees – Reckoning the period as qualifying service for the purpose of pension – Amendment – Issued.

**FINANCE (PENSION-I) DEPARTMENT**

**G.O.Ms.No. 69** **Dated:28.04.2011**

**Read the following:-**

1. G.O. (P) No.88 Fin. & Plg. (FW.Pen.I) Dept., dt 26.3.1980.
2. G.O.Ms.No.438 G.A. (Spl.A) Dept., dated.07.07.2008.
3. G.O.Ms.No.598 G.A. (Spl.A) Dept., dated. 26.11.2009.
4. G.O.Ms.No.178, FIN. (PENSION-I) Dept., Dt.17.05.2010
5. Letter No.367/2010 dt. 11-12-2010 of Sri. Pochim Reddy Subba Reddy, MLC.

* * * * *

**ORDER:**

In the Government Order 4th read above, orders were issued that in respect of the employees who retired/ retire on or after 1.7.2008, the training period of the employees for whom training or apprenticeship is a pre-requisite shall be reckoned as qualifying service for purpose of pensionary benefits irrespective of the fact whether he/ she was paid salary or stipend for the period of training/ apprenticeship, if any, if such period of training/ apprenticeship is a pre- requisite for appointment .

2. In the letter 5th read above, Sri Pochim Reddy Subba Reddy MLC has stated that the orders issued in G.O.Ms.No.178, Finance (Pen.I) Department, dated 17-05-2010 come into force with effective from 1-7- 2008, resulting those who joined apprenticeship service will only get pension, but the legal heirs of deceased employees are not eligible to get pension. Hence, he has requested to issue an amendment to the said orders to make it applicable to the legal heirs of those who joined prior to 1-7-2008 as apprenticeship teachers and expired while in service to get family pension.

3. Government, after careful consideration of the matter, have decided to extend the benefit of treating the training/ apprenticeship period for pension purpose to all the employees who retired or retire from service as on or after 1-7-2008 and as well as in respect of employees who died prior to 1-7-2008.

4. The G.O is available on Internet and can be accessed at the address http://www.ap.gov.in/goir

5. Accordingly, the following notification will be published in an Extraordinary issue of the Andhra Pradesh Gazettee dated 28.04.2011.

**NOTIFICATION**

In exercise of the powers conferred by the proviso to Article 309 of the Constitution of India and of all the powers hereunto enabling the Governor of Andhra Pradesh hereby makes the following amendment to the Andhra Pradesh Revised Pension Rules, 1980 issued in G.O.(P) No.88 Finance & Planning (Fw.Pen.I) Department dated 26.03.1980, as subsequently amended from time to time.

**AMENDMENT**

In the proviso to rule 16 of the said rules, the expression **"In respect of employees who retired/retire on or after 1-7-2008"** shall be omitted.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P)**

**L.V.SUBRAHMANYAM**

PRINCIPAL SECRETARY TO GOVERNMENT (FP)

***

## నూతన (6/12/18/24 సం॥ల) ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము ఉత్తర్వులు

### GOVERNMENT OF ANDHRA PRADESH
### ABSTRACT

Public Services – Implementation of Automatic Advancement Scheme – Modified Orders – Issued.

**FINANCE (PAY COMMISSION – II) DEPARTMENT**

**G.O.Ms.No.96** **Dated:20.05.2011**

**Read the following:-**

1. G.O.Ms.No.117 Fin & Plg (FW.PRC.I) Dept., dt 25.05.1981.
2. G.O.Ms.No.164 Fin & Plg (PRC.I) Dept., dated 01.06.1982.
3. G.O.Ms.No.297 Fin & Plg (PRC.I) Dept., dated 25.10.1983.
4. G.O.(P).No.2 Fin & Plg (PRC.I) Dept., dated 04.01.1988.
5. G.O.(P) No.290 Fin & Plg. (PC.II) Dept., dated 22.07.1993.
6. G.O.Ms.No.311 Fin & Plg (PC.II) Dept., dated 20.08.1993.
7. G.O.(P).No.362 Fin & Plg (FW.PC.II) Dept.,dt. 28.10.1994.
8. G.O.(P).No.150 Fin & Plg (PC.II) Dept., dated 01.09.1999.
9. G.O.(P).No.241 Fin & Plg (PC.II) Dept., dated 28.09.2005.
10. G.O.(P).No.201 Fin & Plg (PC.II) Dept., dated 10.07.2006.
11. Govt.Cir.Memo.No.038035/199/PC.II/ 2008,Fin.(PC.I)dept.,dt.19.09.2009
12. G.O.Ms.No.93 Fin & Plg (PC.II) Dept., dated 03.04.2010.
13. Agreement between the Government and JAC of employees Teachers and Pensioners on 23.01.2011

* * * * *

**ORDER:**

The Government in the order first read above, introduced the Automatic Advancement Scheme to the State Government employees and employees of Local Bodies as a substitute for those who are entitled to get promotions, but are unable to get them at regular intervals because of stagnation due to non-availability of vacancies. According to this Scheme, every employee after a service of ten years in a particular scale shall be eligible for the next higher scale, called Special Grade Post Scale. A Government Employee

